# పరిశోధన

(సారస్వత ద్వైమాస పత్రిక)

PARISHODHANA ( BI-MONTHLY)
Published since 1954
Now Ceased
Literary Research
Editor: Tirumala Ramachandra

జయ : వర్షర్తు

శ్రీ ప్రభాకర సంస్మరణ సంచిక



3

ఒక రూపాయి ఆగస్టు-సెప్టెంబరు 1954

# అనుక్రమణిక







సంపుటి 1.
సంచిక 8.

సంపాదకుడు
తిరుమల
రామచంద్ర

సంయుక్త
సంపాదకుడు :
తిమ్మావజ్ఝల
కోదండరామయ్య






# మాటలు

ఆంధ్రవాఙ్మయ ప్రపంచంలో ఎటుచూచినా ఏడు నిలువుల ఎత్తున సాక్షాత్కరిస్తారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

కలం పట్టినప్పు డెల్ల కలకాలం నిలచే కొత్తసంగతి తెలుపడమే ఆయన ప్రజ్ఞ; అదే ఆయన ప్రతిజ్ఞ. సజాతీయ విజాతీయ భాషాసాహిత్యాల అంచులు చూచి, లోతులు తీసి, సాదృశ్య వైదృశ్యాల సమ్యగ్దృష్టితో మథించి, మీదు కట్టిన మేలిమీగడలతో తెలుగుతేటలను కూర్చి తేర్చి తెలుగుజాతికి అందివ్వడం ఆయన ఉపజ్ఞ; అట్టి సమన్వయమే రసప్రలుబ్ధులకు, పరిశోధనపరాయణులకు రసాయనమని ఆయన ఆజ్ఞ.

జీవితంలో అనుపదం, అనుక్షణం, అన్వణువు సత్యగవేషణే ఆయన సాగించిన యోగం; అదే ఆయన ఆశించినభోగం. నేటి ఎగుడుదిగుడు సమాజంలో కష్టజీవుల కరుణగాథలకు జలజల కన్నీరు జాలువార్చడం, ఆ కన్నీటి వెలుగులలో సహానుభూతి సహకారాలు వెలార్చడం ఆయన హృదయం; అదే ఆయన సాధించినఅభ్యుదయం. కత్తిమీది సాముగా, సాహిత్యపాంథులకు ఏడుగడగా మనుగడ గడపిన ఆ మనస్వికి, కళాతపస్వికి, తానవ మెఱుగనిమానవంతో గోమతేశ్వరుని గండరువునిలువు నిలచినయశస్వికి ఇవే మా పరసహస్రసమోవాకాలు.

ఆయన చతుర్థవర్ధంతి దివ్యసంస్మరణకు కానుకగా ఈ సంచికను అర్పిస్తున్నందుకు ధన్యుల మని విన్నవించుకుంటున్నాము.

# భాషా వికాసము

వే. ప్రభాకర శాస్త్రి

[సంఘంతోడిదే భాష. పరిణామశీల మైనసంఘం మారుతున్నప్పుడు దానితో భాషాకూడా మార్పు చెందడం సహజం; చెందక తప్పదు కూడ. ఈరహస్యాన్ని ఉత్తమభాషాశాస్త్రజ్ఞులు కావడం చేత ఎన్నడో గుర్తించిన శ్రీ శాస్త్రిగారు భాషావికాసంయెడల ఉదార మయిన దృక్పథం అలవరుచుకొని అన్యభాషాపదజాలంతో మన మన భాషలను పరిపుష్టపరుచుకొంటూ, మారుతున్న భాషకు యెప్పటికప్పుడు వ్యాకరణాదినియమాలు కల్పించుకొంటూ ఉండాలని ఆశించారు. అలానే ఆదేశించారు. భాషా వికాసాన్నిగూర్చి వారి విశాలదృక్పథాన్ని తెలివిడి చేసే యీ వ్యాసం ఇక్కడ ప్రచురిస్తున్నాము. —సంపాదకులు.]

భాషావికాసము మానవవికాసము ననుసరించి ఉంటుంది. మానవ హృదయము అంటే మానవ భావములు సున్నితమైన కొద్దీ మానవశరీరము సున్నిత మవుతుంది. ఆరెంటిని అనుసరించి భాషకూడా సున్నిత మవుతుంది.

మానవ హృదయములూ, శరీరములూ ఏదో అభూతపూర్వము కనుక అనిర్వచనీయ మైన పరమార్థమునకు అభిముఖములై సాగుతూ పరిపక్వతకు వస్తూఉన్నవి. అట్లే భాషలు కూడాను.

మానవ హృదయమునకు, అంటే మానవ భావమునకు మానవ శరీరమునకు, మానవ భాషకు పరిపూర్ణతాశాశ్వతతాస్థితులు ఇంత వరకు ఏర్పడలేదు.

మానవుడు పుట్టింది మొదలుకొని గిట్టేదాకా స్థలస్థలమూ, క్షణక్షణమూ - అంటే ప్రతికాలలేశంలోనూ, ప్రతి దేశలేశంలోనూ కూడా తన స్వరూప స్వభావాలలో మార్పు చెందుతూనే ఉన్నాడు. అలాగే ప్రతి దేశలేశంలోనూ, ప్రతి కాలలేశంలోనూ కూడా ప్రతి మానవ ముఖయంత్రంలోనూ భాష విభిన్నలక్షణాలతో కొంత కొంత రాలిపోతూ మరి ఎంతో విజృంభిస్తూ పెంపొందుతూ ఉన్నది.

వృక్ష విజృంభణము వంటిదే మానవతా విజృంభణమూ, వారి భాషల విజృంభణమూనూ. శబ్దశాస్త్రవేత్తలు వృక్షశాస్త్ర వేత్తలవలె దొరికే ప్రతి శబ్దమూనూ శ్రమించి, దాని పుట్టుపూర్వోత్తరాలు, ఇప్పటివరకు అది చెందిన పరివర్తనాలు, అర్థంలోనూ, రూపంలోనూ కూడా గుర్తించి, నిరూపించి ప్రకటిస్తారు. భావికాలంలో అవీ మారిపోగలవు. ఆ మార్పులను భావికాలంవారు పరిగణించి ప్రకటించగలరు. దాని స్వరూప స్వభావాలను, ఉపయోగాలను గుర్తించడమూ, వానిని ప్రకటించడము మాత్రమే వారిపనిగాని, వానిని వేనిని గాని తార్మారు చేయడంగాని, చంపడంగాని, పుట్టించడంగాని వారిపని గాదు... శాస్త్రకారులిట్లా ఉంటూ ఉంటే ప్రజలు ఆయా శబ్దరూపాలకు వైరస్య సారస్యాల వల్ల సౌకర్యాసౌకర్యాలవల్ల కాలక్రమాన కుంపుపెంపులు జరిగిస్తూ ఉంటారు.

మానవవర్గం అన్యోన్యాశ్రయంలోనే ఆది కాలంనుండీ అభివృద్ధి చెందుతుంది. ఇప్పుడు మరీ ప్రపంచ ప్రజలు అందరూ కలగాపులగంగా ఐక్యం అయిపోతున్నారు. రైళ్లవల్లా, స్టీమర్లవల్లా, విమానాలవల్లా, రేడియోలవల్లా దూరదేశాలు కడు చేరికకు వచ్చినవి. మనుపు సంబంధం లేనిదేశాలతో ఇప్పుడు అనుబంధాలు అధిక మవుతున్నవి. హృదయాలు విశాలాలు కావడంచేతా, ప్రజానుబంధాలు విశాలాలు కావడంచేతా, ఒక భాష మాటాడే ప్రజలలో

సంబంధాలు సాన్నిహిత్యం చెందడంతోబాటు ఇతరభాషలవారితో కూడా వ్యవహార బాంధవ్యాది సంబంధాలు జరుగుతూ ఉండడం చేతా, విభిన్న భాషలకు కూడా సాన్నిహిత్యం ఏర్పడుతోంది.

అవి గర్హ్యము లని నిందిస్తూ కూర్చునేవారు కూర్చుంటున్నారు. కానీ సాగిపోయేవి సాగిపోతున్నవి. పరిపూర్ణంగా పర్యాలోకించి, పర్యవలోకించి చూస్తే ప్రపంచజాతు లన్నీ, ప్రపంచభాషా లన్నీ కూడా ఏకీభావం పొందవలసిన స్థితిలోకి దూకుతున్నట్టున్నవి. క్రమ పరిణామాలలో అది సిద్ధిస్తుందో, సిద్ధించదో కాని, అది యెట్లా ఉన్నా సద్యః భాషల సాంగత్యం, సాంకర్యం అనివార్యమే అనక తప్పదు.

అసలు నిజానికి భాషల అభివృద్ధికి, వికాసానికి ఈ సాంకర్యం అత్యావశ్యక మేమో అని కూడా అనిపిస్తుంది. నేడు ప్రపంచ భాషలలో కెల్లా ఇంగ్లీషు బహుదేశ బహుప్రజారూఢమై ఉన్నదనీ, పదసంఖ్యనుబట్టి కూడా అత్యాధిక్యమును చెంది ఉన్నదనీ అందరూ అంగీకరిస్తారు. ఆ భాష అట్టిది కావడానికి అది ప్రపంచ భాషలలోనుండి ఆవశ్యక పదజాలమును, భావబంధములను గ్రహించినది కావడం ముఖ్యహేతు వనవచ్చును. బాండికూట్ (పందికొక్కు) మాంగో (మాంగాయ్) ఇత్యాది పదా లెన్నో తెనుగునుండికూడా ఇంగ్లీషులోకి చేరినవి. ఇంగ్లీషువారు అట్లా చేర్చుకోవడం తమ భాషకు వికాసహేతు వనుకొంటోంటే మనవారు అంటే ఆంధ్ర ద్రవిడాదులు, మరీ ద్రవిడులు... కొందరు...ఇతర భాషల పదాలను వాడుకొంటూ మనవారు మనభాషను పాడు చేస్తున్నారంటున్నారు.

ఈ వింత వార్త మీ రంతా వినే ఉంటారు. యు. పి. లో కాబోలు ప్రజలు తమ భాషలో ఇంగ్లీషు పదాలు వాడ కూడదనీ, అట్లా ఎవరైనా వాడితే వాడినప్పుడల్లా పదానికి ఒక అణా చొప్పున జరిమానా చెల్లించవలసి ఉంటుం దని శాసనం చేశారట. అట్లా వాడినందుకు కొన్ని అణాలు ఎవరికో శిక్ష విధించినారట కూడా. ఇది చాలా విడ్డూరంగా ఉన్నది. ఇంగ్లీషు వారిమీదా, వారి భాషమీదా, వారి నాగరికత మీదా స్వరాజ్య సంపాదన ప్రయత్నారంభ కాలంలో కలిగిన విద్వేషవృత్తి ప్రస్ఫుటలే యిటువంటిపనులు.

ఇంతకంటే విడ్డూర మేమిటంటే మనవారే కొందరు ఇంగ్లీషు పదాలను, అంకెలను వాడక పోవడంతోపాటు అరవవారివలె భాషలో సంస్కృతసమ సంస్కృతభవ పదాలను కూడా వాడకుండా మడిగట్టుకోవాలని చూస్తున్నారు. ఇవి నిర్వాహం చెందే సంకల్పాలు కావు. ఏమంటే భాష అనేది ఎప్పుడు కానీ సాంకర్యం లేకుండా స్వయము తనకు తానై ఎక్కడా వెలయడం ఎప్పుడూ జరుగలేదు. అది అలా వెలయజాలదు. అనేక కుటుంబాల సాంకర్యంచే మానవజాతి ఏర్పడ్డట్టే, అనేక భాషా కుటుంబాల సాంకర్యంచే భాషాజాతు లేర్పడ్డవి. ఇప్పుడు తెలుగని వ్యవహరింపబడే భాష ఎన్ని సాంకర్యాలతోనో వెలసినది. ఎన్ని సాంకర్యాలతోనో పెంపొందినది. ఈ నాడు కూడా తెలుగులో ఎన్నో ఇంగ్లీషు, బెంగాలి, హిందీ వాక్యనిర్మాణ రీతులు, శబ్దప్రయోగములు చొరబారినవి. వీనిని విధ్వంసపరుప నక్కర లేదు. విధ్వంసపరుపరాదు. అలా విధ్వంసపరుప సాధ్యమూ కాదు కూడాను. ఆరంభదశలో అట్టివి కొన్ని ఎరుగని వారికి ఎబ్బెట్టుగా తోస్తవి కాని పరిపాటిమీద పరుసుకు పోతవి.

అతడు గ్రంథమును వ్రాసినాడు...అనుట తెలుగుపలుకుబడి కాదు. కమ్మ వ్రాసినాడు. జాబు వ్రాసినారు అనుటే కాని గ్రంథము వ్రాసినాడు అనుట ప్రాచీనుల పలుకుబడి కాదు. వ్రాయుట లిపికారుని పని. అందు రచనా చమత్కృతి లేదు. గ్రంథము రచించినాడు. కబ్బము కట్టినాడు. కబ్బము చెప్పినాడు అనుట ప్రాత తెలుగు పలుకుబడి. అయినా నేడు అనేకులు గ్రంథము వ్రాసినాడు అని వ్రాయుచున్నారు. ఇది ఇంగ్లీషు పలుకుబడి. తెలుగులో రూఢి కెక్కినది. ఇక తొలగింప కుదురదు. తొలగింప నక్కర లేదు.

గ్రామాధికారిని కరణ మని పిలుతురు అనుట తెలుగు పలుకుబడి కాదు. కరణ మందురు. కరణ మని పేర్కొందురు అనుట తెలుగు పలుకుబడి. కరణ మని పిలుతురు అనుట ఇంగ్లీషు పలుకుబడికి తెలుగు. భాషలో రూఢ మైనది. ఇక తొలగింప సాధ్యము కాదు.

రూఢి కెక్కిన తరువాత తప్పుగా భావించడం తొలగిపోతుంది. ఇట్టి వాని నెన్నింటినో చూపవచ్చును.

పూర్వము సంస్కృతసమ సంస్కృతభవ ప్రాకృతభవములు తెలుగులో చేరినట్టే నేడు తురుష్కసమ తురుష్కభవ ఆంగ్లసమ ఆంగ్లభవ పదములూ చేరినవి. రైళ్ళను, రోడ్లను, సైకిళ్ళను, కలెక్టర్లను, తాలూకాలను, జిల్లాలను ఇక తొలగింపజాలము. వీటిని పుస్తకాలలో అనుకరణచిహ్నాలతో ఇంకా ఎన్నాళ్ళని బహిష్కారంతో ఉంచడం? ఈ బహిష్కారం తొలగి పోక తప్పదు.

అట్లే మాండలిక ప్రయోగ వైవిధ్యాలను కూడా ఇక దిగద్రొక్క జాలము. ఆయా ప్రయోగాలలో ఒక మాధుర్య మున్నది. ఆయా రూపములను అక్కడక్కడి ప్రజలు స్వస్థాన వేష భాషాభిమాను లయి ఆదరిస్తారు. ఆయాదరణమును ఇతరు లెవరూ కాదు కూడ దని గర్హింపరాదు. గర్హింపబోయినా సాగదు.

విశాఖ జిల్లావారు వెళ్ళిపోయి వచ్చాడు, 'ఎల్ పోయొచ్చాడు' అంటారు. అది వారి నాలుకమీద తేలికగా తేలియాడే తేటపలుకు. నైజాంవారు 'వాడువచ్చినడు' 'వాడువచ్చిండు' అంటారు.—మధ్యాంధ్రదేశం వారు 'వాడు వచ్చివేసినాడు' 'వాడు వచ్చేశాడు' అంటారు. మదరాసు వారు 'వాడు పోయి విడిచినాడు' 'వాడు వూడ్చినాడు' అంటారు. ఈ ప్రయోగాలన్నీ గ్రాహ్యాలే. అచ్చమయిన తెలుగు ఫలానా జిల్లాదే. ఆ జిల్లా ప్రయోగాలే గ్రాహ్యాలు. ఇతరము లన్నీ పరిత్యాజ్యాలు అని యెవరూ యెవరినీ గర్హింప జాలరు. గర్హించకూడదు.

ఇటా అన్ని జిల్లాల భాషలను ఆదరించేటట్టయితే అవ్యవస్థగా భాష చెడిపోతుందేమోనని భయపడుతున్నారు కొందరు. ఆయా పదాలు ప్రయోగించే ప్రజలూ చెడిపోయేవా రయితే ఆయా పదాలూ చెడిపోతవి. ఆ భాషా చెడిపోతుంది. ఆయా ప్రజలు సంఘంలో అభ్యుదయం చెందేవా రయితే వారి పదప్రయోగాలూ భాషాసంఘంలో అభ్యుదయం చెందేవే అవుతవి.

ఆంధ్రులు అనేకజిల్లాలలో వెల్లివిరిసి వేరువేరు స్వరూపస్వభావాలతో పెంపొందుతూ వైవిధ్యంలో ఏకవిధ్యం వెలయించుకొంటూ వస్తున్నట్లే బహు మండలాల్లో బహుముఖాల వేర్పాని పెంపొందుతూ ఉన్న భాషకూడా తన వైవిధ్యంలోనుండి ఆంధ్రతారూపమైన యైకవిధ్యాన్ని వెలయించుకొంటూనే ఉంటుంది.

'రాజానుమతో ధర్మః' అన్నట్టు ఇంతదాకా విద్యాశాలల్లో ఇంగ్లీషు ప్రధాన భాషగా ఉంటూ వచ్చింది. ఇకమీదట దేశభాషలకే ప్రాధాన్యం ఏర్పడనున్నది. సర్వశాస్త్రాలూ దేశభాషలలోనే వెలయనున్నవి. కాని ఇందులో చిక్కయిన వింత విషయం ఒకటి ఉన్నది.

ఆయా శాస్త్ర పారిభాషిక పదాలన్నీ ఇదివరకు ఇంగ్లీషులోనూ, కొన్ని కల్పిత సంస్కృతంలోనూ ఉంటూ వచ్చినవి. ఇక విద్యావ్యవహారా లన్నీ దేశభాషలోనే ఉండవలెనంటే భారతదేశానికంతా ఏకవిధంగా ఉండేటట్లు విద్యాశాఖ వారు వాటిని క్రొత్తగా సృష్టించడంగానీ,, ఇంత బాధెందుకు? ఆంగ్ల పద బహిష్కార మెందుకు? ప్రాచీనులు జ్యోతిశ్శాస్త్రంలో హోరా ద్రేక్కాణీయాది పదాలను గ్రీకులనుండి గ్రహించినట్టు నేటివారు కూడా ప్రపంచ సామాన్య వ్యవహారంలో ఉన్న ఇంగ్లీషు పదాలనే వాడుకోవడం మంచి దని తలిస్తే వాటినే అంగీకరించడంగానీ చెయ్యవలసి ఉంటుంది. రెండో పద్ధతే మంచి దని నా ఉద్దేశము. దీనివల్ల ప్రపంచైక భాషా వ్యవహార నిర్మాణంలో శాస్త్రపారిభాషిక పదాల వరకైనా ఏకవిధ్యం అనువు పడుతుంది. మన విజ్ఞానంలోనే సర్వప్రపంచవిజ్ఞానాలూ అంతర్భవిస్తవి. ఆవిర్భవిస్తవి.

భారతీయ విజ్ఞానంనుండే సర్వదేశాలవారి విజ్ఞానాలూ పుట్టినవి అని తృప్తిపడి కూర్చుండే వారు కొందరున్నారు. అట్టివారు మామిడి టెంకను చేతిలో నుంచుకుని దీనిలోనే మామిడి పిందెల, కాయల, పండ్లరుచు లన్నీ చూస్తామనీ, మామిడిచిగుళ్ళతోడి కొమ్మలనీడ అనుభవిస్తామనీ సంతోషిస్తూ కూర్చుండేవారి సగోత్రులు. నిజంగా మన విజ్ఞానంనుండే ప్రపంచ విజ్ఞానమంతా వెల్లివిరిసినా మన మిప్పుడు ఆ మాటే పారాయణం చేస్తూ కూర్చుంటే లాభం లేదు.

సర్వభారతభాషలూ సంస్కృతంలోనుండే పుట్టిన వనే వాదం ఉన్నది. అది చాలావరకు సత్యమే కాని దానినిబట్టి సంస్కృతం ఒకటే నమ్ముకుని నేటి ప్రధానవ్యవహారా లన్నీ దేశ భాషలను విడిచిపెట్టి దానిలోనే సాగించ బూనితే భారతదేశవ్యవహారతంత్రం ఏది కాని కడతేరబోదు.

అమితవిజ్ఞానానికి ఆటపట్టయిన సంస్కృతం మన దేశభాష లన్నింటిలోనూ అనుగతమై జీర్ణించి వస్తూ ఉన్నది. అది భారతీయుల శరీరాలలో, రక్తకణాలలో అణువణువునా అనుగతమై ఉన్నది. శరీరికి శరీరానికిఎంత సంబంధం ఉన్నదో సంస్కృతానికి మన దేశభాషలకు అంత సంబంధం ఉన్నది. తెలుగు భాషలో నూటికి ఎనభైవంతున సంస్కృత పదా లున్నవి. మన భావ బంధ మంతా సంస్కృత భావబంధంలో అంటి పట్టుకొని ఉన్నది. మన పెళ్లిళ్లలో, ఊళ్లల్లో, నదులలో, చాళ్ళల్లో—గుళ్ళల్లో ఆచార వ్యవహారాలలో సర్వత్ర సంస్కృత వికాసం పొర్లి పొలుతున్నది. దేశభాషల పెంపు సంస్కృతపు పెంపే కాని వేరు కాదు. సంస్కృతంలో సంస్కృతమే ఉంది. కాని మన దేశభాష లలో సంస్కృత మంతా ఇమిడి ఉన్నది. ప్రాకృతా లన్నీ ఇంకా ఇప్పటిదాకా మన దేశంలో చెల్లుబడి కలిగి అధికారించిన తురుష్కాది భాషలలోని ఆవశ్యక పదజాల మంతా పొర్లు వారుతున్నది. తల్లిభాష అయిన సంస్కృతానికి ఈ వికాసం లేదుగదా... కాని ఆ తల్లి చలువే ఈ దేశభాష కింత వికాసం కలిగించింది. దేశ ప్రజలు దేశభాషలలో సర్వవ్యవహారాలూ సాగించ కలిగినా రంటే దేశభాషావికాసం దేదీప్యమానంగా వెలుగొందుతుం దన్నమాట కాదా?

సంస్కృత ప్రాకృతాది భారతీయ ప్రాచీన భాషలలోని గ్రంథా లింకా దేశభాషలలోనికి రానివి ఉంటే అవి సప్రయోజనా లయితే ఇక మీద కూడా తెచ్చుకోవచ్చును. ఇంగ్లీషు మొదలగు విదేశ భాషల విజ్ఞాన వికాసము నంతా మన భాషలలోనికి తెచ్చుకోవచ్చును. దేశ పాలకులు తలచుకొంటే కొద వేముంటుంది? విద్యాశాలలలో విద్యాబోధన దేశ భాషలలో సాగించడం, ప్రజా పాలనతంత్ర మంతా దేశభాషలలో సాగించడం ఎంత శీఘ్రంగా సాగుతుందో అంత శీఘ్రంగా దేశ భాషావికాసం కలుగుతుంది.

(ఆల్ ఇండియా రేడియో మద్రాసు కేంద్రం వారి సౌజన్యంతో.)

## విజయరామా ! రామతీర్థాశ్రయా !

గోగులపాటి కూర్మనాథకవి బమ్మెర పోతన కోవవాడు. కృతి నరాంకితం చేయ గూడ దనేది ఆయనశపథం. కాని ఒకవైపు విజయనగర రాజాశ్రయం, మరొక వైపు శపథం. ఎలా కుదురుతుంది? కనుక విజయరామభూపాలుణ్ణి, రామతీర్థ క్షేత్రస్వామిని ఏకకాలంలోనే సంబోధించి తనప్రతిన నిలబెట్టుకున్నాడు.

మ॥ సము లద్వైతను వారు, నీ స్మరణచే జెన్నైనదే నోరు, గ్రీ
ష్మములోఁ బారిన దేరు, సజ్జననివాసం బున్నదే యూరు, రో
గము బాగైనది వేరు, నీపదపరాగం బున్నదే నీరు, ధ
ర్మము చేకొన్నది పేరు శ్రీ విజయరామా! రామతీర్థాశ్రయా!

శా॥ స్వామిం గన్నదె పూఁట, పుణ్యనదిక్రేవ న్నున్నదే బాట, నీ
ధామం బున్నదె పేట, ధర్మసభ సత్యం బన్నదే మాట, యే
సీమన్ వస్తుసమృద్ధిచే భటులచేఁ జెల్వౌనదే కోట, పెన్
మామి ళ్లున్నదె తోట శ్రీవిజయరామా! రామతీర్థాశ్రయా!

# ఆంధ్రవాఙ్మయప్రభాకరుడు

శ్రీ నిడదవోలు వెంకటరావుగారు.



తెలుఁగుభాషా పరిణామమునుగూర్చి శాస్త్రుల వారి యభిప్రాయ మిది: "దక్షిణ హిందూ దేశ సమష్టి దేశభాషా వధూటి పసిప్రాయపుఁ బలుకు అరవము. ఎలప్రాయపుఁ బలుకు కన్నడము. నెఱతనపుఁ బలుకు తెలుఁగు." ఇది చారిత్రకముగను భాషాతత్త్వ శాస్త్రానుసారముగాను తెలుఁగుభాషయొక్క నైసర్గిక తత్త్వమును విశదీకరించును. అధునాతన భాషాశాస్త్రపద్ధతులను సంప్రదాయసిద్ధ మగు పరిజ్ఞానముతో నుపలబ్ధ భాషావాఙ్మయముతో సమీచీనముగా సమన్వయము చేసిన వారు శ్రీ శాస్త్రిగారే. నేఁడు వర్తమానాంధ్రభాషా శాసకు లని ప్రసిద్ధి గాంచిన కీర్తిశేషులు గిడుగు రామమూర్తి పంతులవారి వాదములోని సత్యమును, తత్త్వమును గ్రహించి యాచరణలో పెట్టిన వారు శాస్త్రిగారే. రామమూర్తి పంతులగారు ప్రాచ్య పాశ్చాత్య భాషాశాస్త్ర సిద్ధాంతములను సంపూర్ణముగ నాకళించిన మహావ్యక్తి. శాస్త్రిగారు పాశ్చాత్యభాషల నెఱుంగకయే నైకైకముగా నాంధ్రభాషా ప్రపంచము సామూలాగ్రముగా పరిశీలించి, పరిశోధించి పంతులవారితో సమానమగు ప్రతిభ గడించినారు. పంతులవారే శ్రీ శాస్త్రులవారిని క్రింది విధముగఁ బ్రశంసించి రన్న నేటి భాషాతత్త్వ శాస్త్రజ్ఞులలో శాస్త్రిగారి స్థాన మెట్టిదో విద్వల్లోకమే నిర్ణయింపఁగలదు. "బసవపురాణమునకు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినపీఠికలోను శివతత్త్వసారమునకు కీర్తిశేషులు కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు వ్రాసిన యుపోద్ఘాతములోను వారు ప్రాచీన గ్రంథ పరిష్కరణము ఎంత దుష్కరమో తెలియచేసినారు. మీఁద నే నుదాహరించిన భాషాలక్షణములకు వ్యవస్థ ప్రభాకరశాస్త్రి వంటి పండితులు నిరూపించలేక పోయినప్పుడు అపని సామాన్యులకు సాధ్యమా."

(బాలకవిశరణ్యము. పుట 815)

కాల్డ్వెలు మొదలగు పాశ్చాత్యభాషా శాస్త్రజ్ఞుల సిద్ధాంతములను దృష్టిలో నిడుకొని వానిని మనభాషకు సమన్వయింపజేయుట నేటి భాషాశాస్త్రజ్ఞులకు పరిపాటి యైనది. దాని వలన సహజమగు భాషాతత్త్వ పరిణామమును గూర్చి పరిశ్రమించుట కవకాశము తక్కువ యగుచున్నది. ఉపలబ్ధమగు భాషను సక్రమముగా పరిశీలించి కొన్ని సిద్ధాంతములను జేసి వానిని సర్వసాధారణమైన భాషాశాస్త్ర సిద్ధాంతములతో సరిపోల్చి చూచి సత్యాన్వేషణము గావించుట సరియగు పద్ధతి.

శ్రీ శాస్త్రిగారు నిరంతర తాళపత్ర గ్రంథ పరిశీలనా ఫలితముగా భాష, లిపి మొదలగు వాని పరిణామతత్త్వమును చక్కగ నవగాహన చేసికొనుటయే కాక ప్రాచీన భాషా వ్యవస్థను నిరూపించు శాసనభాషను బాగుగ గ్రహించి, వాని మూలమున తెనుఁగు భాషయొక్క తత్త్వమును తేటతెల్లము గావించినారు. ఇది యెంతయును సమంజసమగు మార్గము. ఈనాఁటి భాషాశాస్త్ర మంతయు నాంగ్లేయభాషయం దున్నది. కేవల ప్రాచ్య విద్యాపండితుల కది అందరాని దైనది. దానిచే వారి భాషాశాస్త్రజ్ఞానము సంప్రదాయ సిద్ధమగు వ్యాకరణములపై నాధారపడినది. ఆ వ్యాకరణ విషయములను చారిత్రకరీతిని గ్రహింపకపోవుటచే భాషాశాస్త్ర సిద్ధాంతములు ప్రాచ్యపండితుల కెఱుగరాని వైనవి. అట్టివారికి కూడ నూతన భాషాశాస్త్రసిద్ధాంతము లవగాహన మగుటకు శ్రీ శాస్త్రిగా రేర్పఱచిన పథకమే యాచరణీయమై యున్నది.

బసవపురాణపీఠికయందే కాక శాస్త్రులవారు ప్రకటించిన శాసనములయందుగూడ ప్రాచీనాంధ్రభాషా తత్త్వలిపి సంప్రదాయములను గూర్చి యెన్నియో నూతన విషయములను గుర్తించి వెలువరించినారు. వానిలో కొన్నింటినింగూర్చి మాత్రమే యిందు వివరించుచున్నాను.

నాగబు :

మన కుపలబ్ధమైన మొదటి తెనుగుపదమును కనిపెట్టిన కీర్తి శాస్త్రులగారిది. 'నాగబు' అను

పదము ప్రత్యేకముగ అమరావతి శాసనములందు లభించినది. ఇది రెండువేలయేండ్ల క్రిందటిది. 'నాగబు' అనునది 'నాగము' అను పదమునకు రూపాంతరము. సంస్కృతపదమగు 'నాగ' అనునది, 'బు' అను తెనుగు ప్రత్యయముతో వాడబడినది. అనగా నానాటికే అనగా క్రీస్తు పూర్వమే సంస్కృతపదములు తెలుగు ప్రత్యయములతో వ్యవహరింపబడినట్లు తెలియుచున్నది. మఱియు క్రైస్తవ శకానంతరము వెలసిన శాసనములలో, పట్టనబు, వక్రబు, సిద్ధాయబు మున్నగు రూపములు వెలయుచుండుటచేతను, సంవత్సరంబుల్ అను బిందుపూర్వక 'బు' రూపము క్రీ. శ. 506 లోనే కనబడుచుండుటచేతను శ్రీ శాస్త్రి గారు చూపిన రూపము సహజభాషాపరిణామమును సూచించుచున్నది. ఇంతే కాదు. ఇట్టి 'బు' 'ంబు' రూపములతో నున్న తత్సమ పదములు భాషాపరిణామమును తెలిసికొనుటకు ప్రధాన సాధనములు. తెనుగుభాష తత్సమ, తద్భవ, దేశ్య, గ్రామ్య విభాగముచే నాలుగు భాగములు గదా! అందు గ్రామ్య మనునది దేశ్యమునందలి పామరజనోచ్చారణభేదమువలన గలిగినది. ఇక మిగిలినవి మూడు. వానిలో దేశ్యము, దేశీయులగు తెలుగువారు మాటలాడు భాష—ఇది భాషాపరిణామము మొదటి దశ. దీనియందితర భాషాపదము లుండవు. తెలుగువారు తమకు స్వతస్సిద్ధమైన పలుకుబడి ననుసరించి యేర్పడినది. తరువాతిది తద్భవము. ఇది యేర్పడుటకు కారణము తెనుగువారు తమకు సంబంధించిన, విలక్షణము లగు సంస్కృత భాషాపదముల నా రీతినే వాడుకొనుట కలవాటు పడినప్పుడు సంస్కృతపదములు తత్సమానములై భాషలో తత్సమములుగా నేర్పడినవి. తెనుగు భాష ధాతురూప పదములకు ప్రత్యయములు చేర్చి వాడుకొను భాషావర్గమునకు జెందినది గాన, సంస్కృతపదములను యథామాత్రకముగా తెలుగు ప్రత్యయములను చేర్చి వాడుకొనుట తటస్థించినది. ఇది భాషాపరిణామమున మూడవదశ. దీనితో భాష పరిణతావస్థకు వచ్చినది. అతి విస్తృతమును, అర్థవంతము నగు సంస్కృత భాషా పదజాలములను సాద్యంతము, ప్రత్యయములను చేర్చుకొను నవకాశము వలన తెనుగు మహాకావ్యోపయోగి యగు భాషగా పరిణమించినది. దీనితో భాషకు పటుత్వము స్థిరత్వము నేర్పడినవి. ఏ యితర భాషా పదములు వ్యవహారములోనికి వచ్చినను, కావ్యములకుం దెక్కినను, అవి భాషాతత్త్వమును మార్చలేక పోయినవి. కావున తత్సమ పదముల పరిణామక్రమము భాషాశాస్త్రమునకు మిక్కిలి తోడ్పడుచున్నది.

ఈ పదమువలన తత్సమ పద చరిత్రమే కాక బు, ంబు, ంపు, పు మొదలగువాని చరిత్రయును, ము, మ్ము, వు మొదలగువాని చరిత్రయు నన్వేషించుటకు వీలు కలుగుచున్నది. వీనిలో ప్రథమా విభక్త్యేక వచన ప్రత్యయము, 'ము' 'వు' కనుపట్టుచున్నవి. ప్రాచీనకాలమునశాసనస్థమైన, 'బు, ంబు' ప్రత్యయములను తెనుగు వైయాకరణులు ప్రత్యేకముగా పేర్కొనలేదు. అపైని ప్రథమావిభక్తి ప్రత్యయము ద్వితీయాది రూపములతో కానవచ్చుటచే నీ 'ము' ప్రత్యయమును నాగమముగా నిర్దేశించిరి. ంబు, బు అను వాని నట్లే విభాష నగునని చెప్పిరి. దీని కేమైన యాధారము గలదా యనినచో శాసనములను పరిశీలించిన సాధారణముగ తత్సమ పదముల యందు అన్వయంబు, రాజ్యంబు మొదలగువాని యందు ంబు, బు రూపము కన్పట్టుటయు కొన్ని పట్టుల నవి 'మ్బు' తో వెలయుచున్నట్టు తెలియుచున్నది. కాని దేశి పదములగు ఇనుము, పొలము, పాము మున్నగునవి ద్రావిడ భాషోచ్చారణము ననుసరించి, ఇరుంబు, పొలంబు, పాంబు అను రూపములతో కాక, వ్యవహారములోకూడ 'ంబు' రూపములతో నుండక ఇనుము, పొలము, పాము మొదలగు, 'ము' రూపములతో నే స్థిరపడినవి. కావున వ్యాకరణకారులు ప్రకృతి ప్రత్యయ విభాగము చేయు నాటికి 'ము' ప్రత్యయముగా నిర్దేశించుటకు నీ క్రిందివి హేతువులు.

1. బు రూపము, 'పు' గాను, 'వు' గాను మాఱుట కవకాశ మున్నది.

2. ంబు రూపము, 'మ్బు' అను సంయుక్తాక్షరముగాను మ్ము అను ద్విత్వాక్షరముగాను మాఱుట కవకాశ మున్నది.

3. విభక్తిప్రత్యయము లోకే స్థిరరూపమున నుండును గాని రూపాంతరములను పొందవు.

4. కాబట్టి స్థిరవర్ణమగు 'ము' విభక్తిరూపముగా చెప్పినారు.

'ము' విభక్తిగా గ్రహించినను, 'బు' రూపమును లాక్షణికులు గ్రహింపక పోలేదు. తెనుగున యతిభేదములలో ము విభక్తి యతి గలదు. ము విభక్తిక యతి యనగా ధనము వనము మున్నగు శబ్దములయందలి తుది ము కారమునకు వు, బు లతో యతి చెల్లుట. పుణ్యుఁడు రాముడంత వన-ముం గనె. ఇచట ము విభక్తి పూర్వ రూపము - వన బు - గావున యతి సరిపోయినది. నన్నయ, తిక్కనాది కవు లెల్లరును నీ యతినియమము చక్కగా పాటించినారు. తరువాతి కవులు -పుణ్యుఁడు రాము డంత ముని ముఖ్యులతో అని కేవలశబ్దగత మగు ముకారములో యతి పాటించిరి. ఇది వేఱుపఱచుటకు లాక్షణికులు దీనికి 'పోలిక' యతి యని యనిరి. కాని ప్రాసలో నీ 'బు' రూపమును కవులు వాడియుండలేదు. నన్నయ భట్టారకుఁ డేనియు నట్లు వాడలేదు.

అమలిన...
స్త్రము...
ద్రము...
త్రముల చరిత్ర ..

ఇచట శాస్త్రబు, సముద్ర బు, క్షేత్ర బు మొదలగు రూపము లున్న ప్రాసభంగ మగును. దీని నిర్ధరించు ప్రయోగములు లేవు.

'బు' ప్రత్యయము 'వు' గా మాఱుచున్నదే గాని 'ంపు' గా మాఱినట్లు ప్రయోగములు లేవు.

కేతన, వాదపు, ప్రమోదపు, ముత్యపు, జూదపు, నెయ్యపు అనియే యుదాహరించినాడు.

కయ్యపు గెలుపు తిక్కన - వేదపు గని సోమన - కర్మపు బాడవు-అయ్యలార్యుడు - ఇవి ప్రాసగతములు, కవిప్రయోగములు.

కర్మధారయ, షష్ఠీ సమాసములయందు గానవచ్చు 'ంపు' అనురూపము అనగా సరసంపు అనునట్టి రూపములు బిందుపూర్వక పకారముతో సంపద, కంపనాది శబ్దములతో ప్రాసలో నన్నయ తిక్కనాదుల కావ్యములలో ప్రయోగములు లభింపలేదు.

ఈ 'పు' ప్రత్యయమే నలుపు, తెలుపు మొదలగు రూపములయందు గానవచ్చుచున్నది.

ప్రథమావిభక్తి 'ండు'

శాస్త్రులవారు ప్రథమావిభక్తి డు ప్రత్యయమిట్లు నిష్పన్న మైనట్లు వ్రాసియున్నారు.

"తెనుఁగున ప్రాయికముగా బహువచన రూపములు ముందు పుట్టిన పిదప వాని ననుసరించి యేకవచనరూపములు పుట్టును. 'అవన్,' 'మగన్' 'రామన్' అని యున్న ప్రాతిపదికములకు బహువచన ప్రత్యయమగు 'ఱు' పరము కాఁగా అవన్ఱు, మగన్ఱు, రామన్ఱు అను రూపము లేర్పడవలసి యుండెను. కాని యేకపదమున నకార ఱకారములకు సంయుక్తత అగవమున నే కాని తెలుఁగున నెక్కడను లేదు. తెలుగు ఱకార నకారములు సంయుక్తములుగా నేర్పడవలసిన చోట్ల నకార ఱకారములకు నడుమ బహు ప్రాచీనకాలమున తెలుఁగున లిపియు నుచ్చారము కలిగినట్టియు క్రమముగా నా లిపియు నుచ్చారమును డగ మారిపోయినట్టియు నొక వింతహల్లు అగమమై వచ్చుచుండెను. అదియే నేను అహదనకర శాసనము సత్యాదిత్యచోడ మహారాజ శాసనము మొదలగు వానిలో గుర్తించినవింత లిపి గల హల్లు. అది బండి ఱ కాదు. థ కాదు. ఆ వింతలిపియొక్క ప్రాచీనకాలోచ్చారణము కొంత ట వర్గాక్షరముల యుచ్చారమునకు చేరిక గలదై యుండవచ్చును. అది పెక్కు చోట్ల డగ మారినది. కొన్నిచోట్ల టగా మారియుండు నట్లు నే ననుమానించుచున్నాను. ఇప్పుడు నకారము, వింతహల్లు, ఱ సంయుక్తమైన అక్షరములతో శబ్దరూపము లేర్పడగా బహువచన ప్రత్యయమగు ఱ లోపింపగా హలంతములైన పదముల చివర యేకవచనమున అవన్ఱు, మగన్ఱు, రామన్ఱు ఇత్యాదిరూపములు కలిగెను. క్రమముగా నీ వింతహల్లు డగ మాఱఁగా 'డ'కు పూర్వమున నున్న 'న' 'ణ'గా మాఱఁగా 'అవణ్డు' మగణ్డు, రామణ్డు," ఇత్యాద్యేకవచన రూపములు నేర్పడినవి. ఊరల్, ఈలుగామాఱినట్లు 'అవణ్డు' వాణ్డుగా మారినది. తర్వాత వాణ్డు, వాఁడుగాను మగణ్డు మగఁడు గాను అర్వాచీనభాషలో మాఱినవి."

దీనిని బట్టి పై ప్రత్యయము మూడు వ్యంజనములు సమ్మేళనముగా కలిసిన రూపమని

తెలియుచున్నది. ఈ సందర్భమున శ్రీ శాస్త్రి గారికి నితరులకుఁ గల భేదమును తెలుపవలసి యున్నది.

కీ॥ శే॥ శేషులగు రామయ్యపంతులువారు ఁడు ప్రత్యయ చరిత్రను నిట్లు నిరూపించినారు—"ఆంధ్రమందలి మహదర్థక ప్రథమా విభక్త్యేక వచన ప్రత్యయమగు బిందుపూర్వక డువర్ణము యొక్క ప్రథమరూపము ద్రవిడభాషలలోని అన్నగర పూర్వక గురురేఫ మనియు ఆ నకార రేఫల యుచ్చారణములతో డకారోచ్చారణ గూడ సమ్మిళితమై యుండె ననియు క్రమముగా నీయూఁ డుచ్చారణములలో రేఫోచ్చారణము లోపించి డకారోచ్చారణము స్ఫుట మగుటవలన చతుర్థాంతస్థమైన నకారము తృతీయాంతస్థముగ మాఱిన దనియు ఈ యంతస్థము లేఖన సౌకర్యార్థము బిందురూపము ధరించినదనియు, ఈ బిందువును తీర్చి పలుకుటచే నర్ధానుస్వారోచ్చారణ కలిగినదనియు దీనివలన వాండ్రు అను నది క్రమముగ వాణ్డు>వాండు>వాఁడు గ మారిన దనియు, తెలుఁగులో అనుస్వారము హల్లు గాని అచ్చుగా దని తెలియును."

పైన చెప్పఁబడిన అన్నగర నకారమును గూర్చి శాస్త్రిగారు చెప్పలేదు. ఈ రన్నగర నకారమును కాల్డ్వెలు కూడ చెప్పి యే యున్నాఁడు. దానిని మాండలిక భేదమువలన ట, త, డ, ఱ మొదలగు నుచ్చారణములతో వెలయుచున్నదని యని చెప్పియున్నాఁడు. ఒక ప్పుడీ రన్నగర నకారమునకు మగణ్డు అను రూపము కూడ నుండవచ్చు నని తెలుఁగు భాషయందలి మగంటిమి అను తద్ధితరూపము (మగణ్డు+ఇమి.) తెలుపుచున్నది. ఈ సందర్భ మున శాస్త్రిగారు చెప్పినట్లుగా "నకారము వింతయక్షరము బహువచన ఱుకారము కలిసిన లిపి కన్పట్టుట లేదు. రామయ్యపంతులగారు చెప్పినట్లు అన్నగర నకార లిపితోడనే "ణ్డు" కన్పట్టుచున్నది. కాని శాస్త్రిగారు పంణ్డెణ్డు, ఎనుబణ్డు, మొదలగు శాసనస్థ వర్ణక్రమమును నీ పట్టున నుదహరించి ణ్డు రూపమున సమన్వ యించుకొనుమ నిరి. దీని కాక్షేప యాక్షేపణ గలదు. అవణ్డులోని డుకారము పంద్రెండు, ఎవబణ్డు(?) మున్నగువానిలో డుకారము వంటిది కాదు. మొదటిది విభక్తిప్రత్యయము. రెండవది సామాన్య రూపాంతరమును పొందిన శబ్దగత 'డు'కారము. ముందునేఁ జెప్పినట్లు రూపాంతర మును పొందని వర్ణముతో విభక్తి ప్రత్యయము లగును. కాఁబట్టి ప్రథమాడు ప్రత్యయ పరిణామము నితర పదములయం దేర్పడిన డుప్రత్యయములతో సరిపెట్టుట సమంజసము కాదు. కాని ప్రథమా'డు' ప్రత్య యమునుగూర్చిన యీ విశేషమును, నేటి భాషాశాస్త్రజ్ఞులు పరిశీలించినట్లుగాని పరి గణించినట్లు గాని కన్పట్టదు.

మగాది దేశిశబ్దముల ఉత్వము రాకపోవుట కును సంస్కృత ప్రాకృత శబ్దములకు త్వఁకు చేరుటకును శాస్త్రిగారు శాస్త్రీయమైన సమా ధానము నిచ్చియున్నారు. సంస్కృత ప్రాకృత శబ్దములకు పాణినీయమునందు చెప్పిన సంవృతా కారోచ్చారణ కలదు. కావున వాని కుత్వము వచ్చినది. ద్రవిడభాషలలో నా "అ"కార మునకు వివృతాకారోచ్చారమే కలదు. కావున ఉత్వము చేరుట లేదు.

అరసున్న :

అరసున్ననుగూర్చి శాస్త్రిగారి యభిప్రాయ మిది. "సహజముగా పదమందున్న యొక యక్షరమునకు కొన్ని యక్షరములకో ఆదేశమై వచ్చిన యనునాసిక్యహల్లు ఇతరహల్లుతో సంయుక్తమైనపు డేర్పడిన హల్ద్విత్వము శిథిలము కాఁగా నందలి శిథిలానునాసికమే అరసున్నగా మారినది" మెఱుమ్గళ్. అను పదము క్రమముగా మెఱుఙ్గళ్>మెఱుఙ్గుళ్> మెఱుఙ్గులు> > మెఱుఙ్గులు > మెఱుం గులు>మెఱుఁగులు అని యీ అరసున్న రూపనిష్పత్తిని తెలిపిరి.

ఇట్టివే ఈఁగలు ప్రోఁగులు మొదలైనవి. "ఇవి ఈ+గళ్ ఈఙ్గళ్ అను నిరూపమున శిథిలద్విత్వములైన అనఁగా "ఈఙ్గళ్" అను వాని యందలి అనునాసికస్థానమున పూర్ణ బిందువులను పొంది ఈంగలు అను రూపమును బడసినవి" ఇట్లే వాణ్డు మొదలగు శబ్దముల లోని అనునాసికాక్షరములకు పూర్ణబిందువులు వచ్చి అరసున్న లేర్పడినవి.

శాస్త్రిగారీఅరసున్న సంప్రదాయమును శిథిలద్విత్వ సంప్రదాయమునుబట్టి నిరూపించిరి. ఈ శిథిలద్విత్వము ప్రథమమున భాషలో నున్న దని తెలిపినవారు వారే.

**శిథిలద్విత్వము :**

శిథిలద్విత్వ మనఁగా సంయుక్తాక్షరమును తేల బలుకుట. దానిచే తత్పూర్వాక్షరము లఘు వగును. తెలుఁగున అద్రుచు, విద్రుచు, చిద్రుపలు అను పదములు మాత్రమే నేఁడు శిథిలద్విత్వములుగా కానవచ్చుచున్నవి. కాని ప్రాచీనకాలమున తెలుఁగున నీ సంప్రదాయ మున్నట్లు శివకవుల గ్రంథములనుండి కానవచ్చుచున్నవి. పూర్వము అగడ్త, ఎడ్ద, మున్నగు పదము లీ సంప్రదాయము ననుసరించి అగడ, ఎడ, అని పలుకవలసినట్లుగా నీ క్రింది ప్రయోగములవలన విశద మగుచున్నది.

"అట్టయు నీడ్పించి యగడ్త వైపించె"

బస. పు...

ఇక్కడ "డ్త" ను తేల్చి పలుకకున్న ఛందోభంగ మగును.

అట్లే.

"శ్రీ రామేశ కవీశ్వరాదు లెడ్ద" కు. సం. ఇచటకూడ "ఎడ" యని తేల్చి పలుకవలయును.

ఈసంప్రదాయమును తెలుఁగునఁ గల ప్రాస నియమమునుబట్టి కూడ నిరూపింపవచ్చును. శాసనములయందును గానవగును. కర్ణాట వ్యాకరణమున నీ శిథిలద్విత్వమునుగూర్చిన ప్రస్తావన మున్నను తెలుగు వ్యాకరణకారు లెవ్వరును దీనిని స్పృశింపలేదు.

**మకార వకారముల మార్పు :**

మామిడి, మావిడి శబ్దములనుగూర్చి చర్చించునపుడు ప్రభాకరశాస్త్రిగారీ మకార, వకార వినిమయమునుగూర్చి ప్రస్తావించిరి. 'వచ్చి యొంతయును శ్రవంపడి' అనియు 'వచ్చె నా బాస శ్రవణులార' యనియు బసవపురాణమున ప్రయోగములు గలవు. శ్రమంపడి, శ్రమణులార అనునవి పూర్వరూపములు. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో వసుమతి యెల్ల వారలు శ్రవంపడ అనియు, శ్రవమునఁ దత్సమమునుఁ దద్భవము అనియు శ్రమ శబ్దమునకు శ్రవ మనియు, క్రమ శబ్దమునకు క్రవ మనియు వాడియున్నాడు. కాని నేటి ముద్రితప్రతిలో నా మాటకు బదులుగా 'భువిలో' అని యున్నది. తిక్కన భారతమున కర్ణపర్వమున 'శ్రవమునకై యేను వివిధాంబకంబుల' అను పాఠము మార్చి ముద్రణములో శ్రమమునకై యేను సకలాంబకంబుల యనుపాఠము నిచ్చినారు. వ్రాఁతప్రతులలో శ్రవము అని కలదు. తెనుగువ్యాకరణములో నీ వినిమయము ప్రస్తావింపబడలేదు. దీనిని తెలిపినకీర్తి శాస్త్రిగారిదే.

**వింతయక్షరము :**

యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనమున తొలుత లక్ష్మణరావుగారు గుర్తించిన వింత యక్షరము తత్పూర్వశాసనములలో నున్నట్లు కనిపెట్టినయశస్సు శాస్త్రిగారిదే. వింత యక్షరము ఱ, అహదనకర శాసనమునను రేనాటి చోళుల శాసనములను పరిశీలించి యిది ట, డ, త, థ మధ్యగల యుచ్చారణగల వింత హల్లుగా వారు పేర్కొనిరి. వారు ప్రకటించిన కపిలేశ్వరపుర శాసనమున నీ వింతయక్షరమును గూర్చి వివరణ గలదు.

ఇంకను అర్ధానుస్వారము, పూర్ణార్ధబిందు ప్రాసము మొదలగువానిగూర్చియే గాక ప్రాచీనాంధ్ర భాషాసంప్రదాయికము లగు నపూర్వ విషయము లెన్నియేని వారి బసవపురాణపీఠిక నుండి యెఱుకపడుచున్నవి.

పై విషయము లన్నియు శాస్త్రిగారి ప్రతిభను, గంభీరపాండిత్యమును వ్యక్తము చేయుచున్నవి.

మీమాంసాశాస్త్రమున ప్రాభాకరమత మెట్టి విశిష్టత గలదో, ఆంధ్రభాషామీమాంసా శాస్త్రమున ప్రభాకరమతమునకు నంతటి విశిష్టస్థానము గలదు. ఈ ప్రాభాకర భాషా సంప్రదాయములతో పరిశోధన సాగించిన నదియే పరిశోధనకు పరమావధియై భాషా ప్రపంచమునకు దివ్యజ్యోతి కాఁగలదు.

---

# మహాపరిశోధకుడు :

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.



పూజ్యులయిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు లోకోత్తరమహాపురుషులలో ఒకరు. మహాపండితులు. కింకవీంద్ర ఘటాపంచానన బిరుదాంకితులు అయిన శ్రీ చెళ్ళపిళ్ల వేంకట శాస్త్రిగారివద్ద శుశ్రూష చేసి కవితా రహస్యములను ఎఱిగి, తెలుగు తీయదనపు రుచులను అవగతము చేసికొని స్వయముగా కవిన్నీ ప్రజ్ఞాధుర్యుడున్నూ అయిన తెలుగు పండితులు శ్రీ శాస్త్రిగారు. కవిత్వములో ఎంతటి విశిష్టత ఉన్నదో పాండిత్యములోను ఆయన కంతటి ప్రతిభ ఉన్నది. ఒక్కొక్క పద్యములోని శబ్దార్థవిశేషములు వివరించి దానిలోని సొగసులు చెప్పడంలో ఆయన కాయనే సాటి. శ్రీనాథుడు, పోతన, పింగళి సూరన, తిక్కనల వంటి మహాకవుల కావ్యాలలోని అందచందములు, కవితావిశేషములు వింటే ఆయనవల్లనే వినాలి. వారికవితావైభవమునకు ఆయన ముగ్ధుడై మనలను ముగ్ధులను చేస్తాడు. స్వానుభవముమీద చెపుతూ ఉన్న విషయ మిది. ఆయన వ్రాసినవి ఖండకావ్యములవంటి వయినా హృద్యమయినవి, అతిరసవంత మయినవి. ఆయన సాహచర్య మబ్బి, ఆయన వాత్సల్య మనుభవించీ నేను ధన్యుడ నయినా ననుకొంటూ ఉంటాను. అజ్ఞుడను అవజ్ఞుడను నన్ను ఆయన అంత గారవముతో ఆదరించి ప్రేమించడం నాకే ఆశ్చర్యకరంగా ఉండేది. ఆయన ప్రధానముగా కవా పండితుడా అని అప్పుడప్పుడు నాలో వితర్కించుకొంటూ ఉండేవాణ్ని. ఎందువల్లనంటే ఆయన పాండిత్యప్రతిభ ఒక్కొకప్పుడు నన్ను ముగ్ధుణ్ని చేసి నాకు అపారానందము కలిగించేది. ఎవరైనా ఒకరు పంచకావ్యములూ చదువవచ్చును. గొప్ప పండితులు కావచ్చును. స్వతంత్రాలోచన కలిగి ప్రతిభావంతులు కావడం కష్టము. ఇటువంటి తెలుగు పండితుడు, తెలుగు కవి, పరిశోధకు డవడమే వింతలలోని కెల్ల వింత. కవిత్వమునకు పరిశోధనకు పొత్తెక్కడ? ఇంతకు పూర్వ మెప్పు డయినా ఎక్కడయినా తెలుగుకవి తెలుగు పండితుడు పరిశోధన చేసినట్లు పరిశోధకు డయినట్లు విన్నామా? కన్నామా? అయితే శ్రీ కందుకూరి వీరేశలింగముగారు లేరా అనవచ్చు నెవరయినా. కాని ఆ పరిశోధన వేరు. శ్రీ శాస్త్రిగారి పరిశోధన వేరు. వీరి పరిశోధన లోతులను శ్రీ వీరేశలింగముగా రెప్పుడూ అందుకోలేదు; అందులో అడుగుపెట్టలేదు. భాషావిషయములో పరిశోధన; శాసనవిషయములో పరిశోధన; చరిత్రవిషయములో పరిశోధన-నాకు చూడగా శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చేసినది పరిశోధనే. ఆయన కవీ కాడు, పండితుడూ కాడు, ప్రధానముగా పరిశోధకుడే అనుకొంటూ ఉంటాను. అనుకోవడ మేమిటి నా నమ్మకమే అది. అవును. మూడు మూర్తులా ఆయన పరిశోధకుడు—భాషాపరిశోధకుడు, శాసన పరిశోధకుడు, చరిత్ర పరిశోధకుడు, గేయ ఛందః పరిశోధకుడు; ఆత్మపరిశోధకుడు, విశేషించి ఆధ్యాత్మిక పరిశోధకుడు. మూర్తీభవించిన పరిశోధన ఆయన. అది ఆయన పూర్వజన్మసంస్కార విశేషము; ప్రాక్తనవాసనాజన్యము; పూర్వపుణ్యమహత్వఫలము.

శ్రీ శాస్త్రిగారి సంస్కారము బహుముఖమైనది. ఆయన సాధించిన విద్యలూ బహుముఖమయినవే. ఆయన ఒక్కొకరికి ఒక్కొక విధముగా కాన్పించవచ్చును—విద్యావిషయములో ఆయన వైదుష్యము బహువిధ మయిన దగుటవలన. కాని వారితో నాకు రమారమి పాతికేండ్లకు పైగా గల స్నేహభాగ్యమువలన ఆయన నాకు పరిశోధకుడుగానే దర్శన మిచ్చినాడు. మే ముభయులము కలసికొన్నప్పు డెల్ల పరిశోధనకు సంబంధించిన విషయములే - అవి భాషకు సంబంధించినవి కానీ, చరిత్రకు సంబంధించినవి కానీ - మా పిచ్చాపాటీని ఆ సంభాషణలో మే ముభయులమూ తన్మయుల మవుతూ ఉండేవాళ్ళము. తిరువళ్లిక్కేణి నల్లతంబివీధిలో వారి ఉనికి; దానికి ప్రక్కనే ముత్తుకలాత్తి చెట్టివీధిలో నా బస. భాషకో చరిత్రకో సంబంధించిన సమస్య, అపూర్వవిషయము ఏదయినా స్ఫురించినదంటే ఆయన రాత్రి పదిగంటలయినా సరే మా యింటికి వచ్చేవారు. తెల్లవారకుండానే నే నాయనవద్దకు పరుగెత్తేవాడను.

ఇద్దరమూ కలసి ఒక్కొక్కప్పుడు రాత్రి భోజనము చేసి వెన్నెలరాత్రులు సముద్రపు వొడ్డుకు పోయి కాలక్షేపము చేసేవారము. మా కింక మాటల కేమి ఉన్నవి కవిత్వము పరిశోధనా తక్క— హెచ్చుగా పరిశోధనకు సంబంధించిన పురాణ కాలక్షేపమే. ఆ దినములు తలచుకొంటే ఇప్పటికీ నాకు ఒళ్లు పులకరిస్తుంది; ఆ మధుర స్మృతులను కలిగినప్పుడు జీవితపు తీయదనమూ గొప్పతనమూ అనుభూతికి వస్తూ ఉంటుంది.

చిరకాలము మద్రాసులో నివసించడమువల్ల శ్రీ శాస్త్రిగారికి తమిళము బాగా పట్టుబడినది. భాషా మర్యాద తెలిసినవారూ జిజ్ఞాసువులూ కావడంచేత తెలుగు పదములకు తమిళ పదములకు గల సన్నిహిత సంబంధమును నెమరువేసుకొంటూ వచ్చారు. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార కార్యాలయములో ఒక్క తమిళులే కాక కన్నడిగులు కూడా ఉండడంచేత కన్నడపు మాటలకు తెలుగు మాటలకు గల సంబంధమును గమనిస్తూ వచ్చారు. ప్రాచ్య లిఖిత పుస్తకాలయములోని స్థానిక చరిత్రలను పరిశీలనగా చదివి 1798, 1800 ల నాటి తెనుగు వాడుక భాష తెన్నులు విలోకించారు. ముద్రితములూ అముద్రితములూ అయిన ప్రాచీన కావ్యములను చదివి వాటిలోని తెలుగు పలుకుబళ్లను, పదప్రయోగములను జాగ్రతగా సేకరించి వ్రాసి పెట్టుకొన్నారు. స్థానిక చరిత్ర సంపుటముల నిండా కావలసినన్ని శాసనము లున్నవి. పూర్వము మెకంజీ దొరచే నియమితులైన కావలి వేంకట బొర్రయ్య మొదలైన వారు సంపాదించినవి—నకళ్లు. మ్యూజియము భవనాలలో ఉండేది ఈ ప్రాచ్య లిఖిత పుస్తకాగారము. ఆ మ్యూజియము ఆవరణలోనే ఉండేవి ఒక షెడ్డులో తెలుగు దేశపు శాసనములు చెక్కిఉన్న రాళ్లు. ఆ రాళ్ల మీది శాసనముల లోనిది తెలుగు దేశములో క్రీస్తు శకము తొమ్మిది పది శతాబ్దములలో వాడుకలో ఉండే తెలుగు కన్నడ లిపి. ప్రక్కనే ఉన్నది పురాతన శిల్ప చిత్ర ప్రదర్శన శాల. ఈ పరిసరాలలో ఆ విద్యా నిలయంలో ఆయన పీఠము. ప్రాక్తన జన్మ సంస్కార బలము, జిజ్ఞాస ఉన్నవా డాయన. జిజ్ఞాస ఉండి సంస్కారబలము లేకపోయినా కార్యము లేదు సంస్కారబల ముండి జిజ్ఞాస లేక పోయినా ప్రయోజనము లేదు. ఇది రెండూ ఉంటేనే, ఉన్న వారి మీదనే పరిసరముల ప్రభావము. ఈ పరిసరముల ప్రభావము వల్ల ఆయన భాషా పరిశోధకుడూ అయినాడు, కావ్య విమర్శకుడూ అయినాడు, చరిత్ర పర్యవేక్షకుడూ అయినాడు, శాసన విషయ పరిశీలకుడూ శాసన పఠనాభిలాషీ అయినాడు, శిల్పకళా సౌందర్య పరిగ్రహణ శీలీ అయినాడు. ఆయన మనసులోని గూఢము, నిద్రాణము అయిన విద్యా విచక్షణ భావశబలతను జాగరితము చేసి దానిని ప్రకాశింప జేసినది – ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని ఆయన ఉద్యోగమే, అందాయనకు దొరకిన అవకాశమే అని నేననుకొంటాను. ఆ గ్రంథ భాండాగారములోని బహుగ్రంథ పరిశీలన పఠనములవల్ల ఆయనకు తెలుగు కావ్యములలోని పద ప్రయోగాదుల సాధుత్వాసాధుత్వములను విమర్శించి చెప్పగల ప్రజ్ఞా పాటవమున్ను, తమిళ కర్ణాట భాషా పరిచయముకల్ల ప్రాతపడిన తెలుగు పలుకుబళ్లకు, మాటలకు చక్కగా అర్థము తీసి నిరూపింపగల తెలుగు భాషా వైశద్యమున్ను కలిగినది. స్థానిక చరిత్రల, మెకంజీ వృత్తాంతముల పరిశీలనమున్ను, శ్రీమాన్ బుక్కపట్నము రాఘవాచార్యులుగారు రచియించి యుంచిన లిఖిత ఆంధ్ర దేశ చరిత్ర సాదర పఠనమున్ను ఆయనకు చారిత్రక దృష్టి నిచ్చి ఆంధ్ర దేశచారిత్రక ఘట్టములను ఎరుకపరిచినవి. తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీ గ్రంథ పరిశీలనము ఈ చరిత్ర జ్ఞానమును మరింత పెంపు చేసినవి. ఏ తత్పరిజ్ఞాన ప్రజ్ఞా ప్రాభవములకు శ్రీ శాస్త్రిగారు బహుళముగా రచియించిన గ్రంథ గ్రంథులు మొదలైన వ్యాసములు, బసవపురాణ, హర విలాస, ఉద్భటారాధ్య చరిత్ర, క్రీడాభిరామాది గ్రంథములకు వ్రాసిన పీఠికలు నిరుపమానములైన ఉదాహరణములు. ఆ పీఠికలలో ఏమైన ఒకటి రెండు విషయములలో పొరపాటు లుంటే ఉండు గాక—కాని అవి ఉత్తమము లైనవి, అమూల్యము లయినవి. బసవ పురాణ క్రీడాభిరామ గ్రంథములలో పీఠికల చివర తెలుగు మాటలకు వా రిచ్చిన అర్థవివరణము చాల గొప్పది. వాటిలో ఎక్కడ నైన ఒకటి

రెండు మాటలకు అర్థవివరణములో ఇప్పుడు మన దృష్టికి సరిగా కనబడక పోవచ్చును. అంత మాత్రమున ఆయన చేసిన పని విలువ తగ్గదు. ఆయన భాషా విషయమున చేసిన కృషి అమూల్యమయినది, అనన్యమయినది. అప్పుడాయన ఆ విధమైన కృషి చేసినారు. కాబట్టే ఇప్పుడు మన మా విషయములో ఇంకా కృషి చేసి నిగ్గు తేల్చుట కవకాశము కలుగుతున్నది. ఆయన చేసిన కృషికి అందరు తల లొగ్గి జోహారు లర్పింప వలసినదే.

చరిత్ర విషయములో మాత్రము-శ్రీ శాస్త్రి గారు చేసిన కృషి సామాన్యమయినదా? పాత వాహాన చరిత్రలోని సమస్యలను ఆయన గుర్తించినారు. కొన్నిటి నాయన పరిష్కరించుటకు పూనుకొన్నారు. పల్లవుల కాలపు సంస్కృతిని గురించి ఆయనకు తెలియును. మత్తవిలాస ప్రహసనము మహేంద్రవర్మ పల్లవునిది ఆయన ప్రకటించినారు. వేంగీ చాళుక్య చరిత్ర మాయనకు అవగతమే. ఇక తెలుగు దేశపు పండ్రెండు పదమూడు పద్నాలుగు పదిహేను పదహారు శతాబ్దాల చరిత్ర మాట ఎత్తుకోవడ మెందుకు? వీటిలోని కొన్ని కొన్ని యుగముల చరిత్ర ఆయనకు సువిదితము. ప్రకటితములైన శాసనములలోని విషయములన్నీ ఆయనకు సుపరిచితములు. అందువల్ల నే నన్నెచోడుని కాలనిర్ణయము విషయమున ఆయన ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో ప్రకటించిన వ్యాసమే ఇప్పటికీ చివరి మాటగా ఉంది. ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలలో ప్రకటించిన వ్యాసములు, ముఖ్యముగా కొలచలమ వారు, ప్రతాపరుద్ర గజపతి అనంత వరము తామ్రశాసనము, విడిగా ప్రకటించిన తంజావూరి ఆంధ్రరాజుల చరిత్రపీఠిక, సరస్వతి పత్రికలోని తెలుగు దేశపు సంస్కృత కవులను గూర్చిన వ్యాసములు—ఈ మొదలైన వన్నీ చారిత్రక రంగములో కృషి చేసే నా వంటి వారికి శిరోధార్యములు. ఇంకా ఆయన వ్రాసినవి ఇటువంటి వ్యాసములు ఎన్నో ఉన్నవి. వీటి నన్నిటిని కలియచేర్చి ఒక్క సంపుటముగా ప్రకటించడం అవసరము.

స్థానిక చరిత్రలలోని శాసనపు నకళ్ళ కొన్నిటిని సాకల్యముగా పరిశోధించినారు. అందులో శ్రీనాథమహాకవి వ్రాసిన శాసన మూల ప్రతులు జాగ్రతగా చదివి పాఠము నిరూపించుకొన్నారు. స్థానిక చరిత్రలలో నుంచి ఎత్తి వ్రాసి పాఠమును నిర్దుష్టముగా సవరించి ఒకటి రెంటిని రెడ్డిరాణి పత్రికలోను, భారతిలోను ప్రకటించారని నాకు జ్ఞాపకము. ఈ విధమైన చరిత్ర కృషికి ఫలితము వారు రచియించిన 'శృంగార శ్రీనాథము'. శృంగార శ్రీనాథము ఉత్తమచరిత్ర గ్రంథములలో ఒకటి. వారి నిరంతర కృషికి తల మానిక మయినది. ఆ గ్రంథాన్ని రచించడములో శ్రీ శాస్త్రిగారి కున్న విమర్శన నైపుణి, చరిత్ర పరిజ్ఞానము, కావ్యాను శీలన పటుత్వము భాషా వైదుష్యము—అన్నీ విశదముగా గోచరిస్తవి.

ఆయనకు గల భాషా చరిత్ర పరిజ్ఞాన కుతూహలమే ఆయనను శాసనప్రకటనమునకు ప్రోత్సహించినది. నిరంతర శాసన ప్రతిబింబావలోకనమువలన ప్రాచీన శాసనలిపిని ఆయన నేర్వగలిగినారు. ఇందుకు మ్యూజియము ఆవరణలోని 'షెడ్డు'లో ఉన్న శాసన శిలలు ఆయనకు తరిఫీదిచ్చినవి. ప్రాచీన వేంగిలిపిని ఎరిగిన కొద్దీ తదక్షర పరిణామాన్ని ఆయన సులువుగా గుర్తింప గలిగినారు. శాసన ప్రతిబింబములను తీయుట నేర్చి నందిగామ తాలూకాలోని కొన్ని గ్రామముల లోని శిలాశాసనములకు ప్రతిబింబములుతీసి చదివి వాటిని జయంతిపురం జమీందారు గారి పత్రికలో పాఠములను మాత్రము ప్రకటిస్తూ వచ్చారు వివరణము వ్రాసి. కాని ఆయన భాషా తత్త్వవిచార కుతూహలుడు. అరవము తెలుగు కన్నడములలోని పదముల పరస్పర సంబంధము పరిణామము తెలుసుకొనుటలో ఆయనకు అభిలాష ఎక్కువ. అందువల్ల నన్నయకు పూర్వపు తెలుగు శాసనములు ఆయనను ఎక్కువగా ఆకర్షించినవి. అహదనకర శాసనము, లక్ష్మీపుర శాసనము మొదలైనవి ఆయన భారతిలో ప్రశస్తమయిన శబ్దార్థ వివరణములతో ప్రకటించినారు. శాసనస్థ పదములను విడదీయుటలోను విడదీసి అర్థము చెప్పుటలోను ఆయనకు గల ప్రజ్ఞాపాండిత్యములు సాటిలేనివి. ఒక్కొక్క పదము స్వరూపమును, దాని యర్థమును నిరూపించుటలో దానిని బహుకోణములనుండి పరిశీలించును. అందువల్లనే ఆయన తెలిపినఅర్థమును

పదస్వరూపమును తిరస్కరించి త్రోసివేయుట చాలా కష్టము.

[శ్రీశాస్త్రిగారికి నాకు ఈ యమహాదనకర శాసనవిషయమున అభిప్రాయభేదములు కలిగిన వనేమాటవాస్తవమే. కాని వారు చెప్పిన అర్థనిర్ణయము విషయమున మాత్రము కాదు. అది లిపిశాస్త్రమునకు సంబంధించిన వివాదము. ఇప్పటికీ ఆ విషయము తలచుకొన్నప్పుడెల్ల నాకు విచారము కలుగుతూనే ఉంటుంది. ఒకానొక అక్షరస్వరూపము విషయమున మా యిరువురి అభిప్రాయములును భేదించినవి. ఆయన ఆ రూపమునకు తెలుగు వర్ణసమామ్నాయము లోని ఒక సంకేతమిచ్చి శాసన పాఠమును అందుకు అనుగుణముగా చదివి అర్థనిరూపణము చేసినారు. అది శాస్త్రీయపద్ధతి కాదని నా వాదము. ఇదే వివాదహేతువు. ఎంత చిన్న విషయమైనను మా యిరువురికి ఇది మనస్తాపకారణ మయినది. తరువాత వారు నాయెడల పూర్వపు వాత్సల్యామృతమునే చిలికించి నన్నాదరించినారు. నా మనసు కలత తేరినది.]

మ్యూజియములోని అమరావతీ జగ్గయ్యపేట శిల్పకృతులను పరిశీలించుట శ్రీశాస్త్రిగారికి ఎడతెగని అభిలాష. ఆ శిల్పఖండముల మీది బ్రాహ్మీలిపిలోని ప్రాకృతశాసనములను వారికి చదువ వేడుక. నన్ను కూడా చాలా సారులు వంపులు రేఖలు భంగిమలు చూపుతూ ఆ చిత్రములలోని నైపుణి కర్ణించేవారు. బౌద్ధాంధ్రకళ అన్నా బౌద్ధస్తూపము లన్నా బౌద్ధమన్నా ఆయన కత్యంతాసక్తి. బుద్ధభగవానుని సందేశము, బుద్ధుని జీవితము ఆయన మనసును కరిగించినట్లు, ప్రకాశింపజేసినట్లు ఏదీ చేయలేదు. బౌద్ధాంధ్ర శిల్పచిత్రములకోసం, బౌద్ధస్తూపముల కోసం అన్వేషణ జరిపేవారు. ఒకసారి వారే చెప్పినారు నాతో. ఘంటశాలలో ఒక చోట తాను రాజావారి అనుమతి పొంది త్రవ్వింపగా ధర్మచక్రము నమూనామీద బౌద్ధస్తూపపు పునాదులు కనిపించిన వని, ఆ పునాదిరాళ్లమీద శంఖాకృతిగా ఉన్న అక్షర సంకేతములతో శాసన మున్న దనీని. దానికి వారు తీసిన ప్రతిబింబమును కూడా చూపించినారు నాకు. శిల్పకళమీదా, బౌద్ధముమీదా, శాసనముల మీదా ఆయన కెంతటి అభిమానమో చూడండి. ఆ శాసనం ప్రకటితం కాకుండానే, చరిత్ర పరిశోధకుల ఎరుకకు రాకుండానే పోయింది. ఎట్లా పోయినదో! ఆ స్తూప మెక్కడిదో తెలియదు; ఆ పునాది ఎక్కడున్నదో తెలియదు.

ఇన్నిటికంటెనూ వింతలలోని కల్లా వింత శ్రీ శాస్త్రిగారు చరిత్ర పూర్వయుగమునాటి సమాధులను (Pre-historic graves) అన్వేషించడము. ఇది ఇదివరలో చెప్పిన వారి కృషి కంతకూ శిరోభూషణం వంటిది. తెలుగు పండితు డేమిటి, తెలుగు కవేమిటి—చరిత్ర పూర్వయుగమునాటి సమాధు లన్వేషించడ మేమటి? వింత కాదూ?—కాని శ్రీ శాస్త్రిగారు అట్టి పని చేసి ఉంటారా అని కొందరికి ఆశ్చర్యం కలుగవచ్చును. నేను పుట్టించిన మాట కాదిది.

నవ్యసాహిత్య పరిషత్తు పదకొండవ వార్షికోత్సవం ముక్త్యాల జమీందారుగారి ఆతిథ్యాన మహావైభవంగా జరిగింది. దానికి నే నధ్యక్షుడను కావడం నా పూర్వ పుణ్యభాగ్యలేశము. ఆ సందర్భములో శ్రీ ప్రభాకర శాస్త్రిగారు ఉత్సవమును ఉపక్రమిస్తూ ఉపన్యాసము చేసినారు. అది ముద్రిత మైనది. దానిలో వారు వ్రాసిన వాక్యము లివి ఉదాహరిస్తున్నాను.

"ఈ ముక్త్యాల ప్రాంతము ఆది తెలియని కాలపు చరిత్ర చిహ్నములుగా కానవచ్చు సమాధులు గల ప్రదేశ మవడము మాత్రము చరిత్రజ్ఞు లింతకు ముందు గుర్తించిరో లేదో నే నెఱుగను. కొన్ని యేండ్లకు ముందు నే నీయూరి ప్రక్కనే అట్టి సమాధి నొకదానిని త్రవ్వించితిని. అందు అజ్ఞాతయుగపు సమాధి వస్తువులుగా మదరాసు మ్యూజియములో సేకరించి యుంచబడిన వస్తువులవంటి వస్తువులే కానవచ్చినవి. అట్టి వీచుట్టు పట్టులలో వందలకొలదిగా ఉన్నవి."

అజ్ఞాత యుగ మనగా చరిత్ర పూర్వయుగము, చారిత్రక యుగమునకు పూర్వపు కాల మని అర్థము. చరిత్రరచనకు లిఖితపూర్వకాధారములు కాన వచ్చిన నాటినుంచి చారిత్ర పూర్వయుగ మనీ చరిత్రజ్ఞుల వ్యవహారము. ఇందువల్ల చారిత్రక యుగారంభము దేశదేశమునకు భేదించును. హిందూదేశములో అశోకుని శాసనములు కానవచ్చి నప్పటినుంచే చారిత్రక యుగము. అంతకు పూర్వపుది

చరిత్ర పూర్వయుగము; అజ్ఞాత యుగము. అజ్ఞాతయుగమునకు సంబంధించిన సమాధు లను శ్రీ శాస్త్రిగారు త్రవ్వించడము వింతల లోని కెల్ల వింత. ఆయన పూర్వకాలపు ఛాందసపు పండితుడు కాడు. స్వాప్నిక ప్రపంచ సంచారి ఆయి భాషావేశపర వశుడు మాత్రమే అయిన కవీ కాడు. ఆయన మహావిజ్ఞాని. అన్ని విధములైన విజ్ఞానమూ ఆయనకు కావలసినదే. ఆయన జిజ్ఞాసువు. ఆయన నవీనులలో నవీనుడు, పండితులలో పండితుడు, కవులలో మహాకవి, చరిత్రజ్ఞులలో చరిత్రజ్ఞుడు, పరిశోధకులలో మహాపరిశోధ కుడు. అట్టి శ్రీ ప్రభాకర శాస్త్రిగారికి నా నమోవాకములు.

---

# రెడ్డిరాజ్యసంశోధనకు : : : శాస్త్రిగారు వేసినపునాది

శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు.

—: * :—

చరిత్రపరిశోధనలో శ్రీ సోమశేఖరశర్మగారి తరువాత పేర్కొనదగినవారు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. వీరు మహా మేధావి యగు సంస్కృతాంధ్ర భాషావిశార దులు. పండితప్రపంచమున దప్పపుట్టిన మహ నీయులు. కేవలభాషాపండితులయందు లేని చరిత్రజిజ్ఞాస వీరియందు గానవచ్చుచున్నది. ఇది ప్రయత్నపూర్వకముగ నలవరచుకొన్నది కాదు. పూర్వజన్మవాసనవలన కలిగినది. చరిత్ర రచియింపవలె నను నుద్దేశము లేకపోయినను, శ్రీనాథకవిరాజు జీవనచరిత్రను రచియించు టకు కొండవీడు రాజమహేంద్రవర రెడ్డిరాజ్య ముల చరిత్రను చక్కగ పరిశీలించి తమ శృంగారశ్రీనాథమున సంగ్రహముగ వర్ణించి యున్నారు. ప్రభాకర శాస్త్రులవారి యభి ప్రాయము లందరికి నంగీకార్యములు గాకపో వచ్చును. కాని పరిశోధనాపద్ధతులు నిర్దుష్ట ములు. శృంగారశ్రీనాథ రచనచే ప్రభాకర శాస్త్రులవారు రెడ్డిరాజ్య సంశోధనకు బునాది వేసిరని చెప్పవచ్చును. ఇతర పరిశోధకులకు వీరుమార్గదర్శకులై రనుట యతిశయోక్తి కాదు.

(భారతి రజతోత్సవ సంచికలోని ఆంధ్ర దేశమున చరిత్ర పరిశోధన వ్యాసమునుంచి)

---

## రామకృష్ణరాజు

క॥ దాతకుఁ బద్యము లిచ్చిన
నాతఁడు ధన మొసఁగఁ గవుల కపుడే సెలవోఁ
గూతురి నమ్మినరీతిని
రీతిని జంద్రగిరిరామకృష్ణనృపాలా!

# అమృతమూర్తి

## శ్రీ నార్ల వేంకటేశ్వరరావుగారు.

—:*:-

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మా స్నేహితు లని, మాబంధువు లని ఎవరైనా అన్నప్పుడు నాకు ఆశ్చర్యం కలుగుతుంది-- అందరూ స్నేహితులు, బంధువులు. కాని వారెవరని? ఆయన అందరికీ స్నేహితుడు; ముఖ్యంగా లోకంలో ఆదరానికి నోచుకోని వారికి! ఆయన అందరికీ బంధువు; ప్రత్యేకించి ఆర్తజనులకు. "మన సారథి, మన సచివుడు, మన వియ్యము, మన సఖుండు, మన బాంధవుడున్...మన గురుడు" అని శ్రీ కృష్ణునిగురించి ధర్మరాజు చెప్పిన మాటలను ఆయనను గురించి కూడా నిస్సంకోచంగా చెప్పవచ్చు. ఆయన నిజంగా అమృతహృదయుడు. అమృతాన్ని లోకానికి పంచి, తాను కాకోలవిషాన్ని పరిగ్రహించబట్టి కాని, లేకపోతే మరికొన్ని సంవత్సరాలపాటు ఆయన సేవాభాగ్యాన్ని ఆంధ్రసాహిత్యలోకం పొందగలిగి వుండేది!

కొందరు మహామహుల సమక్షంలోకి వెళ్ళినప్పుడు మన సంకుచితభావాలకు, స్వార్థచింతలకు మనము లోలోపల సిగ్గు పడతాము. అట్టి మహామహుల కోవకు చెందిన వారు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు. ఆయన సన్నిధిలో మెలఁగిన వారికి కూడా ఆయన మహోదాత్తత కొంతవరకు అబ్బేది. శాస్త్రిగారి వర్ధంత్యుత్సవంలో పాల్గొనడానికి రెండు, మూడేళ్ళనాడు తిరుపతికి వెళ్ళినప్పుడు నేను కనబరచినదౌర్బల్యానికి, అది జ్ఞాపకం వస్తే చాలు, ఇప్పటికీ నేను సిగ్గు పడుతుంటాను. నాటి సభ తర్వాత జరిగినవిందులో కుష్ఠు వున్న ఒక వ్యక్తికి నా సరసనే స్థానం చూపించబోయారు. అప్పుడు నేను కొంచెం తెల్లబోవడమే కాక, అప్రయత్నంగానే ఒక పక్కకు కొంత జరిగాను. పాపం! ఆ వ్యక్తి చిన్నబుచ్చుకుని గిర్రున వెనక్కు తిరిగారు! వెంటనే ఆయనను పంక్తిలోని ఇతరులు తమ సరసను ఎంతో సంతోషంగా కూర్చోబెట్టుకున్నారు. "ఇదిగదా శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సాన్నిహిత్య ఫలిత"మని ఆనాడు నేను తెలుసుకున్నాను.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారి దివ్యస్మృతికి నా జోహారులు.

## వెలమవారు

ఉ॥ పైకొనువారితో నొఱఁగి పాఱరు, నేరరు భంగసంగతుల్
చేకొనఁ బూని కాని దొరఁ జేరరు, కోరరు దుష్టజంతుర
క్షాకరణంబు, నొడ్ల కపకారులు గా రెవ్వ, డప్పు గోరుమం
దాకినితోడఁ బుట్టియు గుణప్రతిభన్ వెలమల్ పురంబునన్॥

# మానవత్వ ప్రపూర్ణులైన మనశాస్త్రిగారు

నిమీలిత నేత్రాలతో నిండుకుండలా శాంతి సంభరిత కరుణారసమూర్తిలా ఉన్న శాస్త్రి గారిని చూడగానే అప్రయత్నంగా నమస్కారం చేశాను —

అది 1936 జూలై నాటిమాట. నాటికీ నేటికీ వారి పేరు విన్నా, తలచుకొన్నా అప్రయత్నంగా నా చేతులు మోడ్చుకుంటాయి.

ఆయనలోని మానవత్వం అన్నిటి కన్నా నన్ను ఆకర్షించి వేసింది.

రాజర్షిలాంటి ఆయన ఆధ్యాత్మిక జీవితం నాకు తెలుసు.

కులపతిలాంటి ఆయన పాండిత్యప్రకర్ష నే నెఱుగుదును.

భరతునిలాంటి ఆయన రసప్రలుబ్ధత నాకు తెలిసినదే.

శాసనాలు మొదలు చాటువులదాకా సేకరించి, వ్యాకరించి, వ్యక్తీకరించిన ఆయన చరిత్రాది పరిశోధనల లోతులు నాకు పరిచితమైనవే.

కానీ ఈ అన్నిటికన్నా ఆయనలోని ఆర్ద్ర హృదయత నన్ను వినమ్రుని చేసివైచినది.

కాస్త పరహృదయం విలవిల లాడుతున్నదని పసికట్టినా ఆయన కనులు చెమర్చేవి. కాసంత కష్టజీవుల బ్రతుకుబరువును గూర్చి విన్నా జలజలా కన్నీరు గ్రుమ్మరించే ఆయన ప్రసన్న నేత్రద్వయం నా కట్టెదుట ఈనాటికీ కన్పిస్తూ కలవరపరుస్తూ వుంటుంది.

నిజమే. ఒకటి రెండు రోజులు ఉపవసించవలసి వచ్చింది-అనుకొన్నదేదో కాలేదు. తిన్నగా వారి దగ్గఱకు మామూలుగా సాయంకాలం వెళ్ళాను. నమస్కారం చేసి కూచున్నాను.

అలా చూచి వెంటనే కనులు మూసుకోవడం ఆయన అలవాటు. రెండవసారి కళ్ళు తెరుస్తూ 'డబ్బు లేదా?' అన్నారు.

నే నేమీ అనలేదు. చింత చచ్చినా పులుసు చావని రకం మనది,

కాసేపు తిరిగి కన్నులు మూసుకొన్నారు.

"జాతకకథలు ఎంతవఱకు అయ్యాయి" అని అడిగారు కళ్ళు మూసుకునే.

నేను 'జాతకమాల' పూర్తి చేశానని చెప్పాను.

మరీ కాసేపు మౌనం—

ఈ లోగా నాగేశ్వరరావు పంతులుగారు వచ్చారు. వా రప్పటికి చాలా అనారోగ్య స్థితిలో వున్నారు. శాస్త్రిగారిదగ్గర యోగ చికిత్సకోసం రెండవమాటు కావచ్చు వచ్చారు.

మామూలు ప్రార్థన ముగిసిపోయింది.

'పంతులుగారూ! విశ్వం అన్నం తిన్నట్టు లేదు. పుస్తకాల ఖేరం నే ననుకున్నది కుదరలేదు.' అని శాస్త్రిగా రంటూండగానే పంతులుగారు లోపలిజేబులో చెయి పెట్టి పైకి తీశారు. నా చేతిలో పెట్టారు.

మూడు పదిరూపాయల నోట్లున్నవి.

'మరీ కనిపించండి' అన్నారు.

తర్వాత డబ్బుమాత్రం ఇలా పుచ్చుకోలేదు కానీ-భారతిలో 'రివ్యూ'లూ అవీ ప్రతిసారీ రాని ఏదో తీసుకునేవాణ్ని. అప్పుడే పద్యాలూ అవీ కూడా అందులో రాశాను.

అప్పుడు శాస్త్రిగారికి అభిమాన విషయమైన బౌద్ధ గ్రంథ సమధ్యయనం పాళీలోనే చేస్తున్నాను. మరి చిలుకూరి వారి సాన్నిహిత్యంతో ముందే అలవడిన భాషా పరిశోధనా సాగిస్తున్నాను.

ఆ మధ్యలోనే ఆంధ్ర శబ్ద చింతామణి నన్నయ కృతంగా దని ఒక పెద్ద వ్యాసం రాశాను. నన్నయ ప్రయోగాలూ అవీ చాలా అందులో సేకరించాను. ఆ వ్యాసం భారతిలో వేద్దామని గన్నవరం సుబ్బరామయ్యాగారి చేతి కిచ్చాను.

ఆయన చదివి గట్టిగా కౌగలించుకొని 'ఒక్కమాట చెబుతాను ముసలి...వాణ్ణి. ముందొక్కమాటు శాస్త్రిగారికి చూపించు. ఆతర్వాత నేను చెప్పవలసింది చెబుతా' అన్నారు.

శాస్త్రిగారికి చూపడానికేం? చూపెట్టాను. అరగంట కళ్లు మూసుకొని, తెలిచీ తెలియని చూపుతోనే, 'కటువుగా యితరులను దూషించకుండానే వ్రాయవచ్చునేమో!' అన్నారు.

తర్వాత ఆమాటనే సుబ్బరామయ్యగారు నూరుమాటలలో చెప్పారు.

ఆ బాటికీ ఈ బాటికీ - అలా కత్తికట్టిన కోడిలా సాహిత్యరంగంలో దూకడం సరిగా దన్న తీర్మానంమీదనే నడుచుకొంటున్నాను.

ఆ తర్వాత అసలు సాహిత్యం రెండవదిగా రాజకీయాలు ప్రధానమైనవిగా రూపొందిన పదేళ్ళలోనూ ఆ వ్యాసం అలాగే వుంచి వేశాను. తిట్లు తీసివేసి వ్రాయమన్నా ఎందుకో తర్వాత సాధ్యం కాలేదు. కారణం ఏం లేదు-అందులో వానిని తీసివేస్తే మిగిలేది చాలా తక్కువ. అప్పటి ఆదూకుడు తలచుకొని ఇప్పటికీ నాలో నేనే నవ్వుకుంటూ వుంటాను.

తర్వాత కూడా- నేను పూర్తిగా రాజకీయాలలో మునిగిపోయిన తర్వాతకూడా —ఆయన నాకు రాస్తూనే వుండేవారు. నా రాజకీయ రచన లన్నీ పంపితే చదివి తిరిగి ఏదో తెలియ జేస్తూనే వుండేవారు.

గాంధివాద మంటే అంత మహోద్దండమైన పట్టుదల వున్నా, ఆ వాదంకాని నా వాదం కూడా బాగానే వినేవారు.

'ఒక్కటే నాయనా! జీవితంలో-ఏదో నీ లక్ష్యం నీవు నిశ్చయించుకోవడం తప్పదు. అందుకోసం నిశ్చలంగా, నిర్మలంగా పనిచేసుకు పోతుంటే చాలు. ఆలక్ష్యశుద్ధి వున్నంతవరకూ నిన్నేమీ అనను, అనలేను-' అంటూ అంటూ నిమీలితనేత్రు లయ్యేవారు. కొన్నిసార్లు ఆయన విషయంలోనే నా కలా అనిపించింది.

ఏదో మందు సీసా తీశారు. చిన్న బ్లేడుతో కార్కుమీది లక్క తీసివేస్తున్నారు. వేలు తెగింది. రక్తం కారుతున్నది.

కాసేపు కళ్ళు మూసుకొని 'చూచావా! మందు తీసుకోకూడ దని ఆజ్ఞ! దాన్ని ధిక్కరింతా మని చూచాను. అందుకిది శిక్ష' అన్నారు.

ఫక్కు మని నవ్వాలనుకున్నాను. కానీ నవ్వలేదు. ఆయన తొణకలేదు, బెణకలేదు, అలానే చెప్పుకు పోతున్నారు.

కాసేపు అయ్యాక అనుకున్నాను—ఎవరి నమ్మకం వారిది—ఆ నమ్మకం ఎంత హృదయ పూర్వకమైన దన్నదే గీటురాయి. కాబట్టే ఆ మాటే మరొక రంటే వేళాకోళం చేయ గలిగినా వా రన్నప్పుడు మిన్నకుండ వలసి రావడం.

విపరీతమైన రక్తహీనతతో కొన్ని రోజులు 1937 లో బాధపడ్డాను. ఉన్నది తంబు చెట్టి వీధికొట్టకొసన. చదువుసాములు యూనివర్శిటీ లైబ్రరీలో. సాయంకాలం తర్వాత శాస్త్రిగారిల్లు. ఇదంతా అరకడుపుతో కాలినడకతోనే-ముగ్గురం కలసి 9 రూపాయలకు కారియర్ తెప్పించుకొని భోజనం. పదిరూపాయల రూములో ముగ్గురు కాపురం. అప్పటికి ఒక్కపూట తిండి ఒక చాపా ఉంటే నిత్యావసరాలు తీరిపొయ్యేవి. కానీ వానికే చాలకనే జబ్బు పడ్డాను.

అప్పుడు వారు 'నీవు నమ్మ నక్కర లేదు నా చికిత్స పొందు. ఎటూ మరొకటి నీ చే కాదు' అన్నారు.

సరే అన్నాను. సాయంకాలం నేను పారస్వతగోష్ఠికోసం వెళ్ళినా, కొంతసేపు వచ్చిన వారి యోగకార్యకలాపాలు ఎటూ సాగుతూనే ఉండేవి.

కొన్నిరోజులలో బాగుపడ్డాను. మానసికంగా వారు చేసినచికిత్స నా శారీరకరుజను మాన్పిందని గ్రహించాను.

తర్వాత చాలకాలానికి (1939)లో ఉన్నవ లక్ష్మీనారాయణగారి ద్వారా (శాస్త్రిగారూ వారూకూడా ఒకే యోగపద్ధతికి చెందినవారు) ఆ యోగాభ్యాసంకూడా చేశాను జైలులో. (1940-41) అందుమూలంగా అమేయమైన శాంతిని సంపాదించుకో గలిగాను.

శవాసనం వేశాడని మిత్రులు హాస్యం చేస్తూనే వుండేవారు. నేనలా పడుకొని అరగంటలో ఆరురోజుల విశ్రాంతిని పొందుతూనే ఉండేవాణ్ని.

ముక్తిసంగతి కాదుగానీ- అది నేను కోరనూ లేదు—ఎంత గుండె నిబ్బరమో, ఎంత మనశ్శాంతో, ఎంత నిర్మమత్వమో నాకు అందువల్ల లభించింది. కానీ అందులోనే ప్రపంచసమస్యలన్నీ తీరిపోతా యని మాత్రం నమ్మలేదు; నమ్మలేను.

తర్వాత శాస్త్రిగారిని చూడగా చిరునవ్వు నవ్వి 'ఎక్కడి కక్కడే బాబూ-నీకు కావలసినంతే నీవు తీసుకో' అన్నారు.

బుద్ధుడైనా, గాంధీ అయినా ఆయనకు ప్రాణం అంటే వారి కరుణాతరంగిత హృదయం, సేవాపరాయణత వీని వల్లనే-అవే శాస్త్రి

శాస్త్రిగారి చికిత్సావిధానం

# వైద్యప్రపంచం విభ్రాంతి

డాక్టర్ గాలి బాలసుందరరావుగారు.



నిరాశా, నిస్పృహా, నిరుత్సాహంతో నిండి పోయిన యీరోజుల్లో గురుపాదులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రులవారిని తలుచుకున్నప్పుడు శరీరంలో విద్యుచ్ఛక్తి ప్రసరించినట్లవుతుంది. జీవితంలో కొత్త బుద్ధీ, కొత్త వుత్సాహం, కష్టాలను ప్రతిఘటించి పైకి పోవాలనేఆశ కలుగుతవి.

మొట్టమొదట వారినిగురించి నా బంధువులు, బందరువాస్తవ్యులు శ్రీ డాక్టరు వేమూరి దుర్గా నాగేశ్వరరావుగారి ద్వారా విన్నాను. శాస్త్రిగారికి సర్వవ్యాధులూ యోగ శక్తితోనూ, ఆత్మబలంతోనూ నివారించేశక్తి వున్నదని స్వానుభవం వారు తెలియజేశారు.

వారి కొకప్పుడు రెండు మూత్రకోశాలలోనూ రాళ్లు ఏర్పడ్డవి. ఒక మూత్రకోశంలో రాయి యేర్పడితే శస్త్రచికిత్సద్వారా దాన్ని తీసివేయవచ్చును. రెంటినీ తీసివేయడం అసాధ్యం. ఆసమయంలో వారి కెవరో శాస్త్రిగారి సంగతి చెప్పేరట. ఆయనకు యిటువంటి యోగాలు తంత్రాలూ అంటే పరమ అవిశ్వాసం. అటువంటివారిని వేళాకోళం చేసేవారు. కాని ఆయన్ను యేలాగో ఒప్పించి శాస్త్రిగారిదగ్గరకు పంపేరు.

అప్పట్లో శాస్త్రిగారు మద్రాసులో వుండేవారు. దుర్గా నాగేశ్వరరావు గారు వారియింటికి వెళ్లి నమస్కరించి కూర్చున్నారు. కొత్తవారు రాంగానే శాస్త్రిగారి పరామర్శ వేసవిలో కొబ్బరి నీళ్లలాగా హాయినీ ఆహ్లాదాన్నీ కలిగించేది. పెద్దవారు వస్తే "ఏంబాబూ! ఏమిటి విశేషం?" అనేవారు. చిన్నవారు వస్తే "ఏం నాయనా, యేం పనిమీద వచ్చేవు?" అనేవారు. అనంతమైన మానవత్వంతో జీవిత మథనంతో సముద్భవించిన ప్రేమామృతం వారు మాట్లాడుతున్నప్పుడు పై కుబికేది.

దుర్గానాగేశ్వరరావుగారు లౌక్యులు. ముందుగానే తను వచ్చినపని తెలియజెప్పలేదు. "తమరు పెద్దలని విన్నాను. దర్శనం చేసి పోదామని వచ్చేను" అని వూరుకున్నారు. కాని ఆయన వైఖరిలో రాజసం ఆయన మాటల్లో వున్న వినయాన్ని మింగేసింది. శాస్త్రిగారు "అల్లాగా, సంతోషం" అని అక్కడ చేరిన రోగులను, పిన్నపెద్దలనూ "బాబూ ప్రార్థన చేయండి" అని తాము కళ్లు మూసుకున్నారు. శాస్త్రిగారు సరదాగా మాట్లాడుతున్నప్పుడు ఛలోక్తులాడే లౌకికాగ్రేసరుడిలాగా కనుపించేవారు. కాని ఆయన కళ్లు మూసుకుని యోగ నిద్రలో వున్నప్పుడు చూస్తే ఏ పరమశివుడో, శంకరాచార్యులో తపోముద్రలో యిక్కడ కూర్చున్నాడా-అనిపించేది.

ఈ దృశ్యం చూచేసరికి డాక్టరు గారికి నమ్మకం కుదిరింది. మర్నాడు మెల్లిగా తన వచ్చినపనిని గురించి వెళ్ళబెట్టేరు. ఆయన నవ్వి "నాలో నువ్వు నమ్మకం కుదుర్చుకున్నావు. నీలో నేనూ కుదుర్చుకోవాలి. ఈ చికిత్స పొందడానికి ఒక మనస్తత్వం వుండాలి. బజారులో క్రిష్ణఅయ్యరు కాఫీహోటలుకు వెళ్ళి నాలుగు యిడ్డెన్లు తీసుకురా. నువ్వూ నేను కలిసి తిందాము. తరవాత ట్రీట్మెంటు యిస్తాను" అన్నారు. డాక్టరు బయట నిరీక్షిస్తూన్న డ్రైవరుని పిలిచి ఇడ్డెన్లు తీసుకు రమ్మని హుకుం జారీ చేశారు. శాస్త్రిగారు

---

గారిని కూడా ఏడు నిలువుల మనిషిగా నాకు ప్రత్యక్షం చేస్తున్నవి. కాబట్టి వారి సాహిత్య చరిత్రాది వ్యాసంగాలలో నా కున్న పరిచయం ఎక్కువే అయినా, వారి సహృదయతను గూర్చి మరొకసారి సంస్మరించుకొని నమోవాకం చెప్పుకొని సంతృప్తి పడుతున్నాను.

ఎన్ని రంగాలలో ఎంత కృషి చేసినా ఎంత విజ్ఞానపాథోధులైనా నిర్వైర పోరేయగలరు. కానీ నిన్ను వినయవినమితోత్తమాంగుని చేయలేరు.

మనకు నిర్మలమై మనిషిగా మెలిగిన వారే మహాత్ములు. వారి కోవలోని వారే శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు. — విశ్వం.

---

'వాడు తెస్తే పనికి రాదు. నాయనా నీవే వెళ్లి నీ చేతుల్తోనే కొని, నడిచి తీసుకు రావాలి' అన్నారు. డాక్టర్ గారు వల్లూరి యెస్టేటు దివాన్ గారి కొడుకు. ఎవర్నీ లక్ష్యపెట్టని గర్వి. నెలకు పదిహేను వందలు సంపాయించే సంపన్నుడు. క్షణకాలం తాచులాగా లేచారు. కాని మరుక్షణంలో 'ఇడ్డెన్లు పట్టుకురా! నువ్వూ నేనూ కలిసి తిందాము' అన్న మాటలు జ్ఞప్తికి వచ్చినవి. వెంటనే 'యిక్కడ రాజపాలకు న్యాయాధిక్యాలకు తావు లేదు' అని వెళ్లి యిడ్డెన్లు కొనుక్కు వచ్చారు.

ఆ వ్యాధి నివారించడానికి శాస్త్రిగారికే చాలారోజులు పట్టె. ఈలోగా డాక్టరుగారి స్నేహితులంతా వచ్చి 'మంత్రాలకు చింతకాయల రాల్తయ్యా? యోగాలకు రాళ్లు కరుగుతయ్యా?' అని వేళాకోళం చేసి పోతూండేవారు. 'కనీసం మిక్చరయినా పుచ్చుకో!' అని సలహా యిచ్చేవారు. డాక్టరుగారు సంకోచంతో బాధపడి, 'మందయినా తాగనా!' అని శాస్త్రిగారి నడిగేవారు. ఆయన 'మందు తాగితే నాప్రమేయం మానుకో' మనేవారు. 'మీ యిష్టం' అని ఆయన వూరుకునేవారు. ఎందుకంటే ఏ మందూ ఆ రాళ్లను కరిగించలేదని ఆయనకు తెలుసు.

ఒకనాడు డాక్టరుగారికి నడుముల్లో విపరీతమయిన పోటు పుట్టింది ప్రసవవేదన కన్నా దుర్భరమయిన ఆ వేదనతో ఆయన తల్లడిల్లి పోయినారు. శాస్త్రిగారిని రమ్మని కబురు పంపించారు. 'నేను వచ్చి చేసే దేమీ లేదు. ట్రీట్ చేస్తున్నాను, వెళ్లు' అన్నారు.

డాక్టరుగారికి వళ్ళు మండింది. కాని ఏమీ చేయలేక మృత్యువు సమీపిస్తోందని కళ్లు మూసుకుని, పళ్లు బిగించి భగవద్ధ్యానానికి వూనుకున్నారు. కొంచెం సేపటికి ఆయనకు అల్పాచమానానికి వచ్చింది. వెళ్తే మూత్రంతో పాటు యేవో రాతి ముక్కలు పడిపోయినవి. అవి ఆయన జాగ్రత్తగా సేకరించి, పొట్లం కట్టి, లేబరేటరీకి పంపించారు.

ఆ మరునాటినుంచీ నొప్పి లేదు. వెంటనే వెళ్ళి ఎక్స్‌రే తీయించుకున్నారు. మూత్రాశయాల్లో రాళ్లు లేవు. వైద్య ప్రపంచం నివ్వెర పోయింది.

ఆయన పరమానందంతో, భక్తిశ్రద్ధలతో శాస్త్రిగారివద్దకు వెళ్ళి నమస్కరించి యీ సంగతి చెప్పేరు.

శాస్త్రిగారు నవ్వి 'ఆసంగతి నాకన్న ముందు ఎక్స్‌రే యంత్రానికి తెలిసిందిగా" అన్నారు. డాక్టరుగారికి క్షణంసేపు తేళ్లు, జెర్రులు పాకినట్టయింది. ఆయన కంగారు నివారించడానికి శాస్త్రిగారు యిల్లా చెప్పేరు.

'నాయనా! ప్రపంచంలో సందేహం, అనుమానం అన్ని వ్యాధులకన్నా ప్రమాదకరమయినవి. ప్రతి వారినీ విశ్వసించడంలో ప్రమాదమున్నా ఆనందం వుంది. ఈ అవిశ్వాసం, సందేహం లేకుండా వుంటే యీ వ్యాధి నివారణ యింత కాలం అయ్యేది కాదు.' డాక్టరు 'నిజమే' అన్నారు. వెళ్ళిపోయినారు.

ఈ విషయం డాక్టరుగారి ముఖతః విన్న మీదట నాకు శాస్త్రిగారిని చూడాలని కుతూహలం కలిగింది.

అప్పటికి శాస్త్రిగారు మద్రాసు విడిచి తిరుపతిలో వుంటున్నారు. ఆ యోగం సంగతి ఎవరో చెప్తే కుంభకోణంలో నేను [1] ఎస్. ఆర్. వి. వి. ద్వారా యినిషియేట్ అయినాను. ఆ యోగం అభ్యాసం చేస్తున్నప్పుడు యేదో మూర్ఛ వచ్చినవాడి శరీరం కొట్టుకునేది.

శాస్త్రిగారు యోగాభ్యాసంవల్ల యీ వ్యాధులు కుదర్చగలిగేవారా? లేదా? యింకేదయినా వారిలో శక్తి వుందా?-అనే సందేహం కలిగి వారి నడిగేను. ఒకనాడు వారు తేలు కుట్టిన మనిషిని ట్రీట్ చేసి పంపించడం చూచి, "ఈ చికిత్సాశక్తి కేవలం యోగశక్తివల్లనే అయితే మేము ట్రీట్ చేస్తే ఒకప్పుడు పోతుంది? మరొకప్పుడు పోదేం?" అన్నాను.

ఆయన నవ్వి "ఒక్కక్షణం తేలు కుట్టినట్లు బాధపడగలవా?" అని ప్రశ్నించారు. "నావల్ల కాదు" అన్నాను. "ఏ రోగి చికిత్సకు వూనుకున్నావో ఆ రోగి బాధ నువ్వు పడడానికి సిద్ధం కానంతవరకు నువ్వు చికిత్స చేయలేవు. నాకూ, యితరులకూ అదే భేదం" అన్నారు.

బుర్ర రంకుట్రాటం తిరిగినట్లు తిరిగింది. మాట రాక ఒక నమస్కారం చేసి వూరుకున్నాను. వారిచర్యలు చాలా వున్నవి. అన్నీ అన్నీ అనుభవాలే!

---

1. ఎస్. ఆర్. వి. వి. మహావ్యక్తి. శ్రీ శాస్త్రిగారికి యోగవిషయంలో సతీర్థ్యులు.

# శాస్త్రిగారితో నాపరిచయం

శ్రీ తాపీ ధర్మారావుగారు.

-:*:-

శ్రీ ప్రభాకరశాస్త్రిగారిని చూడగలభాగ్యము నాకు మూడు నాలుగుసారులు మాత్రమే కలిగింది. అందులో మొదటిసారి తిరువళిక్కేణి వెంకటరంగంవీధిలో అనుకుంటాను. దాదాపు ముప్పయి సంవత్సరాలకు పూర్వం, మిత్రులు, బ్రాహ్మోమిషనరీలు, జయంతి వెంకటనారాయణ మన కిరీటిరావుగారి నాన్నగారితో మాటలాడుతూ ఉండగా తటస్థించింది. అప్పుడు వా రెవరో నే నెరగను; నే నెవరో వా రెరగరు. శాస్త్రిగారు "అట్టె, అటె"లను గురించి గట్టిగా మాటలాడుతున్నారు అజ్ఞాతంగానే ఉండి నేను విన్నాను. వీ రెవరో అసాధ్యులు; పట్టినపట్టు విడిచి పెట్టేవారు కారు. భాషాపరిచయమూ, కావ్య, భాషాధికారం, బాగా ఉన్నవారు అని అనుకున్నాను. తరవాత వీరే వేటూరి ప్రభాకరశాస్త్రిగా రని విని చాల సంతోషించాను. అది నా మొదటి అభిప్రాయము. నేటివరకు అది మార్చుకోవలసిన అవసరం కనిపించలేదు.

తరవాత వారిని చూడగలగడం చెన్నపురాంధ్ర మహాసభలో. అప్పు డది ఇప్పటి భవనంలో కాక గోవిందప్ప నాయకవీధిలో ఉండేది లెండి. పెద్ద కవుల పాదపూరణాల మీదికి సంభాషణ వెళ్లింది. పడికట్టు రాళ్లు వేసినా ఈ మహాకవులు చమత్కారంగా వేసేవారని అనుకున్నాము. ఇప్పుడు ఒక్క సంగతి ఇక్కడ చెప్పక తప్పదు. ఆ సంభాషణలో నేను మాత్రం కొంటెతనంతో నే మాటలాడాను. నన్నయభట్టు

'ఇది యేనున్ సతతంబు నాయెడ
కరం బిష్టంబులై యుండు, పా'

అన్న పద్యంలో ఎల్లప్పుడూ అన్న అర్థంలో ప్రయోగించిన సతతంబు, పాయువు, సంతత, శశ్వత్ అన్నపదా లన్నిటిలో ఏ మయినా సారస్య ముందా? రాజుగారి మాటలు కాబట్టి మూడు పిరుపులతోనూ నాలుగు పునరుక్తులతోనూ నన్నయ్య చెప్పాడా? ఈ పద్యాన్ని

'సారమతిన్ కవీంద్రులు
ప్రసన్నకథా కలితార్థయుక్తిలో నారసి'

అన్న మాటలతో అన్వయించడానికి వీలుంటుందా? అని కొంటె ప్రశ్నలు వేశాను.

కొన్నాళ్ళ తరువాత శ్రీ శాస్త్రిగారు 'ఆవు కథ' అనో 'కామధేనువుకథ' అనో ఒక చిన్నపుస్తకము వ్యావహారిక భాషను ప్రచురించి నట్టుంది. అప్పటికి నేను గ్రాంథికవాదిని—వీరగ్రాంథికవాది నని గూడా అనవచ్చు నేమో! అరసున్నలతోనూ, బండి రాలతోనూ. అయ్యో! ఇటువంటి పండిత ప్రకాండులు గూడ ఈ గ్రామ్య రచనలకు దిగిపోయారే అని చాల విచారించాను. శాస్త్రిగారి వంటి ప్రతిభగల వారు వ్యావహారిక భాషను గ్రంథరచన ఆరంభిస్తే, గ్రాంథికవాదానికి గట్టిదెబ్బ తగలక పోదని అనుకున్న వారిలో నే నొకడను. తరువాత నా యీ అభిప్రాయాలు మారడమూ, 'కొత్త పాళీ' వ్యాసాలతో నేను గూడ వ్యావహారికానికి రావడమూ జరిగింది. ఆ విధంగా శాస్త్రిగారు నాకు పరోక్షంగా దారి చూపించారు.

తరువాత విజయ విలాస వ్యాఖ్యానం సందర్భంలో వారికీ నాకు అనవసరంగా కొంతవాదం జరగడమూ, తీగ లాగినందువల్ల డొంకంతా కదల బోవడమూ పండితలోకానికి తెలిసినవిషయమే. ఆరగడ చల్లారినతరువాత భారతి పత్రికలో 'వ్యాఖ్యాన విధానము' అన్న శీర్షిక క్రింద నేను కొన్ని పద్యాలను ప్రకటించాను. వాటిని చూచి శ్రీ శాస్త్రిగారు తమ మిత్రులతో నా వ్యాఖ్యానం త్వరగా ప్రకటిస్తే బాగుండునని అన్నారట! అది అభిమానంతో అన్న మాటో, ఆక్షేపణ కోసం చెప్పినదో తెలుసుకోడానికి కాలం అనుకూలించ లేదని విచారిస్తున్నాను.

ఆంధ్రభాషకు అనన్యసామాన్య మయిన సేవను బహుముఖముల చేసి శాస్త్రిగారు ధన్యజీవు లయారు. అటువంటి వారితో నా కింతకంటే ఎక్కువ పరిచయం లభించనందుకు అనేకసార్లు విచారిస్తుంటాను.

# దేశిసాహితిసొంపు

[దేశిరచనల సేకరణకూ, తత్ప్రచురణకూ జీవిత మంతా అంకితం చేసి ఆంధ్రావళికి అమూల్యఫలాలను అందించినవారు శ్రీ శాస్త్రిగారు. పండితుల మన్నన పొందక గ్రామీణులకు వేదప్రాయంగా ఉన్న యాదవ భారతం వారు పరిష్కరించినది మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకశాల వారిచే యిటీవలే ప్రచురింపబడింది. అది వారి అభ్యుదయదృక్పథానికి తార్కాణం.

—సంపాదకులు.]

ఆంధ్రజాతి యాచారవ్యవహార ప్రవాహములో అంతర్లీనము లయిపోయినవి ప్రాచీన కాలపు దేశిరచనాప్రభేదములు. అవి యెంతగా అంతర్లీనము లయినవీ అంటే వాని అనుపానులు సరిగా సనిగా నేటివారు అనుమానించడానికైనా సాధ్యపడనంత యెంతగా అంతర్లీనము లయినవి. నేటికాలపు తెలుగు పాండితి వాటి వాసనకైనా యెరుగ నక్కఱ లేనంత యువనతితో ఉన్నది. మన ప్రాచీన కవీశ్వరులు ఈ దేశిరచనా ప్రభేదములను బాగా యెరిగిన వారై ఉండేవా రని, రచించ గలవారై కూడా ఉండేవారని చెప్పడాని కాధారము లున్నవి. నాచన సోమన వసంతవిలాస మని గ్రంథము రచించినాడట. అది దొరక లేదు గాని దానిలోని రచన యొకటి లక్షణగ్రంథాలలో ఉదాహృతమై ఉన్నది.

"వీణాగానము వెన్నెలతేటా
రాణ మీఱంగా రమణులపాటా
ప్రాణమైన పినబ్రాహ్మణు వీటా,
జాణలు మెత్తురు జాజరపాటా."

ఈ జాజఱపాట దేశిరచనా ప్రభేదమే. వసంతవిలాసము యక్షగాన మేమో.

అల్లసాని పెద్దన చతుర్విధ కవితా విశారదుడు. ఆశు, మధుర, చిత్ర, విస్తరము లని చతుర్విధకవితల పేళ్లు. అందు దేశిగేయ రచనలకే మధురకవిత లని పేర.

దేశిరచనలు ఆచారవ్యవహారములలో అంతర్లీనమై ఉండడం కొంత వివరిస్తాను.

"వాడు నన్ను 'ఎగతాళి' చేస్తున్నాడు" అన్న నానుడి ఆంధ్రదేశం అంతటా ఉన్నది. ఇందులోని 'ఎగతాళి' పదం పుట్టు పూర్వోత్తరాలు ఎట్టాంటివో ఎరుగున్నవా రెందరో ఉండరు. ఎగతాళి అనేది ఒక దేశిరచనా ప్రభేదము. 'ఏకతాళి' 'ఎగతాళి' రూపభేదములే. సాతవాహనుల నాటిదగు బృహద్దేశి, చాళుక్య సోమేశ్వరుని మానసోల్లాసమూ, చాళుక్య జగదేకమల్లుని సంగీత చూడామణి, కాకతీయుల నాటి జాయసేనాపతి నృత్తరత్నావళి యీ 'యేకతాళి'ని పేర్కొన్నవి. 'ఏకతాళాఖ్యతాళేన గేయా స్యాదేకతాళికా' అని సంగీతచూడామణి. యక్షగానములలో కొన్నింట ఏకతాళి రచన లున్నవి.

వాడు చిందులు తొక్కుతున్నాడు. ఆ వీధిలో వంకాయలు వాల లాడుతున్నవి ఇత్యాది వ్యవహారములలోని 'చిందులు' దేశిరచనాప్రభేదములే. 'వేడుకతో చిందు పాడంగ నుబ్బి, కోణంగి యాటల గునిసెడివారు' అని చిందుపాటను పాల్కురికి సోమనాథుడు పేర్కొన్నాడు. 'గీతార్థాభినయోపేతైః ద్విపదైః శ్చిందు సంజ్ఞకైః' అని చిందులు రెండేసి పదములు గలవిగా జాయసేనాపతి చెప్పినాడు. యక్షగానములలో కొన్నింట చిందురచనలు కానవచ్చును. అవి ఆంధ్రదేశమునుండి అరవదేశమునకు కూడా ఎగప్రాకి అక్కడ లక్ష్యలక్షణ ప్రయోగ ప్రసిద్ధి పడసియున్నది. 'కావడిచిందు' 'నొండి-కుంటి-చిందు' ఇత్యాదులు అక్కడి ప్రభేదములు.

'వాడు' 'తందనా' లాడుతున్నాడు అన్న వ్యవహారములోని 'తందనాలు' తందాన పదము లన్న పేర ప్రసిద్ధి గాంచిన పదములే. వాటిలో 'తందానే' అన్నది ఆ పదమునకు పల్లవిగా-అంటే ఊతపలుకుగా ఉంటుంది. 'ఇదేమిటో 'పెద్ద రగడగా' నున్నదే అన్న పలుకుబడిలోని రగడ గేయ రచనా ప్రభేదమే. రగడలు కొంతమార్పు పొంది, పొందకుండా కూడా తెలుగులో ఎన్నో రకాల గేయ రచన

లయినవి. 'ధవళాలు పాడుతున్నారు' అనే నానుడిలోని ధవళాలు వివాహాది శుభకార్యములలోను యక్షగానములలోను ప్రసిద్ధి గాంచి యున్నవి. 'కథాను షట్పదీ యోజ్యా వివాహే ధవళ స్తథా' అని చాళుక్య సోమేశ్వరుడు చెప్పినాడు. 'నీకే వచ్చు సువాలయున్ ధవళ మింతీ' 'అల్లోనేరేళ్లు గౌరీ కల్యాణము' ఇత్యాదిగా పాంచాలీ పరిణయమునను 'అలల నామణి కా గయ్యాళి యొకానొక్క వేళ నక్కరతో సువ్వాలలు సోబానలు ధవళాలున్ మొదలైన పాట లాదట నేర్పన్' అని 'శుకసప్తతి' లోనూ ధవళాలు పేర్కొన బడినవి. యక్షగానములలో ధవళములు అధికముగా గానవచ్చును. ఇంకా ఏల పాటలు అనేవి కూడా దేశిరచనా ప్రభేదములే. చాళుక్యజగదేక మల్లుడు సంగీత చూడామణిలో కర్ణాటలాట గౌళాంధ్ర ద్రావిడభాషలలో ఏలలు కలవనీ అందులో ఆంధ్రుల 'ఏలలు' మిక్కిలి మనోజ్ఞము లనీ చెప్పియున్నాడు. యక్షగానములలోను సామాన్యజన వ్యవహారములలోను ఎన్నో రకాలైన ఏలలు సర్వాంధ్రదేశమునను వ్యాపించి యున్నవి. సువాలలు, ఉయ్యాలలు, ఓలలు కూడా అట్టివే. 'అల్లో నేరేళ్లు' అనే పేరు గేయ రచనలకు వింత తీరుగా వచ్చినది. అల్లో నేరేళ్లల్లో వెలది రుక్మిణి సమస్త వేడుక లారయె' అని ఉపక్రమము గల పాతకాలపు పాట ఫణితిని రచితములైన గేయములన్నిటికీ 'అల్లో నేరేళ్లు' అన్న పేరైంది. 'అల్లో నేరేళ్లల్లో' పాటలు వెన్నెల రాత్రులందు ఆరుబైట కన్యకలు రెండువరుసలుగా వేరుపడి ఆడుతూ పాడే పాటలు. ఇది మిక్కిలి ప్రాచీనమైనది. ''వెన్నెల దినముల, నల్లో నేరేళ్లు గాక యావల గలవే' అని రామాయణ సుందరకాండములో గలదు. యక్షగానములలో గేయభాగములుగాను ఇంకా అనేక కథా ప్రధాన గేయములుగాను ఈ అల్లోనేరేళ్లున్నవి. 'వాడు కూనరాగాలు తీస్తున్నాడు' అన్న నానుడి సర్వాంధ్ర విదితము. ఈ కూనరాగాలు 'కూనలమ్మపదాలు' అనే వింతతీరు పదరచనలు. ఇంకా శోభనాలు, కొట్నాలపాటలు, గౌరీకల్యాణములు, అర్ధచంద్రికలు, జంపెలు, కురుచజంపెలు, త్రిభంగులు, మటిమ శతులు, విరాళిపదాలు, పాళిరేకులు, వెన్నెల పదాలు, తుమ్మెదపదాలు, చందమామ పదాలు, చిలుకపదాలు, త్రిపదలు, షట్పదులు, సప్తపదులు మొదలైనపదా లెన్నో అత్యలక్షణస్వరూపములలో వున్నవి. మార్గశిర మాసము వస్తున్నది. ఆనెలలో ఆంధ్రదేశమంతటా కన్యకలు 'గొబ్బిళ్లు' అని పేడబొమ్మలు పెట్టి గొబ్బిపాటలు పాడే సంప్రదాయ మున్నది. 'గొబ్బియలు' గొబ్బిళ్లు అన్నపదము 'గోపికలు' అన్నపదమునుండి పుట్టినది. గొబ్బిళ్లయాట రాసక్రీడానృత్యమే. గొబ్బిళ్లపాటలు పెక్కు తీరులవి కలవు.

పైవాటిలో కొన్నిటికి మాదిరులు వినండి.

గొబ్బిపాట :

కొలనిదోపరికి గొబ్బిళ్లో, యదు
కులస్వామికిని గొబ్బిళ్లో
కొండ గొడుగుగా గోవులఁ గాచిన
కొండుకశిశువుకు గొబ్బిళ్లో
దుండగంపుదైత్యుల కల్లను తల
గుండుగండనికి గొబ్బిళ్లో
పాపవిధుల శిశుపాలుని గొట్టిన
గోపగానికిని గొబ్బిళ్లో
ఏపుఁ గంసుని యిడుముల బెట్టిన
గోపబాలునికి గొబ్బిళ్లో
దండివైరులను తఱిమినదనుజుల
గుండెదిగులునకు గొబ్బిళ్లో
వెండిపైఁడియగు వేంకటగిరిపై
కొండలయ్యకును గొబ్బిళ్లో.

ఉయ్యాలపాట :

అలరఁ జంచలమైన ఆత్మలం దుండని
యలవాటుసేసెనీ వుయ్యాలా...
పలుమారు నిశ్వాస పవనమందుండనీ
భావంబుదెలిపెనీ వుయ్యాలా...
ఉదయాస్తశైలంబు లొనరగంభములైన
ఉడుమండలము మోచె నుయ్యాలా
అదననాకాశపద మడ్డదూలంబైన
అఖిలంబు నిండెనీ వుయ్యాలా
పదిలముగ వేదములు బంగారుచేరులై
పట్టవెరపై తోచె నుయ్యాలా
వదల కిటు ధర్మదేవతపీఠమై మిగుల
వర్ణింప నరుదాయె నుయ్యాలా...

అల్లోనేరేళ్లు :

(అల్లో నేరేళ్లల్లో, వెలది రుక్మిణి సమర్త వేడూక లాయే...అనే మట్టుతో)

అల్లో నేరేళ్లల్లో చెలువ కృష్ణుం
డనుచు చెప్పరే మీరూ అల్లో...
అల్లో నేరేళ్లల్లో కరివేల్పు
మనదొరకు కలిగనే నేడూ
అల్లో నేరేళ్లల్లో సిరివరునివలె నితడు
చెలగుచున్నాడూ
అల్లో నేరేళ్లల్లో తరుణీ యశోదకూ
తనయుడైనాడూ
గురికానివలె నితడు గునియుచున్నాడూ
మింట పూవులవాన మెలత కురిసేనే
ఇంటికే భేరీలు వేడ్క మొరసేనే. అల్లో.

వెన్నెలపదము :

ఎన్నాడు వానికి నే లలననైతినో
వెన్నెలారో, వాడు
నన్నెద దలచడు,
నే నేమి చేతును, వెన్నెలారో
చాలగా నమ్మితా చక్కని చెలిమికి
వెన్నెలారో, నా
మేలును నింతైన మనసు
నుంచడాయె వెన్నెలారో
వలపు నిల్ప నాదు వశము కాదు
ఇంక వెన్నెలారో.

చిలుకపదం :

మనవి యొక్కటి చెప్పే నేరామచిలుకా, నా
మనవి నైకోవే వోరామచిలుకా...
వజ్జరం గొట్టేనే వోరామచిలుకా, వాని
బుజ్జగించి తోడితేవే రామచిలుకా...

ధవళము :

జయజయా జ్ఞానసంపన్నా
జయజయా నిన్ను బుధు లెన్నా
జయము నీ పదములూ గన్నా
జయ మాను ఒడయనంబెన్నా

ఏల. (తత్త్వము :)

నీవూ నేనూ గూడీ భావనాకొలదీ
కేవలబ్రహ్మాను గీలుకొల్పుదమూ - నీవూ,
సారెసారెకు వారీ సరసంగములా
తీగూగా జగముల ద్రిప్పుచుందామె,
మానవీగణముల మమత నొందించీ
పూని భ్రాంతులలోన పొరల జేయు
దమూ-నీవూ (జ్ఞానకురవంజి)

సువాల :

మారసంహారుండు తొల్లి
దారువనములో మునుల
చారుముఖులతో రమించు జారవిద్యలన్
తేటగనే నేను వాలపాటగా రచించువాడ
పాటలాగంధు లెల్ల ప్రౌఢి బాడంగా
హాయడు వొక్కనాడు తారకాచలంబు
[నందు తనకు
నర్హమైన రత్నసింహాసనంబునా.
(దారువనక్రీడనము.)

తుమ్మెదపదము :

ఆదినాథుండ రానె తుమ్మెదా అ
ల్లతడూ వూరికి పోయె తుమ్మెదా, నా
వద్ద నెవ్వరు లేరు తుమ్మెదా, వచ్చి
వాలలాడి పోవె తుమ్మెదా.

వెన్నెలపదము :

అక్కలమ్మకు సాగె పోయె వెన్నెలారో,
[ఇపుడు
లెక్కలేని కడుపు లాయె వెన్నెలారో
కుంకులమ్మపుణ్యాన వెన్నెలారో మన
నందునికి కొడుకు కల్గె వెన్నెలారో,
పొంగళ్లు పెట్టుదము వెన్నెలారో మంచి
బోనాము ముద్య లంది వెన్నెలారో.

(ఆల్ ఇండియా రేడియో మద్రాసు కేంద్రం వారి సౌజన్యంతో)

# ద్విపదవాఙ్మయము - శాస్త్రిగారి సేవ



శ్రీమతి బి. ఆదిలక్ష్మిగారు

ఆంధ్రవాఙ్మయమునందలి దేశికవితా శాఖలలో ప్రధానమై ప్రాచీనకాలమునుండి వెలయుచుండినది ద్విపదకవితాశాఖ. తక్కిన దేశికవితా శాఖలవలెనే దీనికిని పర్యాప్తమైన పరిశీలన జరుగలేదు. ప్రాచీనాంధ్ర భాషా పరిణామమునుగాని ఛందస్సాహితీ సంప్రదాయములనుగాని, జానపద వాఙ్మయ విశిష్టతనుగాని తెలిసికొనవలయు ననిన ద్విపదశాఖ పరిశీలనమే ప్రధానాధారమై యున్నది. ఈ కవితాశాఖకుఁ గల యిట్టి యుత్కృష్టతను, ప్రాముఖ్యమును గుర్తించి ద్విపదతత్త్వమును విశదీకరించుటయే గాక, ఆ శాఖయందు ప్రాథమికమును, ప్రధానమునునగు బసవపురాణ సంస్కరణముతో మొదలిడి అగుమంచి కథవరకు గల ద్విపద వాఙ్మయము నామూలాగ్రముగా పరిశోధించిన యశస్సు శ్రీ శాస్త్రిగారిదే. అనవద్యమును అసాధారణమును నగు వీరి పరిశ్రమవలననే యాంధ్రవాఙ్మయమున నేడు ద్విపదశాఖ కొక ప్రత్యేకగౌరవస్థానము లభించినది. అంతే కాక వీరిచే సుసంస్కృతములైన ద్విపదగ్రంథములు భావి పరిశోధనకు దోహద మొసంగుచు తర్వాతి వారలకు మార్గదర్శకములై వెలయుచున్నవి.

బసవపురాణ పీఠికారచనకు పూర్వమే శాస్త్రిగారు తమ శృంగార శ్రీనాథమున పల్నాటి వీరచరిత్రమును గూర్చి చెప్పుచు, ద్విపదయొక్క దేశితత్త్వమును గూర్చి దిఙ్మాత్రముగ సూచించి యున్నారు. ఆవెనుక బసవపురాణపీఠికలో దీనిని విపులముగా వివరించి యున్నారు. అందలి వాక్యములు కొన్ని సూత్రప్రాయములు. ద్విపదకవితాబ్రహ్మ యనఁదగిన సోమనాథుని గూర్చిన శాస్త్రిగారి వాక్యములు "ఇతఁడు దేశీయకథలను దేశిచ్ఛందోజనిత మగు ద్విపదమున దేశి తెనుగు భాషలో రచించిన వాఁడగుటచే నీతని కవితలో నాంధ్రతాముద్ర చక్కగ నెక్కినది."

"సంస్కృత భాషలో ననుష్టుప్పువలె సుళువుగా రచింపఁదగినదై అక్షర బాహుళ్యము లేమిచే సులభముగా చదువఁదగినదై అన్వయక్లేశము లేమిచే సులువుగా నర్థము చేసికొనఁదగినదై పురాణాదులందు లక్షల గ్రంథసం- లో వెలసియుండుట యెఱిఁగి దానివలె తెలుగున వెలయఁదగినది ద్విపద యని సోమనాథుఁడు గుర్తించినాఁడు."

"ద్విపద రచన సర్వసామాన్యము. వర్తమాన నాగరకలోకము కొంత వర్జించుచున్నను నాఁడును నేఁడును ఆంధ్రలోకము నాలుకలపై నాట్యమాడుచున్నది."

"ఒక్క ద్విపదమే విషయ భేదమునుబట్టి స్థలభేదమును బట్టి పాఠకభేదమునుబట్టి పఠించు తీరులో బహు భేదములను బొందుచున్నది. తోలుబొమ్మలవాండ్ర యాటలలోను, స్త్రీల పాటలలోను, పంబవాండ్రయు, బవనీండ్రయు సుద్దులలోను మఱియుఁ బెక్కువిధములగు పామర రచనములలోను బహుళముగా ద్విపదయు, మంజరియు గానవచ్చును."

"సర్వసామాన్య మగుట ద్విపద కొక గుణవిశేషము. గద్యపద్యోదాత్త కృతుల కది తీసిపోదు. కావ్యగౌరవమును పోషించునది దోషరాహిత్యమును గుణసాహిత్యమును గాని ఛందఃప్రయాసాతిశయము గాదు."

ఇట్లు ద్విపదవాఙ్మయమున కావ్యగౌరవము గల గ్రంథముల వైపే కాక, పామరజన రచనముల పట్లకూడ చదువరుల దృష్టి మరలునట్లు శాస్త్రిగారి వాక్యములు రచితములైనవి. ద్విపద శాఖకు జెందిన బసవపురాణము, రంగనాథ రామాయణము, అన్నమాచార్యచరిత్రము, తిమ్మక్క సుభద్రాకల్యాణము మొదలగు గ్రంథములతోపాటు కాటమరాజుకథ, అగుమంచికథ మున్నగు జానపదగేయ కృతులను కూడ వీరు సంస్కరించుటపైయభిప్రాయమునే స్థిరపఱుచుచున్నవి.

ఇట్టి జానపద కృతులకు నిన్న మొన్నటి వఱకును సాహిత్యమునందు గాని వాఙ్మయ చరిత్రమునందుఁగాని స్థానమే లేదు. శ్రీశాస్త్రుల వారి యమోఘ పరిశ్రమ ఫలితముగనే నేడీ గ్రంథములు సాహిత్యోపాసకుల కుపాదేయములై వాఙ్మయచరిత్రమున వర్ధమానము లగుచున్నవి.

బహుజనపల్లి వారిచే పంచమ తరగతియందు

పరిగణింపఁబడిన ఫాల్కురికి సోమనాథుని ప్రతిభా విశేషమును, కవితా విశిష్టతను, ద్విపద రచన చేతనే ప్రథమ తరగతికి చేర్చ వచ్చునని చాటి చెప్పినది శ్రీ శాస్త్రిగారే. బసవ పురాణ పీఠికచే ఆంధ్ర ద్విపద వాఙ్మయ చరిత్ర రచనకు వీరు శ్రీకారము చుట్టినవారైనారు. మధుర కవితా ఛందస్సంప్రదాయములే కాక, వీరశైవమత ప్రాముఖ్యమును గూడ వీరు చర్చించియున్నారు.

రంగనాథ రామాయణము బసవ పురాణము తరువాత ప్రజారంజకమగు ద్విపద కావ్యము. ఈ గ్రంథము శాస్త్రిగారి చేతికి రాక ముందెన్నో ముద్రణముల నందినది. కాని యవి యన్నియు ప్రామాణికములుగ ముద్రితములు కాకపోవుటచే ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారు ప్రత్యేకముగా శాస్త్రిగారి చేత నీ గ్రంథమును సంస్కరింపఁ జేసి ప్రకటించిరి. ప్రాచీనాంధ్రగ్రంథములలో ముఖ్యముగా ద్విపద కావ్యము లెట్లు సంస్కరింప వలెనో బసవ పురాణ పీఠికలో శాస్త్రిగారు వ్యక్తము చేసియున్నారు.

ఛందస్స్వాతంత్ర్యము అనఁగా ద్విపదయందు ప్రాసయతిని పాటించుట, పూర్ణఖండ బిందు ప్రాసలు, భాషా స్వాతంత్ర్యము, ద్రవిడ కర్ణాటపదము లుపయుక్తము లగుట మున్నగు విషయముల నెన్నియో దృష్టిలో నుంచుకొని ప్రాచీన గ్రంథ సంస్కరణముఁ గావింప వలెనని శాస్త్రిగారు నిరూపించినారు.

రంగనాథ రామాయణము బసవ పురాణము కన్న విలక్షణమగు ద్విపదకావ్యము. అయినను నందు ప్రాచీనభాషా సంప్రదాయములు పలుకుబళ్లు మెండుకొని యున్నవి. అదియును దేశి రచనయే కదా! అందుచే కొంతవఱకు భాషావిషయమున బసవ పురాణమును పోలియున్న దనవచ్చును. శాస్త్రుల వారి రంగనాథ రామాయణ సంస్కరణము వలన పూర్వముద్రణములందు మఱుగు పడిన భాషావిశేషము లెన్నో బయల్పడినవి. కాని పీఠికాకర్తలు శాస్త్రిగారు కానందున ఆ విషయములు లోకమునకు తెలియుట కవకాశము లేక పోయినది.

శాస్త్రిగారి మతమున గ్రంథకర్త చక్రపాణి రంగనాథుఁడు. ఈతని గూర్చి లోకమునకు మొదటఁ దెలియఁ బఱచినవారును శ్రీ శాస్త్రుల వారే. బసవ పురాణ పీఠికలో 22-25 పుటలలో నీతని చరిత్ర సంగ్రహముగా నున్నది. శ్రీ వేంకటేశ్వర పరిశోధనాలయ పత్రికలో చక్రపాణి రంగనజీవితమును (Vol VIII No 1 16—40 P p) ప్రకటించుటయే కాక శాస్త్రిగా రీతని కృతులగు నయన రగడ, నమశ్శివాయ రగడ అను వానిని ముద్రించిరి. పూర్వ లాక్షణికులు రంగనాథుని పేరనే రంగనాథ రామాయణము నుదాహరించుటయే శాస్త్రిగారి వాదమున కాధారము.

అనేకపాఠభేదముల తోడను ప్రక్షిప్తముల తోడను కూడి యున్న రంగనాథ రామాయణము నామూలాగ్రముగా పరిశోధించి, భిన్న భిన్న ప్రతులతో సంప్రతించి మూల గ్రంథమును నిర్ధారణ చేయుటయే కాక, ప్రక్షిప్త భాగములను ప్రత్యేకముగా రెండను బంధములలో నిచ్చియున్నారు. ఇట్లు వానిని వేఱుగా నిచ్చియుండుటచే నితరపరిశోధకులకు - ఆయా భాగములు మూలములో నుండవలయునా? లేదా అను విషయపరిశీలన కవకాశము కలిగినది[1]. ఇది వారి వివేచనాజ్ఞానమునకు, గ్రంథసంస్కరణమునందుఁ గల వారి యనుభవమునకు తార్కాణము.

రంగనాథరామాయణమునందు ప్రతి పుటయందుగనను పాఠభేదములలో మూలానుసరణములు, శబ్ద విశేషములు, భాషా సంప్రదాయములు ఎన్నియో వివరింపఁబడి యున్నవి. ఇట్లు చేసినందున పాఠకులకు పరిశోధకులకు కూడ నీ గ్రంథ ముపాదేయమై వెలసినది.

ఈ రంగనాథ రామాయణ ప్రాశస్త్యమును గూర్చిన వారి మాట లివి "తెలుఁగున నీ రెడ్డి రాజులు వెలయించిన ద్విపద రామాయణము ప్రౌఢకవితారసికులకే గాక పామరజనులకుఁ గూడ సాహిత్యానందము సమకూర్చుచు నత్యధిక ప్రచారము కలదిగా నున్నది. ఆంధ్ర రామాయణములలో రసపారవశ్యము గలిగించు రచన మిట్టిది వేఱొకటి లేదు. ప్రాచీన లాక్షణిక కవులందఱును నీ రామాయణ ప్రయోగములను బరమ

1. ఇటీవల వెలువడిన కట్టా వరదరాజు రామాయణ ద్విపదపీఠికయందు ఈ ప్రక్షిప్తభాగములు కొన్ని రంగనాథ రామాయణమునకు చెందవని నిరూపింపఁ బడినవి.

ప్రమాణముగాఁ బరిగ్రహించిరి. ఆంధ్ర ప్రజా సామాన్యమును రామాయణ కథా మాధురిని నాస్వాదింపఁజేసిన రామాయణ మిదియే.''

అన్నమాచార్య చరిత్ర శ్రీ కృష్ణదేవరాయ యుగమునకుఁ జెందిన ద్విపదగ్రంథము. ఇది సుప్రసిద్ధ సంకీర్తనాచార్యుఁడగు తాళ్ళపాక అన్నమాచార్యుని జీవితచరిత్ర. అతని మనుమఁడగు తాళ్ళపాక చిన్నన్నచే రచితమైనది. కేవలము ప్రాచీన ద్విపదకృతులనే కాక అపూర్వమైన ద్విపదకృతులను వెలికిఁదీసి వ్యాప్తిలోనికి తెచ్చిన కీర్తి శ్రీ ప్రభాకర శాస్త్రిగారిదే. అన్నమాచార్య చరిత్ర ఈ వర్గమునకు చెందినది. అన్నమాచార్య చరిత్రను శాస్త్రిగారు సంపాదించిన విధము గూడ అపూర్వమైనదియే. దానిని వారు సంస్కరించి విపుల పీఠికతో వెలయించిన విధముకూడ అసాధారణమైనదియే. నలుబదియేను పుటలు గల గ్రంథమునకు నూటముప్పదిమూఁడు పుటల పీఠిక కలదు. అందు అన్నమాచార్యుల జీవిత చరిత్రము సమగ్రముగా చారిత్రక పద్ధతుల ననుసరించి సంకీర్తనోదాహృతులతో సర్వాంకషముగా సంతరింపఁబడినది. మూలగ్రంథములందలి వాక్యములనే పురస్కరించుకొని సంప్రదాయ పరిజ్ఞానముతో సమన్వయించి శాస్త్రిగారు వ్రాసిన ఈ పీఠికవంటివి వాఙ్మయమున కొన్నియే కలవు. ఈ గ్రంథము ద్విపద వాఙ్మయముననే కాక ఆంధ్రవాఙ్మయమున అన్నమాచార్యుని స్థానము నిరూపించుటకు తోడ్పడుచున్నది. ఇది జీవితచరిత్రయే యైనను చిన్నన్న తన తాత యని అతిశయోక్తులతోఁడను, నుత్కర్షతోడను రచన గావింపక సరియగు చారిత్రకసత్యము ననుసరించి రచించినందులకు నెంతయు ప్రశంసార్హుఁడగుచున్నాఁడు.

కాటమరాజు కథ — శాస్త్రిగారికి దేశి రచనలలో జానపదగేయ వాఙ్మయమునం దెంత యాదరము కలదో ఈ వఱకే తెలిపియుంటిని. పల్నాటి భారతము వెనుక తెలుఁగువారి పరాక్రమమును తెల్లము సేయు కాటమరాజు కథ వారి దృష్టి నాకర్షించినది. ఇది ద్విపద రచనలో నున్నను దేశమున విశేషప్రచారములో నుండుటచే పెక్కు పాఠభేదము లేర్పడి కొన్ని పట్టుల మూలపాఠము గుర్తింప సాధ్యము కాని స్థితికి వచ్చినది. ఈ గ్రంథము కూడ పల్నాటి వీరచరిత్ర వంటి పెద్ద గ్రంథమే. ఇది గొల్ల కులమునకు సంబంధించిన దగుటచే దీనికి యాదవ భారత మని పేరు. 'యాదవ భారతము ఎద్దు మోత ప్రమాణ'మని నానుడి కలదు. ఇందలి ప్రధానవిషయము నెల్లూరి రాజగు మనుమసిద్ధికిని యాదవరాజగు కాటమరాజునకును పశువుల బీళ్ళ విషయమై సంభవించిన యుద్ధము. తెలుఁగు పౌరుషము మూర్తీభవించిన ఖడ్గతిక్కన ప్రాణములు గోల్పోయినదీ యుద్ధరంగముననే. దీనిని మంజరీ ద్విపదలో శ్రీనాథ మహాకవి రచించె నని ఈ తర్వాత ప్రచారములో నున్న పిన ఎల్లయ రచనమువలన తెలియుచున్నది. ఇందు ఆంధ్ర దేశమందు గల పశుగణములను గూర్చి ఆ కాలపు కట్టుబాట్లనుగూర్చి యెన్నియో విషయములు వివరింపఁబడియున్నవి. ప్రాంత పలుకుబళ్లు నానుళ్లు విశేషముగ నున్నవి. ఈ గ్రంథమును శ్రీ శాస్త్రిగారు ఒకటి కాదు, రెండు కాదు, తొమ్మిది తాళప్రతులను పరిశీలించి, ఒక శుద్ధ ప్రతిని ముద్రణమునకై తయారు చేసి యుంచిరి. కాని యది వారి పీఠికతో వెలువడు భాగ్యము లేకపోయినది. వారి యనంతర మిది ప్రకటితము కావలసి వచ్చినది. పై రంగనాథ రామాయణ ముద్రణము వలెనే దీని యందలి విశేషములు కూడ గ్రహించుట కవకాశము లేక పోయినది. అయినను నిట్టి రచనలను ప్రోత్సాహ పఱిచి వెలువడ జేసి ప్రచారములోనికి తెచ్చుటయే శాస్త్రులవారి దూరదర్శిత్వమునకు ప్రతిభకు తార్కాణము. ఇది కేవలము ప్రజావాఙ్మయమునకు సంబంధించినది. ఇట్టిదే అగుమంచికథ కూడ. దానిని శ్రీ శాస్త్రిగారు పరిశోధించి పెట్టినట్లు పరిశోధన పత్రిక మూలమున తెలిసినది. ఈ గ్రంథ మా పత్రిక యందే ముద్రించుటకు పూనుకొనఁబడుట ముదావహము.

కాటమరాజుకథ మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము వారిచే ప్రకటితమైనది. దీనివలన నిట్టి దేశిరచనలయందు పరిశ్రమ సాగించుట కుత్సాహ ముప్పతిల్లినది. అగుమంచి కథ కూడ ప్రకటిత మగునేని ఈ యుత్సాహము మఱింత వృద్ధి పొందఁగలదు.

ఒక్క వాక్యములో శ్రీ శాస్త్రులవారి సేవను నిరూపింపవలె ననిన — అధునాతనులలో ద్విపద వాఙ్మయ స్వరూపమును తీర్చి దిద్దినవారిలో ప్రభాకరశాస్త్రిగారే ప్రథములు.

# వ్యావహారికభాషావాదం : శ్రీ శాస్త్రిగారితోడ్పాటు

శ్రీ గిడుగు వెంకటసీతాపతిగారు.

-: * :-

ప్రభాకరశాస్త్రిగారితో నాకు గల పరిచయము 1912 లో ప్రారంభించినది. అది యొక విచిత్రమైన సన్నివేశము. ఆ నాటికి నాకూ మా తండ్రిగారికీ ఒక విషయము నూతనముగా తెలియవచ్చినది. అప్పకవీయము లోను, కూచిమంచి తిమ్మకవి రచించిన సర్వలక్షణసార సంగ్రహములోను ముద్రితప్రతుల లోనే వచనములందు వ్యావహారిక భాషా రూపములు కొన్ని కనబడినవి. అప్పకవిన్నీ తిమ్మకవిన్నీ తెలివిడి మొదలయిన వచన భాగము పూర్తిగా వ్యావహారిక భాషలోనే వ్రాసి ఉంటారనన్నీ, అచ్చు వేసినప్పుడు పండితులు పరిష్కరించి ఆ రూపాలు గ్రాంథిక భాషలోకి మార్చివేసి ఉంటారనిన్నీ, అప్పటికీ కొన్ని రూపాలు వారి దృష్టిపథంలో పడక నిలిచి పోయి ఉంటవనిన్నీ మేము ఊహించి విశాఖపట్టణములో పరవస్తువారి ఆంధ్ర పుస్తకాలయమునకు వెళ్లి అప్పకవీయము తాళపత్ర ప్రతి చూడగా మా ఊహ సరియైన దని తోచినది. ఆ తర్వాత మరియొక తాళపత్ర ప్రతి కూడా మాకు దొరికినది. అందులో కూడా మే మనుకొన్నట్లే ఉన్నది. సర్వలక్షణ సారసంగ్రహము వ్రాతప్రతి మాత్రము మా కెక్కడా దొరకలేదు. ఆ తర్వాత మరి కొద్దికాలమునకే నేను పర్లాకిమిడి నుండి చెన్నపట్టము రావలసిన పని యుండెను. అప్పుడు మా తండ్రిగారు నేను చెన్నపట్టణము చేరిన వెంటనే అవకాశము చూచుకొని ఆ రోజులలో మ్యూజియమ్ భవనములం దుండిన ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీకి వెళ్ళి అక్కడ ఉండిన అప్పకవీయ సర్వలక్షణ సారసంగ్రహ తాళపత్ర గ్రంథప్రతు లన్ని తిరగవేసి వచనములు ఎట్లున్నవో పరిశీలించి రావలసిన దని ఆదేశించారు. వారి ఆదేశం ప్రకారం నేను చెన్నపట్టణం చేరుకున్నాడే మధ్యాహ్నం 12 గంటలకు వెళ్లాను. అక్కడ ఒక గదిలో ప్రభాకర శాస్త్రిగారున్నూ, పురాణం సూర్యనారాయణ తీర్థులు గారున్నూ ఒక మేజాకు చెరియొక వైపున కూర్చుండి ప్రసంగించు కొంటున్నారు. వారిద్దరిలో ఎవరినీ నే నెరుగను. పేరు విన్నానే కాని ఎవరితోను నాకు పరిచయం లేదు. ఆ రోజులలో నేను పంట్లాం, కోటు, చెప్పూ ధరించి యౌవనప్రకృతితో చాలాక్ గా నడుస్తూ ఉండేవాణ్ని. నే నెవరో వారికీ తెలియదు. 'ఎవరా?' అని కొంత వింతగా చూచి 'ఏమి కావాలి?' అన్నారు శాస్త్రి గారు. 'అప్పకవీయము, కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణ సారసంగ్రహము వ్రాత ప్రతు లెన్ని ఉంటే అన్నీ కావాలి, అన్నాను' 'సర్వలక్షణ సార సంగ్రహ ప్రతు లేవీ లేవు. అప్పకవీయము ప్రతులు మాత్రము ఉన్నవి. అక్కట ఆ మేజావద్ద కూర్చోండి. పంపిస్తాను' అన్నారు శాస్త్రిగారు. మూడు ప్రతులు కాబోలు ఒక బంట్రోతు తెచ్చి మేజాపై ఉంచాడు. అందులో ఒకటి విప్పి చూస్తున్నాను. కొంత సేపయిన తర్వాత శాస్త్రిగారు నావద్దకు వచ్చి 'మీ రే విషయం పరిశీలిస్తున్నారు?' అని అడిగారు. వినీత వేషంలో నా రొక గుమాస్తాగా కనబడడం చేత, వారి ప్రశ్న నాకు అధిక ప్రసంగంగా తోచి 'ఏదో నాకు కావలసిన విషయం పరిశీలిస్తున్నాను' అని వారివైపు చూడనైనా చూడక నా పనిలో నేను నిమగ్నుడనై యుండగా "క్షమించండి. మరేమీ లేదు. అది నాకు తెలిసినవిషయ మైతే మీకు తోడ్పడ వచ్చు నన్న ఉద్దేశంతో అడిగాను" అన్నారు శాస్త్రిగారు. వారి మాట నా దర్పానికి వాత పెట్టినట్లయింది. అప్పుడు నేను పరిశీలిస్తూ ఉన్న విషయ మేమో తెలియజేశాను. "అటువంటిదే అయి ఉంటుందని ఊహించాను. మీరు గిడుగు రామమూర్తి

పంతులుగారి కుమారులని పురాణం సూర్యనారాయణ తీర్థులుగారు ఇప్పుడే చెప్పారు. అందుకే మీ మేజావద్దకు వచ్చి అడిగాను'' అన్నారు. ''మీ పేరు?'' అన్నాను. ''నాపేరు వేటూరి ప్రభాకరశాస్త్రి'' అన్నారు. అప్పుడు చట్టున లేచి చేతులు జోడించి నమస్కరించి ''క్షమించండి. నేను మీగురించి మా తండ్రిగారు చెప్పగా విన్నానే కాని మీ పరిచయం లేకపోవడంచేత మిమ్ములిని నేను గుర్తించలేదు. పురాణం సూర్యనారాయణశాస్త్రిగారిని గురించి కూడా వినడమే కాని వారి పరిచయమైనా లేదు. నన్ను వారేలాగు గుర్తించారో నాకు తెలియదు'' అన్నాను. అంతలో తీర్థులుగారున్ను నా మేజావద్దకు వచ్చి ''మొన్న నీమధ్య మీరు చోడవరములో ఒకసభలో వ్యావహారిక భాషావాదమునుగూర్చి ఉపన్యసిస్తూ ఉండగా చూచాను.'' అన్నారు. అప్పుడు శాస్త్రిగారు మరి రెండు కుర్చీలు తెప్పించి నా మేజావద్ద వేయించారు. ముగ్గురం కూర్చుండి ప్రసంగించుకొన్నాము. ''మీరు మరి పరిశీలించి చూడనక్కర లేదు. నే నిదివరకు పరిశీలించి తెలిసికొన్నవిషయమే ఇది. వచనాలన్నీ వాడుక భాషలోనే ఉన్నవి. అన్ని ప్రతులలోను అలాగే ఉన్నవి. ఈ గ్రంథమందే కాదు. టీకలు, వ్యాఖ్యానాలు, తెలివిడులు అన్నీ వాడుక భాషలోనే వ్రాశారు కవులు, పండితులు, అందరున్ను'' అన్నారు ప్రభాకరశాస్త్రిగారు. ''అయినా, మా తండ్రిగారి ఆజ్ఞ కనుక నేను కొన్ని మచ్చుతునకలు వ్రాసుకొని వెళ్తాను'' అన్నాను. ''సరే మంచిది. ఈ మూడు ప్రతులలోను గల మచ్చుతునకలు ఎంచి పెడతాను. ఆ గుమాస్తాచేతను వ్రాయిస్తాను. మీ కెందుకీ శ్రమ'' అని వ్రాయించి పెట్టారు శాస్త్రిగారు. ఆ సమయంలో వ్యావహారిక భాషాప్రయోజనం గురించి కొంత చర్చ జరిగింది. తీర్థులుగారు మా వాదాన్ని నిరసించడానికి కొద్దిగా ప్రయత్నించారు. నేను సమర్థిస్తూ మాటలాడాను. శాస్త్రిగారు నాకు తోడ్పడుతూ ప్రసంగించారు. ''ఏదో ఇటువంటి అర్థవివరణాలకు, లేఖలకు బాధ లేదు గాని కావ్యరచనకు పనికిరాదు వాడుకభాష'' అన్నారు తీర్థులుగారు.

ఈ విధముగా ప్రసంగములు సాయంకాలము 5 గంటలవరకును జరిగినవి. గుమాస్తా మచ్చుతునకలు వ్రాసి యిచ్చాడు. ముగ్గురమున్ను కాలినడకను మౌంట్‌రోడ్డు వరకున్ను నడిచినాము. శాస్త్రిగారు నన్ను, తీర్థులుగారిని ఒక కాఫీహోటలుకు తీసికొనిపోయి ఫలహారము, కాఫీ ఇప్పించారు. తర్వాత ఎవరి బసకు వారుగా చెదిరిపోయినాము. ఆ సమయంలోనే గురుజాడ అప్పారావుగారి ప్రసక్తి వచ్చినది. అప్పారావుగారు ఆ రోజులలో చెన్నపట్టణమునకు తరుచుగా వస్తూ ఉండడము, విజయనగరము మహారాజావారితో గాని, వారి తాలూకువారితో గాని వచ్చినప్పుడు అడ్మిరాలిటీ హౌసులోను, ఒక్కరే వస్తే డియాంజిలీసు హోటెల్‌లో (బుసాటో ఉండిన భవనములో)ను బస చేస్తూ ఉండేవారు. ఆ క్రిందటిదినమే శాస్త్రిగారికి వారివద్దనుండి లేఖ వచ్చినదట. ''చెన్నపట్టణము వస్తున్నాను. నన్ను కలియవలసినది'' అని వ్రాసినారట. అందుచేతను ఆ డియాంజిలీసుకు వెళ్లి అడిగాము. రాలేదని తెలిసింది. అప్పారావుగారి యెడల శాస్త్రిగారికి ఆదరాభిమానాలు ఎక్కువగా ఉండినట్లు వారి ప్రసంగంవల్ల నేను తెలుసుకోగలిగాను.

మరి నాలుగు దినములు గడచిన తర్వాత నేను పర్లాకిమిడి చేరుకొని మా తండ్రిగారికి జరిగినదంతా తెలియజేశాను. ప్రభాకర శాస్త్రిగారి పరిచయం అప్పటికి మా తండ్రిగారికిన్ని అట్టే ఎక్కువగా లేదనిన్ని అప్పారావుగారి ద్వారానే ప్రభాకర శాస్త్రిగారి ప్రతిభ తెలిసికొన్నామనిన్ని మా తండ్రిగారు చెప్పారు. వ్యావహారిక భాషావాదములో శాస్త్రిగారి తోడ్పాటు మాకు పూర్తిగా ఉండేది. తెలుగు సాహిత్యములో వాడుకభాషకు తగినస్థానము కలదనిన్ని, తెలుగు జీవద్భాష కనుక మారుతూ ఉండక తప్పదనిన్ని, లోకవ్యవహారమునుబట్టి కవిప్రయోగాలు మారుతూ వచ్చినవనిన్ని, ఆ ప్రయోగాలను పరిశీలిస్తూ వ్యాకరణసూత్రాలు రచితములవుతూ ఉండవలెననిన్ని శాస్త్రిగారు స్పష్టముగా తెలియజేస్తూ ఉండేవారు. వచనరచనలలో వ్యావహారికభాష ప్రయోగించడము సంప్రదాయసిద్ధమై ఉండేదని శాస్త్రిగారు వ్రాసిన లేఖ మా తండ్రిగారు తమ తెలుగు

పత్రిక మొదటి సంచికలో ప్రకటించారు.[1] ఆ పిమ్మట మా తండ్రిగారికిన్ని శాస్త్రి గారికిన్ని పరిచయం, మైత్రి అంతకంతకు ఎక్కువయినవి. ఇద్దరున్ను నిగ్గయిన పాండిత్యముకోసము శ్రద్ధ వహించి కృషి చేసినవారు. ఇద్దరికిన్ని తెలుగు భాషాపదముల వ్యుత్పత్తి

---

1. 'వాడుక భాషలో గ్రంథాలు వందలు వంద లున్నవి. అచ్చు వచ్చినతర్వాతనే యీ అన్యాయం. పూర్వాపరాలు లేకుండా బూజు పట్టిస్తున్నారు... .........

వ్యాఖ్యానాలకు వాడుకభాష తప్ప వేరే భాష లేనే లేదు. తాళ్లపాక తిరువేంగళనాథుడు అమరవ్యాఖ్య వాడుకభాషలో వ్రాసినాడు. కృష్ణరాయల నాటివాడు సర్వలక్షణ సారసంగ్రహకర్త చిత్రకవి పెద్దన్న కొడుకు అనంత కవి హరిశ్చంద్రనలోపాఖ్యాన వ్యాఖ్యానం వాడుకభాషలో వ్రాసినాడు. అచ్చులో పూండ్లవారు అర్ధాన్నం చేసినారు. రాఘవపాండవీయవ్యాఖ్య, ఆముక్త మాల్యదవ్యాఖ్య, మూడు వసుచరిత్రల వ్యాఖ్యలు, పంచతంత్ర వ్యాఖ్య, చాటుపద్య వ్యాఖ్య, బృహజ్జాతక వ్యాఖ్య, సోమనాథ భాష్య వివరణము, ఆంధ్ర శబ్దచింతామణి వ్యాఖ్య (అచ్చులో అన్యాయం చేసినారు. బాలసరస్వతి పేరు పెరికివేసినారు. భాషా పాడు చేసినారు.) తెలుగు వ్యాఖ్యానా లన్నీ అదేమిటి ఇదేమిటి, సర్వం వాడుకభాషలోనే ఉన్నవి.

ప్రాచీనవచనగ్రంథాలు వందలు వందలు పరిశీలింపగా, కావ్యభాషవి వేళ్ళ లెక్కకైనా రాలేదు. అన్నీ వాడుకభాషలోనే వున్నవి. రామాయణాలు, భాగవతాలు, కథలు అన్నీని. ఎరిగి అంటారో, యెరగక అంటారో, కొందరు భాష రానివారు వ్రాసినారని. ఘనపగిరి తిమ్మన్న వ్యాకరణం రానివాడా? సమీరకుమారవిజయం చదవమనండి. అతడు భాగవత సారం అని తేటతెలువంటి వాడుకభాషలో గ్రంథం రచించినాడు. ఏమంటారో? వ్యాఖ్యానాలు, లక్షణగ్రంథాలు రచించినవారు భాష రానివారా?

లక్షణగ్రంథాలలో వచనభాగ మంతా వాడుకభాషే. అనంతుని ఛందస్సు, కవిలోక చింతామణి, రంగరాట్ఛందస్సు, సర్వలక్షణసార సంగ్రహము, లక్షణదీపిక వగైరాలు - అందులో చిత్రం, లక్షణదీపికలో పాటలు, పదాలు, షట్పదులు, ధవళాలు, అర్ధచంద్రికలు వగైరాలు మధుర కవిత అన్నాడు. ఇవన్నీ వాడుక భాషవే. మృదుమధురచిత్ర విస్తరము లని దేశికవిత చతుర్విధము. శ్రీనాథుడు శృంగారనైషధంలో వీటిని తడవినాడు. పెద్దనాదులు తడవినారు. శ్రీనాథుడు మాతంగి కథ, కాటంరాజు కథ వగైరాలు వాడుకభాషలో రచించినాడు. కుసలాయకం చదవండి. మొదట గ్రంథకర్త యేమి చెప్పినాడో? బ్రౌనుదొరగారు పండితులచేత వ్రాయించిన వ్యాఖ్యానము లన్నీ వాడుక భాషే. పది పన్నెండు వ్యాఖ్య లున్నవి. పట్టాభిరామశాస్త్రి యనే ప్రెసిడెన్సి కాలేజి పండితుడు అప్పుడు ఆంధ్ర ధాతుపాఠము రచించినాడు. వాడుక భాషనుండి చాలా మాటలు చేర్చుకొన్నాడు. వాడుకభాషలోనే కూర్పు. పండితుడు వఠెం వాసుదేవ పరబ్రహ్మశాస్త్రులు, జూలూరి అప్పయ్య పండితుడు, గురుమూర్తి శాస్త్రులు మొదలగు గొప్ప పండితులు బ్రౌను దొరగారికీ విద్యావిషయమై వ్రాసిన ఉత్తరము లున్నవి. అన్నీ వాడుకభాషే. బ్రౌను పల్నాటి వీరచరిత్ర వాడుక భాషలో రచియించినాడు. ఆంధ్రభారతం విషయక్రమంగా వాడుక భాషలో వ్రాయించినాడు. అయిదారు వాల్యూము లున్నవి. వందలు వందలు వ్రయం చేసి మరీ వ్రాయించినాడు. పేర్లు పేర్కొనవడ మెందుకు? చిన్నయసూరిగారివరకూ వుండే వచనగ్రంథాలలో యేవో కొద్ది సంఖ్యవి తప్ప అన్నీ వాడుక భాషవే. యక్షగానాలభాష చాలావరకు వాడుకభాషే. గొప్ప గొప్ప కవులు వ్రాసినవి ఉన్నవి. యక్షగానాలు నిన్న మొన్న పుట్టినవి గావు. బహుకాలంనుంచీ వున్నవి. సంస్కృతకవులే వాటికి లక్షణాలు చెప్పినారు.' [తెలుగు పత్రిక. సంపుటము 1. సంచిక 1. 1919 సం. సెప్టెంబరు నెల]

తెలుసుకొనుటలో గల ఉత్సాహము, సమగ్రత ఎక్కువగా ఉండేవి. తమ పరిశీలనవలన తాము తెలిసికొన్న విషయమును నిలబెట్టుకొనుటలో గల పట్టుదలకూడా ఇద్దరికీ సమానముగానే ఉండేది. ఏదైనా ఒక ప్రయోగంగురించి కాని వ్యాకరణవిషయంగురించి కాని, వారు వాదించుకొంటూ ఉంటే ప్రక్కనున్నవారికి ముచ్చటగానే ఉండేది. 'శాసనములందలి ప్రయోగాలు ప్రమాణంగా మా తండ్రిగారు చూపించినప్పుడు అది తమ కిష్టము కానియెడల శాసనము చెక్కినవాడు చేసిన తప్పు లని శాస్త్రిగారన్నప్పుడు "తాళపత్ర గ్రంథాలలోని ప్రయోగములు ప్రమాణంగా మీరు చూపించినప్పుడు అవి లేఖక ప్రమాదములు అని అంటే మీ ప్రామాణ్యమేమయినట్టు? లేఖక ప్రమాదములు వ్రాత ప్రతులలోను ఉండవచ్చును, శాసనాలలోను ఉండవచ్చును. అవి లేఖక ప్రమాదములో వాస్తవమయిన ప్రయోగాలో ఇతర ప్రమాణములనుబట్టి నిర్ణయించాలి" అని మా తండ్రిగారు వాదించేవారు. ఒకరి అభిప్రాయమును ఒకరు ఖండించుకొన్నప్పుడు వాదం తీవ్రంగానే చెలరేగేది. మా తండ్రిగారి గొంతు పెద్దది. ఎదిరి వాదం సబబుగా కనబడకపోతే పెద్ద కేకలు వేసి వాదులాడేవారు మా తండ్రిగారు. "ఏమో మరి నాకీ ప్రయోగం దుష్టంగానే కనబడుతున్నది. నిశ్చాయికమైన యతిప్రాస స్థలములలో కనబడిన దాకా నేను సాధువుగా గ్రహించలేను" అని పెదవి విరిచేవారు శాస్త్రిగారు. పట్టుదల విషయములో ఇద్దరు సమాన తీవ్రత గలవారే అయినా చర్చ ముగిసినవెంటనే మా తండ్రిగారికి ఆ కోపం, ఆ ఆవేశం పట్టున మాయమై పోయేవి. గృహకృత్యాది విషయములు ప్రసగించినప్పుడు తమ హృదయం నవనీతంలా గయిపోయేది మా తండ్రిగారికి. శాస్త్రిగారు మాత్రము తమ వాదం ఇతరులు ఖండించినప్పుడు కొన్నాళ్లు చాలా బాధపడేవారు. తమకు వాస్తవమని తోచిన దేదో మొగమోటమి ఏమీ లేకుండా ఎదిరివారు నొచ్చుకొంటారేమో అనే ఆలోచన లేకుండా ఘాటుగా వ్రాయడంలో ఇద్దరూ ఒక్కలాంటివారే. ఎదిరివారు తమ అభిప్రాయమును విమర్శించినప్పుడు, మా తండ్రిగారికంటె శాస్త్రిగారు ఎక్కువ బాధపడేవారు. ఒకరి పాండిత్యము యెడల ఒకరికి ఎక్కువగా ఆదరాభిమానా లుండేవి. సరసనలో గూడా శాస్త్రిగారియెడల మా తండ్రిగారికి గల గౌరవము ఎక్కువగా కనబడేది. ఏదైనా ఒక పొరపాటు శాస్త్రిగారు వ్రాసిన వ్యాసంలో కనబడితే, "ప్రభాకర శాస్త్రిగారివంటి పండితులు ఈ తప్పు చేస్తే తక్కినపండితులమాట చెప్పే దేమిటి?" అనేవారు మా తండ్రిగారు. "ఈ విషయము మీ తండ్రిగారికి నచ్చజెప్పలేకపోయినాను గదా? ఏం చేసేది?" అనేవారు శాస్త్రిగారు. కొన్ని శబ్దాలకు వ్యుత్పత్తి తెలియజేస్తూ శాస్త్రిగారు ఒక వ్యాసము త్రిలింగలో కాపాలు ప్రకటించినప్పుడు మా తండ్రిగారికి సంతోషము ఎక్కువగా కలిగి నన్ను చదువుమన్నారు. ఆ మరునాడే శాస్త్రిగారి పేర, తమ సంతోషము తెలియజేస్తూ లేఖ కూడా వ్రాశారు. ఒకసారి, చెన్నపట్టణం నుండి మా తండ్రిగారు శాస్త్రిగారు రచించిన మూన్నాళ్ళముచ్చట అనే చిన్న కావ్యము ప్రతి ఒకటి తెచ్చి చదువు మని నా చేతి కిచ్చి శాస్త్రిగారి కవితాచాతురి, భావ, రచన మెచ్చుకొంటూ ప్రసంగించారు. రెంటాల సుబ్బారావు గారు శాస్త్రిగారి కిచ్చిన ఒక చిత్రమునుబట్టి శాస్త్రిగారు కల్పించి రచించిన కావ్య మని తెలియజేశారు. అదే కాక శాస్త్రిగారు రచించిన తక్కిన చిన్న కావ్యాలుకూడా మెచ్చుకొనేవారు.

మా తండ్రిగారు చెన్నపట్టణం వచ్చినప్పుడెల్లా ఇద్దరున్ను గంటలకొలది భాషావిషయములు చర్చించుకునేవారు. కట్టకడపటిసారిచర్చ శాస్త్రిగారు సంప్రతించిన బసవపురాణంలో శాస్త్రిగారిచ్చిన పాఠాల గురించిన్ని శాస్త్రిగారు రచించిన ఉపోద్ఘాతము గురించిన్ని జరిగింది. అంతకు పూర్వము మా తండ్రిగారు ఆ గ్రంథం కడుశ్రద్ధతో చదివి తమకు తప్పులుగా తోచిన వన్ని గీట్లు పెట్టి అందులో ఎక్కువ తప్పుగా తోచిన చోట "అసందర్భం", "తప్పు తప్పు" అని కూడా వ్రాసి ఆ పొరట చినిగిపోయినంత గట్టిగా పెన్సిల్‌తో గీటు పెట్టారు. చెన్నపట్టణంలో ఆ గీట్లు గల పుస్తకమే పట్టుకొని శాస్త్రిగారితో ప్రసంగించారు. మా తండ్రిగారు తాము వ్రాసి పెట్టుకొన్న మాటలు ఎంత కప్పి ఉంచినా శాస్త్రిగారికి కొద్దిగా కనబడకపోలేదు.

చర్చ పూర్తియైన తర్వాత శాస్త్రిగారు తమ బసకు వెళ్ళడానికి సిద్ధపడి, మీ చేతిలో నున్న ఆ ప్రతి నాకొకసారి ఇస్తారా? రేపు గాని ఎల్లుండి గాని మరల అందజేస్తాను' అన్నారు శాస్త్రిగారు. 'తప్పకుండా ఇస్తాను. కాని, అందులో నేను నాకోసమని వ్రాసి పెట్టుకొన్న మాటలు చూచి మీరు బాధ పడ కూడదు. ఆవేశం కొద్దీ నేను తీవ్రమైన మాటలు అనడం గాని వ్రాయడం గాని నా ప్రకృతి. అది యొక దుర్గుణమే. అందుచేత చెప్తున్నాను. ఆ మాటలు ఆ విషయానికి పరిమితవి. అంతే కాని మీ యెడల నాకు గల గౌరవము తగ్గిపోదు' అని చెప్పి పుస్తకం ఇచ్చారు. మా తండ్రిగారు మరి రెండు దిన ములలో చెన్నపట్టణం విడిచి పర్లాకిమిడి చేరు కొన్నారు. శాస్త్రిగారు ఆ గ్రంథం మా తండ్రిగారు చెన్నపట్టణంలో ఉండగా అంద జేయలేదు. మరియొక పదిదినములు గడచిన తర్వాత ఆ గ్రంథం పంపిస్తూ నొచ్చుకో వద్దని మీ కెంత చెప్పినా మీరు వ్రాసిన మాటలవల్ల నా మనసు క్షోభించినది. అది నా దౌర్బల్యమే కావచ్చును' అని వ్రాశారు. ఆ లేఖ చదివి మా తండ్రిగారు కూడా చాల బాధపడ్డారు. ఇదిగాక మరియొక స్వల్ప విషయంకూడా కలత ఎక్కువ కావడానికి కారణమైనది. చెన్నపట్టణంలో ఉండగా మా తండ్రిగారు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిని చూడడం సంభవించింది. బసవపురాణం గురించి పంతులుగారు ప్రశ్నిం చారు. 'ప్రభాకరశాస్త్రిగారు సంప్రతించి ప్రకటించినది ఎట్లున్నది?' అని అడిగారు. 'బాగానే ఉన్నది గాని శాస్త్రిగారి వంటి వారు సరియైన పాఠాలు గుర్తించక పోయి నారు గదా అని విచారించాను. ప్రాచీన కావ్యభాష తెలిసినవారిలో వారిని మించిన వారు లేరని నాకు తెలుసును. మరి వారే పాఠాల విషయంలో తప్పులు చేస్తే నేనే మనేది?' అన్నారు. మరికొన్నాళ్లు పోయిన తర్వాత పంతులుగారు శాస్త్రిగారిని కలుసుకొని 'బసవపురాణం మీరు పాడు చేశారని రామ మూర్తి పంతులుగారు నాతో చెప్పారు' అని అన్నారట. అందుకు శాస్త్రిగారు చాలబాధపడి మరికొన్నాళ్ళకు నేను చెన్నపట్టణం వచ్చి వారిని కలుసుకొన్నప్పుడు నాగేశ్వరరావుగారు అన్నమాటలు శాస్త్రిగారు నాకు తెలియ జేశారు. నా మనసు చాలా కలత చెందినది. పర్లాకిమిడి చేరినవెంటనే ఈ విషయం మా తండ్రిగారికి తెలియజేశాను. పాపం! వారు కూడా చాలా నొచ్చుకొన్నారు. "బసవ పురాణం సంప్రతించడంలో శాస్త్రిగారు కనబరచిన వైదుష్యం కూడా నే నెంతో కొని యాడుతూ నాగేశ్వరరావు పంతులుగారికి తెలియజేశాను. ఆ విషయం వారు తెలియజేయ లేదు కాబోలు. అది తెలియజేయకుండా నే నెంచిన లోపముమాత్రమే తెలియజేశారు కాబోలు. అదీ గాక "పాడుచేశారు" అని నే ననలేదు. కొన్నిచోట్ల సరియైన పాఠాలు ఎంచలేదన్నాను" అని మా తండ్రిగారు చెప్పారు. మరికొన్నాళ్ళయిన తర్వాత నేను చెన్నపట్టణం వచ్చినప్పుడు శాస్త్రిగారిని కలుసు కొని జరిగినదంతా తెలియజేసి మా తండ్రిగారు చాలా నొచ్చుకొన్నారని చెప్పాను. కాని శాస్త్రిగారికి ఉపశాంతి పూర్తిగా కలుగలేదు. అప్పుడా విధంగా కలిగినకలత ఇద్దరి మనస్సుల లోను కొద్దిగానో గొప్పగానో ఉండిపోయిన దనే అనుకొంటాను.

నాయెడల మాత్రం శాస్త్రిగారికి చివర వరకూ ఆదరాభిమానా లుండేవి. నా భారతీ శతకమునకు శాస్త్రిగారు రచించిన ఉపో ద్ఘాతము అందుకు ప్రబలమైన నిదర్శనము. అదిగాక 1949 లో ఒక సమావేశము తిరు పతిలో ఏర్పరచి నాచేత నొక ఉపన్యాస మిప్పించి నన్ను గౌరవించారు. వారి యెడలను, వారి పాండిత్యపటిమయెడలను నాకు గల గౌరవము ఎక్కువగుతూ ఉండేనే కాని ఎన్నడును తగ్గలేదు. వారి ఆత్మ అఖండ ప్రశాంతిని పొందును గాక!

# జానపదసాహిత్యోద్ధారకుఁడు

శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు

* :—

"సాహిత్యము ఏకొద్దిమందికో కాదు-అన్ని వర్గాలవారికీ అనుభవింపదగి ఉండాలి" అని ఆంధ్రజాతిని మేల్కొలిపిన కొద్దిమందిలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ఒకరు; తొలినాళ్లలో ముఖ్యులూను. సాహిత్యం జానపదాలని విడిచి వర్ధిల్లలేదు. అందుచేత జానపదులను కూడగట్టుకొనే సాహిత్యసంపద వర్ధిల్లుతుంది. సాహిత్యం అందరికీ అందుబాటులో ఉండాలనడానికి కారణంకూడా అదే. జానపదుల నాలుకలపై తేలికగా తేలియాడే దేశిసారస్వత సంపదంతా అనుభవయోగ్య మనే శ్రీ శాస్త్రిగారి తలపు. మాయమర్మము తెలియని అమాయక జానపదుల చిత్తవృత్తులూ, తీరుతెన్నులూ ప్రదర్శిత మయ్యే ప్రజాసారస్వత మంతా జాతి జీవనానికి దర్పణాలనీ, జాతి సంస్కృతికి నికషోపాలనీ వారి విశ్వాసము. అందుకనే అటువంటి జానపద సాహిత్యాన్నంతా అవశ్యం ఆదరించి సేకరించుకోవాలనీ, ప్రకటించి నిక్షేపించుకోవాలనీ వారు చెప్పగలిగారు. చెప్పినట్లు చేయనూ కలిగారు.

స్త్రీ బాల పామరగానములు లోకవృత్తి ననుసరించి ఆయాసందర్భాలలో వాడుకొనేమాటలు, పాడుకొనే పాటలు ఈ సారస్వతానికి స్వరూపాలు. అందుచే పరిశీలన సౌకర్యార్థమై జానపద వాఙ్మయాన్ని బాలభాషనీ, స్త్రీల పాటలనీ, పామరభాషనీ విభజించుకోవచ్చును. ఈ గేయాలలోని సాహిత్యముకాని, వాటి ఫణితులు కాని, ఛందస్సంప్రదాయాలు కాని మన భాషలో, సంస్కృత భాషావ్యామోహంవలన సాహిత్యతనంది నిలిచియుండకపోయినా సోదర భాషలైన ద్రవిడకర్ణాటాది భాషలలో అవి అన్నీ ఉత్తమ సాహిత్య పద్ధతులుగానే కొనియాడబడుతున్నవి. ద్రావిడభాషల సమన్వయ పరిశీలన సమగ్రముగా జరిగినప్పుడు ఈ విషయము తేటతెల్లమవుతుంది. స్త్రీ బాలపామర గేయాల ఫణితులు మాత్రమే కాక వాని మాతృరూపము లనదగిన మంజరి, ఏకపద, ద్విపద మొదలు సప్తపదుల వఱకుగల ఫణితులన్నీ మనదేశి సారస్వతాని కలంకారములే. మన జానపద వాఙ్మయము కొంతవఱకైనా యీ దశలోనే సాహిత్యత నందుకొన్న దని చెప్పవలసి ఉన్నది. ఇవికాక మనభాషలో వచనమాలికా గీతాలనీ, సంకీర్తన లనీ మరి ఒకటిరెండు పద్ధతులు కూడా వెలసియున్నవి. ఇట్లా మన జానపద వాఙ్మయ స్వరూపము పసిపిల్లల తొక్కుపలుకుల పాటలనుండీ సంగీత సాహిత్యములు పండబారిన సంకీర్తనల వఱకూ స్మరింపదగియున్న దనవచ్చును. ఈ క్రమాన్ని చూచుకొన్నప్పుడు శ్రీ శాస్త్రిగారి జానపద వాఙ్మయసేవ పై అన్నితరగతులలోనూ ఉన్న దని చెప్పవలసి ఉంటుంది. బాలభాష కథ నుండీ సంకీర్తన వాఙ్మయమువఱకు వారి విమర్శకందని విషయమే లేదు. బాలభాషని మొదట సేకరించి సచిత్రకంగా భారతి సంచికలలో ప్రకటించింది వీరే. బాలభాష పసిపిల్లల వినోద విజ్ఞానాలకు సహకరిస్తుంది.

## బాలభాష

అసలు పసుపిల్లలే యిండ్లకు శోభ. వారు సంసార సౌఖ్యమునకు, సౌభాగ్యమునకు మూలకందములు. పిల్లలు లేనిదే యింట కాలక్షేప ముండదు. పసుపిల్లల-బొద్దూడిన దాది బోరగిల పడేవఱకు, తదాదితప్పటడుగులు వేసేవఱకు వారి చేష్టలన్నీ మన కానందదాయకములే. పిల్లలు పరబ్రహ్మస్వరూపములు. బాల్యమే అటువంటిది. తాను మురిసిపోతూ యితరులను మురిపించేది. అందుచేతనే ఎల్లన్నను భగవంతుడు అంతగా మురిపించాడు. ఈ పిల్లలకు ఉంగ పట్టినప్పటి నుండీ విఘ్నము చేయించేవఱకూ ఎన్నెన్ని దశలు! దశ కొక్కొక్క పాట చొప్పున కనీసం బాల భాష వర్ధిల్లింది. ఇది చూడండి.

ఊఁ ఊఁ ఉంగన్న
ఉగ్గుపాలు ఇందన్న
గుంటెడు ఉగ్గు కమ్మన్న
ఉమ్మక కక్కక మింగన్న
ఊఁ ఉఁ ఉఁ ఉంగన్న
లంగలు పెట్టకు గుక్కన్న
ఓర్వని సవతుల దిష్టన్న
ఒప్పుగ మసలర బుచ్చన్న—

తల్లి పిల్లవానికి ఉంగపట్టేటప్పుడు పాడుతుందీ పాట. వాళ్ల ఉచ్చారణతోనే నెమ్మదిగా వాళ్ల దృష్టి నాకర్షించి ఉగ్గుపట్టడానికిది వీలు.

పిల్లవాడు మెడ నిలుపగలిగే సరికి తల్లి పాలుపట్టిన తర్వాత ఒడిలో చేతికి వీపాన్చి కూర్చోబెట్టుకొని ముందు వెనుకల కూగిస్తూ

ఏను గొచ్చిం దేనుగూ
ఏవూరొచ్చిం దేనుగూ
మావూరొచ్చిం దేనుగూ
మంచినీళ్లు తాగిం దేనుగూ —

అని పాడుతుంది. పాట వినోదానికే ఆ ఊగింపులో పసివాని శరీరానికి పరిశ్రమ కలుగుతుంది. త్రేన్పు వచ్చి పాలు ఒంటికి పడతవి. ఇటువంటి ప్రయోజనం కలదే

చిట్టీ తలనొచ్చె నే
చిట్టమ్మా తలనొచ్చె నే
దాదీ తలనొచ్చె నే
దాదమ్మా తలనొచ్చె నే..

పాటకూడా! పిల్లవాడు లేచి నెమ్మదిగా నిలువగలిగేసరికి తల్లి మెల్లిగా వాణ్ని పట్టుకు నుంచోబెట్టి

విద్దెం చేస్తే గిద్దెడు నెయ్
మల్లా చేస్తే మానెడు నెయ్ —

అని పాడుతూ ఆడిస్తుంది. వాడెట్లా నిలవాలో—ఎలా నడవాలో నెమ్మదిగా నేర్పుతుంది. నెయ్యి ఒంటికి పట్టుకూడా! అది నేర్చేక పిల్లవాడు తనకు తానై లేచి నడువగలిగేసరికి వాడి వినోదానికి ఎన్నెన్నో ఆటలు – పాటలు!

పాదాలూ చేతులూ ఒకదానిపై ఒకటి పేర్చి చేతుల మధ్య తన వ్రేలేసి త్రిప్పుతూ

[1]గుడుగుడు గుంచం
గుండే రాగం
పాదనపట్టం పట్టికే రాగం
అప్పడాల గుర్రం ఆటకి పోతే
పేపేగుఱ్ఱం పెళ్ళికి పోతే
కత్తా? బద్దా?

అని పిల్లవాణ్ని తల్లి ఆడిస్తుంది. లేదా కాళ్లు బాగా చాపించి—

[2]కాళ్లా గజ్జి కంకాళమ్మా
వేగూచుక్కా వెలగా మొగ్గ
మొగ్గా కాదు మోదుగనీరు
నీరూ కాదూ నిమ్మలవావి
వావి కాదూ వావింటకూర
కూరా కాదూ గుమ్మడిపండు
పండూ కాదూ పాపాయికాలు
కాలూ తీసీ కడగా పెట్టు

అని ఆడిస్తుంది. ఇట్లాటివే ఎన్నో ఆటలు, పాటలు. ఇక తర్వాత నెమ్మదిగా పాలు తప్పించి పునఃపాకం చేసిన గుజ్జెనగూళ్లు తినిపిస్తారు పిల్లవాడికి. అది అలవాటు పడడానికి-విన్నతర్వాత జీర్ణించుకోడానికి మరికొన్ని ఆటలు పాటలు ఉన్నవి.

పప్పెట్టి పాయసం పెట్టి
నెయ్యేసి బువ్వెట్టి
ఆం తినిపించి ఆం తినిపించి
చెయ్యి కడిగి మూతి కడిగి
మా అత్తాగింటికి దారేదంటే
యిలా పోయి యిలా పోయి
కితకిత కితకితా.

అని గిలిగింతలు పెట్టి పిల్లవాణ్ని నవ్విస్తుంది తల్లి. ఈ పాటలో తమాషా చూడండి. గుజ్జెనగూళ్లు తినడం పాపను నేర్పడం – తిన్నాక వాణ్ని నవ్వించడానికి కితకితలు; పసిపిల్లలు ఎంత నవ్వితే అంత ఆరోగ్యం!

కాని కొన్ని సమయాల్లో పిల్లవాడు అన్నం తినడానికి ఒల్లడు. మారాం పడతాడు. అప్పుడు 'నిర్భర కరుణాధురీణయగు ప్రాణము' ఆ తల్లి వాణ్ని చంక నెత్తుకొని వెండిగిన్నెలో బువ్వ కలిపి లాలిస్తూ, బుజ్జగిస్తూ, ఆరు బయటికి తీసుకెళ్ళి, ఆకాశం కేసి చూపిస్తూ, నీలినింగిలో తేలిపోతున్న చందమామను దాయి దాయని పిలుస్తూ, పాపాయిని తినిపించి బొమ్మని చెబుతుంది. ఆ సన్నివేశం అలాంటిది కాబోలు. పిల్లవాడు గుటక్ చప్పుడు కాకుండా తిని ఊరుకొంటాడు. బువ్వ పెట్టినాక జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం అని నెమ్మదిగా లాలించి పడుకోబెట్టి

1. గుంచం = గుండం (?) గుండేరు+ఆగం, పటికేరు+ఆగం (పటికేరు అంటే పాలేరు (?) తెలుపు అన్న అర్థంలో.

2. ఈపాటకి వైద్యసంబంధమైన అర్థం ఉన్న దంటారు. పిల్లవాళ్లకు వచ్చే గజ్జికి యిందు మందు చెప్పబడ్డ దని!

జో వచ్యుతానంద జోజో ముకుందా
రావె పరమానంద రామగోవిందా-జో జో-

అన్న లాలిపాటనో

రామా లాలీ మేఘశ్యామా లాలీ
తామరసనయనా దశరథతనయా లాలీ.

అన్న లాలిపాటనో పాడుతుంది. ఆ లాలి పాటలోని ప్లుత స్వరాలూ, అనుప్రాసలూ, రాగం అన్నీ ఒకటిగా కూడి పిల్లవాణ్ని బుజ్జగించి నిద్ర పుచ్చుతవి.

వయసు రాగా పిల్లవానికి లోకజ్ఞానం కలుగుతుంది. మాటలు వస్తవి. చెప్పదలచుకొన్నది చెప్పకలుగుతాడు. ఆ పైన అక్షరాభ్యాసం-బడి-చదువు. ఆ వేళలో పిల్లవానికి వినోదంతోపాటు విజ్ఞానం కల్పించాలి. సద్వర్తన నేర్పాలి. ధారణ అలవరచాలి. సామాన్యంగా బాలబాలికల ఆటపాటలు, కథావినోదాలు పై ప్రయోజనాలనే సాధించేవిగా ఉంటవి. ఇవి చూడండి.

కట్టెలు తేరా[1] శివ్వా-నా
కాళ్లు నొస్తుందవ్వా
బట్ట లుతకరా శివ్వా-నా
ప్రాణం పోతుం దవ్వా
అన్నం తినరా శివ్వా-నే
నందుకు సిద్ధం అవ్వా-

ఈ పాటలో పిల్లలకి కావలసిన హాస్యం-వినోదం ఉన్నవి.

కంచికి పోతావా కృష్ణమ్మా-ఆ
కంచివార్త లేమి కృష్ణమ్మా
కంచిలో ఉన్నాది అవ్వా-ఆ
అవ్వా నాకు పెట్టు బువ్వా
బువ్వా ఉన్నది గాని కృష్ణమ్మా-నీకు
పప్పూ ఎక్కడి దోయి కృష్ణమ్మా
ఆ యింటి యీయింటి అప్పా-ఆ
అప్పా నాకు పెట్టు పప్పూ
పప్పూ ఉన్నది గాని కృష్ణమ్మా నీకు
నెయ్యి ఎక్కడి దోయి కృష్ణమ్మా
కోమటి అక్కప్ప చెయ్యి-ఆ
చెయ్యి నాకు పోయి నెయ్యి
నెయ్యి ఉన్నది గాని కృష్ణమ్మా-నీకు
పెరుగు ఎక్కడి దోయి కృష్ణమ్మా

ఆ యింటి యీ యింటి పొరుగూ
ఆ పొరుగు నాకు పోయి పెరుగూ—

ఈ పాటలో యిరుగు పొరుగులతో సంబంధం ఎలా ఉండాలో - దాన్ని బట్టి మన జీవితం చల్లగా ఏవోటన్నైనా ఎలా గడుపుకోవచ్చో తెలియవస్తుంది.

ఉత్తముని పేరేమి ఊరేమి - నీ
సత్యపురుషుని కన్నసాధ్వి పేరేమి
ఉత్తముడు దశరథుడు ఊరు అయోధ్య
సత్యపురుషుని కన్న సాధ్వి కౌసల్య—

అన్న యీ పాటలో ఆదర్శమూర్తి శ్రీరాముని కథ వస్తుంది. పిల్లవాళ్లు ఆయనవంటి వర్తన నేర్చుకోవాలని ఆశయం. ఇక పిల్లవాళ్లకి భక్తి శ్రద్ధలు నేర్పే గేయాలూ ఉన్నవి.

వానలు కురిసే టెందుకురా
పంటలు పండే టందుకురా
పంటలు పండే టెందుకురా
ప్రజలూ బ్రదికే టందుకురా
ప్రజలూ బ్రదికే టెందుకురా
దేవుని కొలిచే టందుకురా
దేవుని కొలిచే టెందుకురా
ముక్తిని పొందే టందుకురా —

అన్న పాట అటువంటిదే! పోతే 'అనగా అనగా ఓ రాజు. ఆ రాజుకి ఏడుగురు కొడుకులు' అని సామాన్యంగా చెప్పుకొనే కథ చూడండి. కథాక్రమంలో క్రమోన్మీలన మెలా జరిగిందో. అట్లాంటి కథలే 'చీమ చిటుక్కు' 'ఈగ తన పేరు మరవడం' మొదలైన కథలు కూడా. వీని ప్రయోజనం పిల్లవాళ్ళకు ధారణ అలవరచడమే.

ఆడపిల్లలు ఇద్దరు ఎదురు బదురుగా నిలుచుండి చేతులు బేడిసెలు వేసి తిరుగుతూ

ఒప్పులకుప్ప ఒయ్యారిభామా
చాయపప్పు సన్నబియ్యం
గూట్లో రూపాయ్ నీ మొగడు సిపాయ్

అని పాడుకొంటారు. ఇది ఒక క్రీడ. దీనినే కాబోలు హంసవింశతికారుడు 'బేడిసె తిరుగుట్లు' అన్నాడు. మరొక పాట. ఆడపిల్లలు ఇద్దరేసి చేరి చిటికలు వేస్తూ అడుగులు తొక్కుతూ, చప్పట్లు చరుస్తూ ఎంతో కట్టుదిట్టంగా

1. శివ్వా అని పశ్చిమప్రాంతం వాడుక.

[1] చెమ్మచెక్క చేరడేసి మొగ్గ
అట్లు పోయంగా ఆరగించంగా
ముత్యాల చెమ్మచెక్క ముగ్గు లెట్టంగా
రత్నాల చెమ్మచెక్క రంగు లేయంగా

అని పాడుకొంటూ ఆడుకొంటారు. ఇట్లాటివే బాలబాలికల క్రీడావిశేషాలు, ఆటపాటలూ ఎన్నో సేకరించి శ్రీ శాస్త్రిగారు తొలుత భారతి సంచికలలో ప్రకటించారు. ఈ బాల భాషనిగూర్చి చక్కని విమర్శనాత్మకమైన వ్యాసం మద్రాసు హైకోర్టు జస్టిసు పి. వి. రాజమన్నారు గారి సంపాదకత్వం క్రింద ఆనాళ్లలో వస్తుండిన 'కళ' అనే పత్రికలో ప్రకటించారు. ఇవేవి గాని పుస్తకరూపంలో పునః ముద్రింపలేదు. సంకల్పం మాత్రం ఉన్నది. కాని యిటీవల నవ్వులు-పువ్వులు, ఆటలు-పాటలు అని కొన్ని యిటువంటి సంగ్రహాలని పుస్తకాలుగా ప్రకటిస్తూనూ వచ్చారు. ఇది బాలవాఙ్మయ విషయసంగ్రహం.

## సతీసాహిత్యం

పిల్లల తర్వాత తల్లులే యిండ్లకు శోభ. ఇంటి కాపు యిల్లాలు, గృహలక్ష్మి, భర్త నయనాలకు అమృతవర్తి. అట్టిది స్త్రీ. మామూలుగా యిళ్లల్లో పూర్వకాలం స్త్రీలు పాడుకొనే పాటలు అనేక సందర్భాలలో అనేకము ఉండేవి. ఇంటి కిల్లాలు స్త్రీయే కాబట్టి సామాన్యంగా ఆమె ప్రసక్తి లేని గృహకృత్యమే ఉండేది కాదు. అందుచే అన్నిటిలోనూ ఆ స్త్రీమూర్తి అనేక స్వరూపాలలో మనకు దర్శనమిస్తూ ఉండేది. వరి కోతలప్పుడు, వడ్లదంపుళ్ళప్పుడు స్త్రీలు పాడుకొనేపాట లెన్నో ఉన్నవి. ఇంట ఏ శుభకార్యమైనా జరిగినప్పుడు వారి సందడి, సంరంభం చూడవలసిందే. తలుపు దగ్గర పాటలని, నలుగు పాటలని, మంగళహారతి పాటలని, శోభనపు పాటలని, బువ్వపుబంతులని వారు పాడేపాటలు అన్నీ యిన్నీ కావు. ఇండ్లలో పనిపాటలు చేసుకొనే టప్పుడు, పండుగ పబ్బాలు పాటించే టప్పుడు, వ్రతాలూ నోములూ అనుసరించేటప్పుడు, శుభకార్యాలు జరపుకొనే టప్పుడు ప్రత్యేకంగా స్త్రీలు పాడుకొనే పాటల నన్నిటినీ వందల కొద్ది శ్రీ శాస్త్రిగారు సేకరించి అప్పుడప్పుడాయా పత్రికల్లో వాని నన్నిటినీ ప్రకటిస్తూ వచ్చారు. వారి చిన్ననాట వారి స్వగ్రామంలో, స్వగృహంలో దంపుళ్ళ సావిడిలో పదుగురు స్త్రీలు కూడి లయతప్పకుండా గతిచెడకుండా, రోకళ్ళు సోకళ్ళు పాడుతూ ఉంటే నోటు బుక్కు దగ్గర ఉంచుకొని శక్యమైనన్ని పాటలను ఎక్కించుకొనే వారట. ఇట్లా శ్రీ శాస్త్రిగారు తీరని అన్వేషణతో సాహిత్య సేవాభిలాషతో ఎంతో కృషి చేశారు. ఈ దంపుళ్ల పాట వినండి.

వడ్లు దంచంగానె వచ్చె ముట్టమ్మ
గాజులుక పోచిలుక పోటు వేదాము
సువ్వని నే నొక్క పోటేసి తేను
చుక్కల్లు చిక్కటిలు చూరన్న కదలు

* * * *

పొమ్మన్న పోదాయె వరికూటివాపి
వరికూటి వాపికి వంకాయ వండి
వంకాయ నే తిందు వాని పొమ్మందు

* * *

అందలము కోరింది కుందనపుకుచ్చు
అతికోపి కోరాడు అత్తవారలు

* * *

పండ గొచ్చిందంటె బిడ్డకి ప్రేమ
అల్లు డొచ్చాడంటె అత్తకు ప్రేమ
వియ్యాలవారింట విందు భోంచేసి
చెంబెత్తి చెయి కడగ శక్తి లేదన్న
ఊరుముందర చేను వేయబోకన్న
ఊరివాళ్లను వియ్యము చేయబోకన్న
ఊళ్లో వేసిన చేను కాకిపిల్లపాలు
ఊళ్లోని వియ్యమ్ము కయ్యాలపాలు.

ఈ పాటలోని పలుకుబడి, చమత్కారము సామాన్యమైనదా! ఇవికాక వేర్వేరు సందర్భాలలో స్త్రీలు పాడుకొనే పాట లన్నిటినీ కలిపి "స్త్రీలపాటలు" అనే పేరుతో ఏలూరు మంజువాణీ ప్రెస్సువారు పాతికేండ్లకు పూర్వమే కొన్ని సంపుటాలుగా ప్రకటించారు. వాటిలో కామేశ్వరిపాట ఉన్నది. క్రీడాభిరామంలో కామేశ్వరి కథాప్రసక్తి ఉన్నది. ఈ కామవల్లి దేవి వలపును పాడుకొంటూ జక్కుల పురంధ్రి

1. దీనికీ వైద్యానికీ సంబంధించినఅర్థం ఉందని తద్జ్ఞులు చెపుతారు.

అందులో వస్తుంది. వీటి వివరాలతో క్రీడాభిరామం పీఠికలో శ్రీ శాస్త్రిగారు ఆనాడే వ్రాసినవిషయాలు చూడండి. "కామవల్లీ మహాలక్ష్మికే కామేశ్వరి యని నామాంతరము. ఏవురక్కలలోఁ గడగొట్టుదైనను కామవల్లీ మహాలక్ష్మి ముఖ్యురాలు కావున నామె పేరు ప్రధానముగాఁ జెప్పఁబడుచున్నది. తక్కిన యార్వురకును వేర్వేరుపేరులు గలవు. మొత్తమున వారికెల్లరకు "అక్క"లని పేరు. నేఁటికిఁ గూడ సర్వాంధ్రదేశమునను బ్రాహ్మణాది వర్గముల వారికే కామేశ్వరి (అక్కలు) యిలువేల్పు. ఈ దేవి యిలువేల్పుగాఁ గలయిండ్లలో వివాహాది శుభకార్యములు జరిగినతోడనే యక్కల కొలుపును జరగును. ఆనాఁ డేడుగురు ముత్తైదువల కర్చనము జరగును. ఆంగ్లేయుల యుద్ధగీతములవలె నుద్రేకజనకమైన గానఫణితిని కామేశ్వరి పాట వీరవాద్యములతో నానాఁడు పాడుదురు. ఆ పాట తీవరములో స్త్రీలకు కొందఱకు శివ మెత్తును. ఆ యర్చనము జరుగునాఁ డెంత తొందరించినను భోజనము సూర్యాస్తమయ మగును. "అక్కలు లేచేటప్పటికి నక్కలు కూస్తయి" అని నానుడి. నే నీ యక్కలకథ ననుద్రితముగా నున్న ఆదిలక్ష్మీ విలాసము కామేశ్వరీ చరిత్రము నను గ్రంథముల మూలమునఁ గనఁగొనఁ గల్గితిని."

ఒక్క కామేశ్వరి కథ మాత్రమే కాదు—[1]ఊర్మిళనిద్ర, సుభద్రవైరాగ్యపాటలు; శ్రావణమంగళవారపు పాటలు; ఇంకా తదితర స్త్రీల పాటలు అన్నీ పరిశీలించి వాటి వాటి రచనాఫణితులను విమర్శించి వారు వ్రాసిన వ్యాసాలెన్నో ఉన్నవి. తెలుగు మెఱుగులలోని "తెనుగు తేటదనము" అట్టి వ్యాసమే.

"స్వస్తిన్నృపాంకుశాత్యుత్సవత్సలసత్యత్రినేత్ర
విస్తరశ్రీయుద్ధమల్లుఁడనవద్యవిఖ్యాతకీర్తి."

అన్న శాసనపద్యం పఠనఫణితి తాళగతి లేక చదువ కుదురరానిదిగా ఉన్నట్టు తోస్తుంది. ఆమధ్యాక్కరఫణితియెంత హృదయరంజకంగా ఉంటుందో వారికి మొదట తెలియవచ్చిన సన్నివేశాన్ని వా రావ్యాసంలో వివరించారు.

"ఒకనాఁడు మాయింటిలో మా అమ్మగారు ప్రాఁతకాలపు పాట లేవో పాడుచుండఁగా వినుచున్న నాకు అందొక పాట ఫణితి చాల ఆనందజనకమైనది. నేఁటి కావ్యరచనల కనుకూలింపఁ జేసికొందమని గణవిభజన చేసి చూతును కదా అది మధ్యాక్కర లక్షణములు కలదయి యున్నది. మధ్యాక్కర పఠనఫణితి నా కప్పుడు తెలియవచ్చినది. దాని మాదిరి చూపుచున్నాను చూడుఁడు.

'అంతట రాముల వారూ
అంగన సీతను కూడీ
సంతస మందుచు వేగా
స్వపురమునకు నరుదెంచీ
తమ్ములతోడను గలసీ
నెమ్మది రాజ్యము లేలే
ధర్మముతో ప్రజ లెల్ల
తామగతంపర లైరి!

ఇందు రెండింద్రగణములు ఒకసూర్యగణము రెండింద్రగణములు. ఒక సూర్యగణము వెరసి ఆఱుగణములు కలసి ఒక చరణము. మాఁడవగణము కడపట సీసచరణదళము వలె మధ్యాక్కర చరణము మధ్యకు విఱుగును. ఆదికాలపు కవులు పాటించిన సీస, ద్విపద, గీతపద్యములు కొంచెము మార్పులు చెందియు, చెందకయు కూడ స్త్రీ బాలపామరాదులు పాడు పాటలలో, పదాలలో కానవచ్చుచున్నవి. స్త్రీలు పాడు శ్రావణ మంగళవారపు పాట సీసపద్యమే.

'శ్రావణా మాసాన శుద్ధపాడ్యమి నాడు
మహాలక్ష్మి ముత్యాలచీర గట్టె.'

అని దాని మొదటి చరణము. మఱియు ద్విపద అను ఆదికాలపు రచన అనేక ఫణితి ప్రభేదాలతో పాటలలో, పదాలలో ఉన్నది. ఒకటి రెండు ద్విపద ఫణితి ప్రభేదములు చూపుచున్నాను.

'ఒకరూ కట్టిన చీరా
ఒకరూ కట్టారూ
ఒకరూ తొడిగిన రైకా
ఒకరూ తొడగారూ
ఒకరూ పెట్టిన నగలూ
ఒకరూ పెట్టారూ
వార్నీ పొసగింపా నా
వశమూ కాదనెనూ.'

1. ఊర్మిళనిద్రను గురించి శ్రీ కృష్ణశాస్త్రిగారు మాడర్న్ రివ్యూలో వ్రాసిన వ్యాసం పాఠకులు చూతురుగాక!

ఇది ద్విపదవికారమే.

'వెన్నెల బైల వేవేలసంఖ్యలనూ
పందిళ్లు వేయించ్రి పగమాపావకులూ'

ఇదియు ద్విపదయే. ఇట్లు ఒక ద్విపదయే పలుగ్రంథములలో, పలు ఫణితులలో వాడుక భాషలో పలుపాటలుగా వెలసినది.

'ఇట్లే మన యిండ్లలో పాడేపాట లెన్నెన్నో దేసి రచనలు సంస్కృత సంబంధము లేనివి. అవియే యిప్పటికిని నరవమున గొప్ప కావ్యములలోని ఛందోరచనలు' ఈ వాక్యములు శ్రీ శాస్త్రిగారి 'తెలుగు కవితలోని దేసి తనము' అన్న ఉపన్యాస పాఠములోనివి. ఇట్టి ద్రవిడభాషాసమన్వయ పరిశీలనములో శ్రీ శాస్త్రిగారు చేసిన కృషి ప్రశంసనీయము.[1]

శ్రీ శాస్త్రిగారు పాతపాటల్ని సేకరించడమే కాదు. వానిని సాహిత్యరీతులతో సమన్వయించి చూపినారు కూడా. చాలా పాత కృష్ణాపత్రికల్లో స్త్రీల పాటలని, దంపుళ్ళపాటలని, పామరభాషని, మధురకవితలని శీర్షికలతో పెక్కు పాతపాటలను ప్రకటించారు.

ఈ స్త్రీల పాటలలోని విశేష మేమంటే అవి అన్నీ భారతనారీ స్వరూపస్వభావాలనూ, ఆదర్శాలనూ చిత్రించేవిగా ఉంటవి. సంసారాలలో స్త్రీల కష్టసుఖాలు కూడా కొన్నిట వ్యక్తమౌతుంటవి. హితబోధ, సందేశము ఉన్నవి కూడా లేకపోలేదు. 'ఒక డాలి కోరి కాదా యింద్రునికి ఒడలెల్ల కన్నులాయె- ఒక డాలి కోరి కాదా రావణుని కున్న తల లూడిపోయె' అని హెచ్చరించే పట్టులు కూడా స్త్రీలపాటల్లో ఉన్నవి. జక్కులవారు, పంబవారు, గొల్లలు బోలెడుతరంగంలో స్త్రీల పాటలను పాడుకొంటూ రాత్రిపూట పామరజనులను వినోదపరుస్తూ జీవనం గడుపుకొంటూ ఉండడం మన మెరిగినదే. కామేశ్వరికథ-బాలనాగమ్మకథ - లక్ష్మమ్మకథ - గుమంచికథ మొదలైనవన్నీ అట్లా ప్రచారంలోకి వచ్చినవే. వీనిలో స్త్రీలు పాడుకొనేపాటలు కొన్ని, స్త్రీలకు సంబంధించినపాటలు కొన్ని. అలా ప్రత్యేకంగా స్త్రీల పాటలే కాక పామరభాషగా వ్యవహరింపదగిన గేయాలు మనకు వేనకువేలున్నవి.

## పామరభాష.

సామాన్యంగా వీనినే జానపదగేయాలని అనడంకూడా కద్దు. వానిని గూర్చి పర్యాప్తమైన పరిశీలన ఇంకా ఎంతో జరగవలసి ఉన్నది. ఈ జానపదగేయాలను, వాని స్వరూపాలను వెదకి వెలికితీసి, దానిపై విమర్శనాత్మకమైన పరిశీలన జరపిన వారిలో ప్రథములు శ్రీ శాస్త్రిగారే. వారి బసవపురాణపీఠికే ఆవిషయాన్ని వెల్లడి చేయగలదు.

పండితారాధ్యచరిత్రలో పేర్కొనబడిన

"పదములు తుమ్మెదపదముల్ ప్రభాత
పదములు పర్వతిపదము లానంద
పదములు వాలేశుపదములు గొబ్బి
పదములు వెన్నెలపదములు సెజ్జ
వర్ణన, మఱి గణవర్ణనపదము"లు

మొదలైనవన్నీ ఆంధ్రదేశమున అప్పటికి పూర్వమే ప్రచారములో ఉండినట్లు తెలియనవుతున్నది. కాని అప్పట్లో అట్టి పదవాఙ్మయాన్ని గూర్చి పరిశీలించడానికి ఎక్కువ అవకాశం లేకపోయింది. ఇటీవల తాళ్లపాక వారి రచనలు వెలుగులోనికి రావడంతో యీ విషయంలో సంపూర్ణావకాశం కల్గిందని చెప్పవచ్చు. ప్రాచీన జానపద వాఙ్మయానికే నూతనవికాసం కలిగింది.

"జాజఱలు, చందమామలు, కోవెల, చిలుక, తుమ్మెదపదములు, లాలి సువ్విగొబ్బి ఉయ్యాల లాల జోల జోజో జేజే జయజయ విజయీభవ శోభన మంగళ వైభోగములు, మేలుకొలుపులు, నలుగులు, దంపుళ్లు, కొట్నాలు, కూగూగులు, గుజ్జనగూళ్లు, చందమామ గుటకలు, నివాళులు, ఆరతులు, మంగళారతులు, జయమంగళాలు, సాసముఖాలు, అవధానములు, తందానలు, వెన్నెలలు, చిత్తమా, మనసా, బుద్ధి (సంబోధనలు) మొదలగు మధుర కవితారచనా విశేషము లీ సంకీర్తనములలోఁ జాలఁ గలవు." వీనిలో తిరిగి ఒక్కొకపద స్వరూపంమీదా ప్రత్యేకమైన కృషి అవసరమైనది; చేసినారుకూడా శ్రీ శాస్త్రిగారు.

జాజఱలు, గొబ్బిళ్లు మొదలగు పద స్వరూ

---

1. దేసిరచనావిశేషాలు తెలుసుకొనడానికి శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి దక్షిణభారత సారస్వతము-దేశి చూడదగును.

పాలనుగూర్చి వారెఱుకపఱచిన అపూర్వ విషయాలు శిరసావహింపదగినవి.

జాజఱ.

నాచన సోమన వసంతవిలాసములోనిదిగా లక్షణకారులుపేర్కొన్న 'వీణాగానము వెన్నెల తేట' అన్న తాళచాపదమును శ్రీ శాస్త్రిగారు ఉత్తరహరివంశము పీఠికలో వెల్లడించారు. అందీ జాజఱపాటను గూర్చిన ప్రసక్తి ఉన్నది. పోగా శ్రీనాథుడు భీమఖండం పంచమాశ్వాసంలో

*"జాదర జాదరంచు మృదు
చర్చరిగీతులు వాసంతీరసా
స్వాదమదాతిరేకమునఁ
జంద్రిక గాయఁగ దక్షవాటిలో
వీదుల వీదులం గనక
వీణెలు మీటుచుఁ బాడి రంగనల్
మోద మెలర్పఁగా భువన
మోహనవిగ్రహు భీమనాథునిన్.

అనే పద్యంలోనూ, మరియొక చోటా కూడా జాజఱను పేర్కొన్నాడు. వసంతకాలంలో జాజఱ పల్లవిగా గల పాటలను (హిందోళ రాగంలో ముఖ్యంగా) పాడుకొంటూ ఉంటారని దానివల్ల తెలియవచ్చింది. అప్పటి కంతే. కాని తాళ్లపాకవారి గేయాలలో జాజఱలు బోలెడు బయటపడిన తర్వాత ఆపదను-దాని స్వరూపముకూడా బాగా వెల్లడయినది.

'చాలు చాలు నీజాజఱ నన్ను
జాలి బఱచే నే జాజఱ
వలపు వేదనల వాడేను-యీ
తల నొప్పులచే తలకేను
పులకల మేనితో పొరలేను-కడు
జలిగొని చల్లకు జాజఱ...'

ఇది జాజఱ పాటలోని పల్లవీ, చరణమూను. దీనిని గూర్చి అన్నమాచార్య చరిత్ర పీఠికలో శ్రీశాస్త్రిగారు ఉద్ధరించినవిశేషాలివి చూడండి.

'చాళుక్యరాజుల గ్రంథములలో (అభిలషితార్థ చింతామణి, సంగీత చూడామణి) సంగీత విషయములు చాలఁగలవుగాని వానిలో వర్ణితము లయిన సంగీతప్రబంధము లంత ముఖ్య మయినవి గావు. ఏలలు, ధవళములు, చర్చరులు, ఏకతాళులు, శరభలీలలు, చిందులు మొదలయిన వేవో కొన్ని మాత్రమే చిన్న రచన లందుఁ జెప్పఁబడినవి. అందుఁ గొన్ని నేఁడును వాడుకలో నున్నవి. వానిని గూర్చి యభిలషితార్థ చింతామణి సంగీతచూడామణులలోని ముక్కలు కొన్ని :—

* * * *

'రాగే హిందోళకే స్తాళః
చర్చరీ బహవోంఘ్రయః
యస్యాం షోడశమాత్రా స్యు
ర్ద్వితీయా ప్రాససంయుతా
సా వసంతోత్సవే గేయా
చర్చరీ ప్రాకృతైః పదైః॥

* * *

'చాళుక్యులు కర్ణాటకు లగుటచేతను, రాజులగుట చేతను తొలుత సంగీత సంప్రదాయ మధికముగాఁ గన్నడమున నెంపొందించియుందురు. మొదటికి గానమునకే కర్ణాటక గాన మని పేరయ్యెను. సంగీత శాస్త్రమున స్వరపద్ధతికి ధాతువని, సాహిత్యపద్ధతికి మాతువని పేరు. శరీరమునకు సప్తధాతువు లుండుటఁ బట్టి తత్సాదృశ్యమున సప్తస్వరములకు ధాతుసంజ్ఞ కుదిరెను. 'మాతు' కర్ణాట భాషా పద మనుకొందును. మాతు=మాట. ఈ శాస్త్రము తొలుత కర్ణాటకమున వెలయుటచే సాహిత్యమునకు 'మాతు' అన్న కర్ణాటపదము గొనుటయ్యెను గాబోలును. పై లక్షణ శ్లోకములలో నున్న చర్చరియే జాజఱ యగునది. అన్నమాచార్య సంకీర్తనములలోని జాజఱపాటలన్నియు గోవాళ్లు వసంతోత్సవములోఁ బాడునవిగా నున్నవి.'

పై నుదాహరించిన సంగీతగ్రంథములలో చర్చరి లక్షణము మాత్రమే కాదు. ధవళము, శరభలీల, ఏకతాళి మొదలగు మరికొన్ని పద లక్షణములు కూడ ఉన్నవి.

గొబ్బిళ్లు :—

ఈ జాజఱ పోయిన తర్వాత గొబ్బిళ్లు చిత్రమైన పదాలే. పాల్కురికి సోమన కూడా పేర్కొన్నపదాలివి. 'కొలనిదోపరికి గొబ్బిళ్లో' అన్నది అన్నమాచార్యుల ప్రసిద్ధమైన గొబ్బిపదం. మార్గశిరమాసంలో స్త్రీలు, బాలికలు గుమ్మాల ముందర గుంపులు చుట్టి, వల

1. జాజఱను గూర్చిన మరికొన్ని వివరములకు శ్రీ నిడదవోలి వేంకటరావుగారి "భాషా పరిశోధన-ప్రయోగవిశేషములు" చూడదగును.

యాకారంగా తిరిగి గొబ్బిళ్లు తడుతూ గొబ్బి పాటలు పాడతారు. నడుమ ఒక తట్టలో గొబ్బిదేవతని (పేడ ముద్ద) ఉంచుతారు. బాగా విచ్చిన గుమ్మడిపూ నొకటి దానిపై గుచ్చి పసుపు కుంకుమ పెట్టి దేవతని తీరుస్తారు. ఈ దేవతని యింటింటికి తీసికెళ్లి వాకిళ్ల ముందు పాట పాడుతూ చప్పట్లు చరుస్తూ చిత్రమైన విన్యాసాలు చూపుతారు.

ఈ గొబ్బిపద స్వరూపాన్ని గూర్చి దేవస్థానంవారు యిటీవల పునర్ముద్రించిన "తిరుప్పావై-స[illegible]పనులు" పీఠికలో శ్రీశాస్త్రిగారు ఇలా వ్రాశారు.

"దక్షిణ భారతదేశమం దెల్ల నీ వ్రతము కొన్ని మార్పులతో నిప్పటికిని గల దని నే నను కొనుచున్నాను. ధనుర్మాసమునం దెలుంగు దేశమున బాలికలు తెల్లవారు జాముననే నిద్ర లేచి గొబ్బెమ్మ లను పేర గోమయముతో (ముద్దలు) బొమ్మలుగా జేసి ముంగిళ్ల ముగ్గుల బెట్టి పూలతో నలంకరించి పూజింతురు.

సుబ్బి గొబ్బెమ్మా సుఖమూ లియ్యావే
తామరపువ్వంటి తమ్ముణ్ణియ్యావే
చేమంతిపువ్వంటి చెల్లెల్నియ్యావే.

ఇత్యాదిగాం బాట పాడుచు బ్రార్థింతురు. ఇట్టి ప్రార్థనము తిరుప్పావైలోను గొంత గలదు. దక్షిణ భారతమం దంతటను సామాన్య మయిన యొక వ్రతము ననుసరించి ద్రావిడ వైష్ణవులు విష్ణు సంప్రార్థనాత్మక మగు తిరుప్పావైని, ద్రావిడ శైవులు శివసంప్రార్థనాత్మకమగు తిరువెంబావైని గల్పించుకొని యుందురు. 'గొబ్బెమ్మ' పదము 'గోపెమ్మ' పదభవము. అరవమున 'గొబ్బియళ్' 'గోపిగళ్' పదభవము."

గొబ్బి పదస్వరూప మిది యిట్లే అనవచ్చును. గొండ్లి అనబడే కుండలాకార నృత్యమే (గర్భనృత్యమే) గొబ్బిళ్లు గర్భ-గబ్బా-గొబ్బి-అయిన దని తలచుట సరి కాదు.

"ద్వారవతీ యాదవకులభర్తకుం
దాళహస్తములు తప్పక కొట్టుచు
వజ్రపురిని దావలమై చిక్కిన
గోపప్రియునకు గొబ్బిళ్లనుచును" అన్న

హంసవింశతి [illegible]కంకూడా పై భావానికే తోడగుచున్నది.

లాలి.

ప్రసిద్ధమైన లాలిపాట—

"జోవచ్యుతానంద జోజో ముకుందా
రావె పరమానంద రామ గోవింద
అంగజుని గన్న మాయన్న యిటు రారా
బంగారు గిన్నెలో పాలు పోసేరా
దొంగ నీ వని సతులు పొంగుచున్నారా
ముంగిటా నాడరా మోహనాకారా

* * *

అంగుగా దాళ్లపా కన్నయ్య చాల
శృంగారరచనగా జెప్పె నీ జోల
సంగతిగ సకలసంపదల నీవేళ
మంగళము తిరుపట్ల మదనగోపాలా."

అన్నది అన్నమయ్య రచితముగా ఉన్న విషయము అన్నమాచార్య చరిత్రపీఠికలో శ్రీశాస్త్రిగారు వివరించారు. అన్నమయ్యగారి పాటలు నేడు ఎన్ని ప్రచారములో లేవు? ఇది తప్పకుండా ఆయనదే. ఇక్కడ ఒక చిన్న విషయము.

'శృంగార మంజరిం జేసి శేషాద్రి
శృంగవాసునకు నర్పించి యిచ్చటయు
నాడుచుం బతకమా కన్నల నోల
పాడంగ నాం డెల్లం బసిడికిం డైతి
నా కృష్ణమాచార్య నధ్యాత్మవినుతి
గాకం గొన్నాళ్ళు గడిస్తుండ నైతి...

పై గ్రంథభాగమున దొలుత పతకమా కన్నల నోల, తర్వాత కృష్ణమాచార్య నధ్యాత్మ వినుతి కలవు. కృష్ణమాచార్యుండు కాకతీయ ప్రతాపరుద్రుని నాంటివాండు. కాన యాతని వినుతికి ముందు గల పతక మా కన్నల నోల యంత కింకను ప్రాచీనము కాంబోలును. అది యెట్టిదో తెలియం జాల కున్నాను. పతమాక ఊరి పేరేమో! అది పతకమాకో పతకమూరో, పాతకమూరో యింకేదో ఆ యూరి వాండైన అన్నలు అను గేయకవి నోల పాట రచించి యాడుచు నొండె స్వామి బాలుండై యాడంగా నొండెం బాడెడివాం డని యూహము కాంబోలును" అని ఆ గ్రంథం పీఠికలో శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. నే నిటీవల శాసనసంపుటములు చదువుచుండంగా

గుర్తించిన శాసన మిది దీనికి సంబంధించినదై ఉంటుం దని ప్రకటిస్తున్నాను.

[1]కర్నూల్ జిల్లా, మార్కాపురం తాలూకా త్రిపురాంతకంలోని త్రిపురాంతకేశ్వర దేవాలయంలో చీకటిమిద్దెలోని శాసన మిది. శకసంవత్సరము లేదు.

1 వ్యయ సంవత్సర .. [కా]-
2 ర్తి ర క శు ౧౫ ప సోమగ్రహ-
3 ణ పుణ్యకాలమందు శ్రీత్రి-
4 పురాంతక దేవర దీపానకు-
5 శ్రీమన్మహాప్రధాని పొదుకమూ-
6 రి అంనల దేవని పడాలు ఎలుగంన-
7 యనాయుండు ఇచ్చిన మోదాలు ౨౫

(బహుళ: ఈ శాసనకాలము 1280 వ్యయ కావచ్చును.)

శాసనంలోని "పొదకమూరి అన్నలు" పై ద్విపదలో ప్రస్తావింపబడిన "పతకమాకన్నలు" ఒక్కరే నేమో! అన్నీ సరే కానీ-వారి జోల విషయమే తెలియరావడం లేదు.

## సువ్వి :—

ఈ సువ్వి పాటలు కూడా తాళ్ళపాకవారి సంకీర్తనలలో కానవస్తున్నవి. శ్రీ శాస్త్రి. గారు పూర్వమే కృష్ణాపత్రికల్లో ప్రకటించిన దంపుళ్ళ పాటలలో కొన్ని సువ్విపాటలు కూడా ఉన్నవి. ఇవి వడ్లు దంపుళ్ళప్పుడు స్త్రీలు పాడుతారు. ఇటీవల కాటమరాజు కథా విషయంలో వివరాలు సేకరించు తున్నప్పుడు,

[2]సువ్వి సువ్వి దేవసువ్వి సువ్వన్నాలాల
సువ్వాలే దంచంగ ఏ యన్నా రాడు
పా(ప)చ్చవడ్లు నే బోసి పోటువేయంగ
దొనకొండరాసుల్లు దుప్పన్న కూలు

ఇత్యాదిగా గల సువ్వి కాటమరాజుకథకు సంబంధించినది లభించింది.

## కూగూగులు

ఈ సువ్విపాట తర్వాత ముఖ్యంగా నేను చెప్ప దలచుకొన్నది కూగూగు పదాలను గూర్చి. అన్నమయ్య రచనలో

గులు తెలింగినదొంగ కూగూగు పిడు
గుడిలోన దాగేని కూగూగు
నెలతల దోచేని నీళ్లాడగాను
కొలని దరిని దొంగ కూగూగు
బలువైన వుట్ల పాలారగించేని
కొలది మీరినదొంగ కూగూగు

అని ఒక కూగూగు పద మున్నది. దీనిని గురించి కొంత వివరిస్తాను. కోతికొమ్మచ్చులు ఆడుకొనేటప్పుడు పిల్లవాళ్లు—

గుగ్గూగు కొమ్మంచు
చాకలాడి బండకింద పాడంతా దాగేడు
గుగ్గూగ కొమ్మంచు॥

అని ఊతపాట పాడుతూండడం కృష్ణాజిల్లా వైపుల ఉన్నది. ఆ మొదటిపాదాని కర్థం 'అడుగడుగో కొమ్మంచులో ఉన్నాడు' అనే! అడుగడుగో - గోగోగో స్వరూపమే గొగ్గోగాను గుగ్గూగుగాను కూగూగుగాను ఏర్పడింది. తర్వాత ఇదే పరుషోచ్చారం చేయగల సామర్థ్యంచేతను, శబ్దసామ్యం (Analogy) వల్లను కూగూగుగా వ్యవహారానికి వచ్చిం దనుకొంటాను.

ఆటల్లో దొంగ యితరులను పట్టుకోడానికి తరిమి తరిమి 'అడుగడుగో' అనవలసి వచ్చినపుడు 'గూగూగూ' అనడం ఉన్న దని శ్రీ విస్సా అప్పారావుగారు నాకు తెలిపారు. వారి చిన్న నాట దాగుడుమూతలు ఆడేటప్పుడు-దొంగ 'గూగూగ్గూ' అని కూత వేస్తూ పరుగెత్తడం అలవాటుండేదని వారన్నారు. ఈ విషయం కూడా నామాటకు బలంగానే ఉన్నది. పోగా ఇక్కడి అన్నమయ్యగేయం దాన్ని నిర్ధారిస్తున్నది. దొంగ కృష్ణుణ్ని 'అడుగడుగో-గుడిలో దాగేడు-అడుగడుగో'-అనడమే అది. 'కూగూగు' పదస్వరూప మిట్టిది!

## ఏలలు :—

ఏలపదాలకి లక్షణకారులు లక్షణం వ్రాశారు.

అన్నమయ్య సంకీర్తన లక్షణం అనే గ్రంథంలో యిలా చెప్పెనట—

'నాయకావ్హానపూర్వమై నయము కలిగి
మెచ్చుపరిభాషఁ దగి రాగమిళితమైన

1. (1 S. G. rol x No: 266 AR No: 237 of 1905)
2. ఈ పాటను శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు విజయ సంవత్సరాది సంచికలో ప్రకటించారు.

యేలపాట పదంబునా నిలఁ జెలంగు
మహితనాయకసంబుద్ధిమధ్య మగుచు.'

ఇది ఆ లక్షణానికి చిన్నన్న తెనిగింపు. ఈ ఏలపదాలను గూర్చి శ్రీ శాస్త్రిగారు ఆంధ్ర పత్రికలో ఆ నడుమ వ్యాసం వ్రాస్తూ

అప్పా రావోయీ ఒప్పుల
కుప్పా రావోయీ
తప్పటడుగూ లిడుచూ నా
తండ్రీ రావోయీ
అంగిలోపాలా నీబొజ్జా
ఆకలి గొన్నాదీ
బంగారూ నా తండ్రీ రావో
పాలూ పోసేనూ

అని ఒక చక్కని ఏలను ప్రకటించారు. ఏలలు పాడుతుంటే విన మధురంగా ఉంటవి.

## చందమామలు :—

చందమామపదానికి తాళ్లపాక వారి లక్షణమున్నది.

"దుస్తర విప్రలంభమున
దూతికతోడ మొఱంగి చంద్రవి
న్యస్తభరస్స్వభావమున
నాయకుఁ డేనియుఁ గాంత యేనియున్
వి స్తరపాదపాదముల
వేడుకఁ జందురుఁ జేసికొన్నచోఁ
బ్రస్తుతి కెక్కుఁ దత్పదము
భాసురమై ద్విపదప్రదాకృతిన్"

'వేంకటభూమినీ-ధరవరకీర్తనలక్ష్యము-
లురుపదకవితాపితామహుం డేర్పఱచెన్.

అన్నమయ్య గారే లక్ష్యలక్షణాలు రెండూ చేశారు. వారి రచనలు చూడదగును.

## ఇతరపదాలు :—

పైని చెప్పినవి కాక యింకా వెన్నెల పదాలని, తుమ్మెద పదాలని, కోయిల పదాలని, అల్లో నేరెళ్లని.. ఎన్నో రకాలపదాలు తాళ్ళపాక వారి రచనలలో ఉన్నవి. వెన్నెలారో అనీ, తుమ్మెదారో అనీ పల్లవిగా గల రచనలే వెన్నెల, తుమ్మెద పదాలు.

ఇంతవఱకు ప్రత్యేకించి తాళ్లపాక వారి కీర్తనలలోని జానపద సాహిత్యభాగాన్ని గూర్చి మాత్రమే ప్రసంగించడమైంది.

[1] శ్రీ శాస్త్రిగారు 'కట్టు కథలు' అనే వ్యాసంలో వివరించారు.

కప్పాయ్ కప్పాయ్ అనరాదా
కాళ్లభేతాళు డనరాదా

అని నీటికుండలో కప్పని ఉంచి, దాన్ని నెత్తిన పెట్టుకొని వర్షాలకోసమై "ముక్కోటి వాసదేవుడా" అని ప్రార్థిస్తూ, పై పాట పాడుతూ, ఇంటింటికి వెళ్లి ఓందెడు నీళ్లు పాదాలపై పోయించుకొంటూ పిల్లవాళ్లు తిరగడం మన మెఱిగినదే. ఈ జానపద గేయగాథ వేద లలో విశదింపబడ్డదని శ్రీశాస్త్రిగారందు వ్రాశారు. శ్రీవారి జానపదసాహిత్యసేవ లోకోత్తర మైనదికదా !

ఎన్ని పాటలు వారు సేకరించారు! మద్రాసు ప్రాచ్య పుస్తక భాండాగారానికి తాళపత్రగ్రంథాలు సేకరించడంకోసం టూరు వెళ్ళినప్పుడు ఆంధ్రదేశంమొత్తంమీదా అక్కడక్కడ అప్పుడప్పుడు వారు చేకూర్చుకొన్న సాహిత్య నిధు లెట్టివెన్నని ? ఈ పాట వినండి. కర్త ఎవరో తెలియదు.

రామరామరామ రామరామ యేల పలుకవూ
పలుకుమన్న పలుకవు పంచదార చిలుకవూ
నీవసిష్టు ర వలె నీకు వడుగు కావలే

ఇత్యాదిగా రామాయణకథ పూర్తిపాఠం పాట రూపంగా ఉన్నది. ఎంత చక్కనిది రచన ! పలుకుబడి లబ్జుగా ఉంది !

ఇటువంటి పాటలు పదాలుగల తాళపత్ర గ్రంథాల నెన్నింటినో వారు సేకరించి ఆ భాండాగారాన్ని అలంకరించారు.

పాటలూ పదాలూ గల తాళపత్ర గ్రంథాలను సేకరించినవే కాక స్వయంగా వారు విని వ్రాసుకొన్నపాట లెన్నో ఉన్నవి.

హరిహరీ లక్ష్మణస్వామీ ఇది యేమి
అన్యాయ మిటు చేస్తి వేమీ
ఆ తల్లి నటు ఒంటిగా
అడవిపాలూ చేస్తివా—

అని లక్ష్మణుడు గర్భవతియైన సీతమ్మను అరణ్యంలో దిగవిడిచి వచ్చే సందర్భంలోని పాట-పాదపాదానికీ 'హరిహరీ' అనడంలో ఎంతో దైన్యమూ, జాలీ ఉన్నది. పోగా పామరులకి

1. ఈ వ్యాసం, వారే విస్తరింప జేసినది, ఈ పత్రికలోనే ప్రకటింపబడ్డది.

—సంపాదకుడు.

ఏకధాటిని సమాసాలతో కథ చెప్పుకు పోవడం కన్నా తేలికగా వాళ్లు అనుసరించేటందుకు వీలుగా ఇలా విరిచి విరిచి చెప్పడంలోనే యీ సాహిత్యంలోని ప్రసన్నత ఉంది. ఈ పాటని శ్రీ శాస్త్రిగారు పాత కృష్ణాపత్రికలో ప్రకటించారు.

ఇట్లా బాలభావను, స్త్రీలపాటలను, పామర భావను వీరెంతో ఉద్ధరించారు; పరిశీలించారు; ప్రకటించారు; తమకు తామై కంఠం వీలిచ్చి నంతవఱకు పాడుకొని లోలోపల ఆనందించారు.

ఈ జానపదవాఙ్మయమంతా స్త్రీ బాల పామరాదుల నాలుకలపై నిలచిపోయినదే తప్ప సాహిత్యత నందుకొన్నట్లు నేటికింకా మన దృష్టి కానలేదు. కొంతవఱకైనా ఆ దశను బొందిన దని చెప్పదగిన దేసి సాహిత్య రచనలు యక్షగానాలు, మంజరులు, ద్విపదలు, వచన గీతాలు మాత్రమే. ఇవి మధురకవితలు. వీని విషయంలోనూ శ్రీ శాస్త్రిగారిదే పెద్ద చెయ్యి. వారి సుగ్రీవవిజయం ఏక రత్నము వంటిది. కురవంజులగూర్చి వారు వ్రాసిన విషయాలు సిద్ధాంతములుగానే నిర్ధారింపవచ్చును.

ఎంత పని చేసితివి రామా-నిన్ను నే
నే మనందును సార్వభౌమా
చెంత కీటు గాలేక చెట్లలో దాగుండి
వింతమృగమునుగొట్టువిధ మాయె నా బ్రతుకు

ఆదిగా పాడుకొనే పాట గుత్తెనదీవి రామాయణం లోనిది వారంగులో ఉద్ధరించారు. కూచిపూడి వారినిగూర్చి, ఆట భాగవతాలను గూర్చి ఎన్ని విషయాలు వారంగులో క్రోడీకరించారు! నిజం చెప్పాలంటే లోక మెరుగనిదీ-విషయం శ్రోత్రదీ కానిదే వారేమీ వ్రాసేవారు కారు. ఆచి యాచి, తూచి తూచి వారు వ్రాసినవి సర్వధా ప్రామాణికములే అయేవి.

“సుభద్రాపరిణయం” విషయం చూడండి. కాళహస్తి జమీందారుగారి లైబ్రరీ నంతా భద్రతకోసం తిరుపతి లైబ్రరీకి తరలిస్తూ ఉండగా అక్కడి పుస్తకాలతోపాటు వచ్చిన దిది. అన్నమయ్యగారి భార్య తిమ్మక్క వ్రాసినది. మంజరీ విశారమైన రచన. సరిగా వారి దృష్టి దానియందే లగ్నమయింది. ఆమె తొలి తెలుగు కవయిత్రి. “ఎగుబుజంబులవాడు మృగరాజ మధ్యంబు పుడికి పుచ్చుకొను చెన్నడుము వాఁడు.” అని చేమకూరకవి యీ మోను యెలా అనుసరించాడో శ్రీ శాస్త్రిగారు ఆ గ్రంథం పీఠికలో వెల్లడించక ఊరుకోలేదు.

ఇటీవల మద్రాసు గవర్నమెంటు తరఫున ప్రకటింపబడిన కాటమరాజుకథ కూడా యిట్టి మంజరీ విశార మనదగిన రచనయే. పినయెల్లయ వ్రాసినది. శ్రీ శాస్త్రిగారు పరిష్కరించిన గ్రంథాలలో (గంగనాథ రామాయణం కాక) దీని కొక్కదానికే స్వయంకృతమైన పీఠిక లేకపోయినది. ఈ గ్రంథం జానపద వాఙ్మయాని కెల్ల మేలుబంతి అనదగినది. అగుమంచి కథకూడా అలాటిదే, శ్రీ శాస్త్రిగారు సేకరించినది.[1]

వచనమాలికా గీతాల విషయంలోనూ వీరిదే అగ్రతాంబూలం అనక తప్పదు. దాదాపు యిరువది యేండ్లక్రింద శ్రీ శాస్త్రిగారు భారతి సంచికలలో “వేంకటేశ వచనాలు” అని కొన్ని వచనమాలికా గీతాలను అప్పటికి లభ్యమైనంతవఱకు ప్రకటించడానికి యత్నించారు. కాని తర్వాత తిరుపతిలో తాళ్లపాకవారి సాహిత్య నిధులను గమనించి యింకా పరిశీలించి ప్రకటించే తలపుతో అప్పటికా యత్నము మానినారు.

ఆపైన తిరుపతిలో స్వామి సన్నిధిని దొర్కొని వాని నన్నిటినీ సరిగా పరిష్కరించి విపులమైన పీఠికలతో ప్రకటించారు. వచన వాఙ్మయమునుగూర్చి తొలుత పరిశ్రమ చేసిన వారు వీరే.

రాగతాళాలతోకూడ ఉన్నటువంటి ‘వేంకటేశ్వర వచనాలు” సాహిత్య, వైష్ణవ సంప్రదాయముల రీత్యా చాల సరసమైన రచనలు. ఈ గ్రంథం పీఠికలో శ్రీ శాస్త్రిగారు వచన వాఙ్మయ వికాసాన్ని గూర్చి సర్వవిషయాలు సూత్రప్రాయంగా వివరించారు. అందే వారు కృష్ణమాచార్య వచనాలనుగూర్చి ఉట్టంకించారు అతని పేరొన్న వేంకటాచల విహార శతకంలోని పద్యాలను ఉద్ధరించారు. ‘ఆ వచనములు రచించిన కృష్ణమాచార్యులు కాకతీయ ప్రతాపరుద్రుని నాటివాడని యేకశిలానగర చరిత్రాదులవలన తెలియనగును” అని వారధోజ్ఞాపికలో వెల్లడించారు.

1. పై సంచికలో అగుమంచికథ శుద్ధప్రతి ప్రకటింపనున్నాము. —సంపాదకులు.

పదునైదవ శతాబ్దివాడయిన అనంతుడు వచనము (గద్య)ను పేర్కొన్నాడు. ఆతర్వాత లక్షణశిరోమణికారుడు గద్యలక్షణాన్ని వివరిస్తూ గద్య, బిరుదుగద్య, చూర్ణిక, వచనము, విన్నపము అని అయిదు తెలుగు లన్నాడు. శ్రీ శాస్త్రిగారన్నట్లు ఇతడు పేర్కొన్న "విన్నపములే అనంతామాత్యుడు పేర్కొన్న వచనము లగును"

"అనంతామాత్యుడు (వచన)గద్యమనియు, లక్షణశిరోమణికారుడు విన్నపమనియు పేర్కొన్న తీరు రచనలవి సంస్కృతమున శ్రీ భగవద్రామానుజాచార్యులవారు రచించిన గద్యత్రయమును, పాల్కురికి సోమనాథుడు రచించిన పంచప్రకార గద్యాదులను పరిష్కరించుకొని కర్ణాటాంధ్రములలో వైష్ణవ శైవ భక్తులు సాగించిన రచనలు అయియుండునని నేనూహించుచున్నాడను."

.. పీఠిక

"ఇంకను నిట్టివి శంకర వచనములని, శతకోప విన్నపములని, కాలజ్ఞాన వచనములని, కాళికా వచనములని, భవానీమనోహర వచనములని, శేషగిరినాథ వచనములని మఱియు కొన్ని పేర్లతో వచనరచనలు ప్రాచీనములుగా గానవచ్చుచున్నవి. అవి యెల్ల నించుమించుగా పదునాలుగవ శతాబ్దికి తరువాతివే కావచ్చు ననుకొందును. ఇప్పటికి నాయెఱుకకు వచ్చినంతలో కాలనిర్ణయము చెప్పదగిన ప్రాచీన వచనరచనలలో కృష్ణమాచార్యసంకీర్తనమునకు తర్వాతి "వేంకటేశ్వర వచనము"లే పేర్కొనదగినవి. ఈ రెంటిలో మొదటిది పదుమూడవ శతాబ్ది తుదిది రెండవది పదునైదవ శతాబ్ది తుదిది" అని శ్రీ శాస్త్రిగారు ఆ పీఠికలో వ్రాశారు.

## నానుళ్లు - సామెతలు—

ఇక మిగిలిన విషయ మొక్కటి ఉన్నది. అది పామర భాషలోనే చేరదగిన నానుళ్లు సామెతలు మొదలగు వానినిగూర్చి. ఈవిషయంలోనూ శ్రీ శాస్త్రిగారు చేసిన కృషి అపారమైనది. కీర్తిశేషులు శ్రీ చిలుకూరి నారాయణరావుగారు "సామెతల యజ్ఞము" చేయదలచారు.

అసలు సామెతలన్నవి జాతీయజీవనానికి కొలబద్దలవంటివి. అంటే జాతి శక్తి, సంస్కృతి, ఎలాంటిదో ప్రత్యక్షంగా మనకు ప్రతిబింబింపచేసే వన్నెమాట! ఆయాప్రజలు, వారుపయోగించే ఆయాభాషలు సంస్కారవశమున క్రమశః పరిణామం చెంది చెంది సురూపం దాలుస్తూ ఉండడం సంభవిస్తూ ఉంటుంది. అలా మానవజాతి, తదనుగుణంగా వారి భాషా తేరుకొని తేరుకొని తేటపడుతూ ఉండే అవస్థల్లో అప్పుడప్పుడు అక్కడక్కడ సమష్టిగా సంఘానికి సహాయ్యముంచేలాగున రసాయనంవంటి రసగుళికలు అనుభవ పూర్ణమైనవి, ఆదరణీయమైనవి ఉద్బుద్ధమౌతూ ఉండడం సంభవిస్తూ ఉంటుంది. అట్లాటివే మన న్యాయాలు, జాతీయాలు, నానుళ్లు, సామెతలు మొదలైనవి. ఇవి ఆయా ప్రజల నాలుకలపై తేలికగా తేలియాడుతుంటవి. అటువంటి వాటిలోనే ఆయాజాతుల ప్రజల ఆచారములు, అనుభూతులు, పలుకుబడులు, కూర్పు నేర్పులు, ఆశావాసనలు, సారస్యవైరస్యములు, ఛందస్సందర్భములు అన్నీ అద్దములో వలె ప్రతిఫలిస్తూ ఉంటవి. అంతేకాక వాటిలో నాటివఱకు గడచిన జాతి జీవితమంతా, శక్తి అంతా, అనుభవమంతా పొందుపఱుపబడి ఉంటుంది. అట్టి తీరు తీయములుగల భాషాసామగ్రిని వట్టి సరకుగా కొట్టివేయుట తగదు. కేవలం వాటి సేకరణ - ప్రకటన ఆవసరం. ఏనాటికైనా, ఏభాషకైనా వాటి ప్రయోజనం అంతింతనరానిది. అన్ని భాషాసౌధాలు అందుమీదనే ఆధారపడి ఉంటవి. ఇవి రాలిపోతే అవి కూలిపోతవి.

శ్రీ శాస్త్రిగారు ఎన్నో పలుకుబళ్ళకీ, నానుళ్ళకీ చిత్రార్థాలు నిరూపించారు.[1]

దేశం మొత్తం మీద అనేక ప్రాంతాలలో పెద్దల బుఱ్ఱల్లోను, నోళ్ళల్లోను అణగి మణగి ఉన్నవాటిని, అచ్చయినటువంటి-కానటువంటి బహుగ్రంథ సంచయములోని వాటిని, ఊరూరా తిరిగి, కనపడిన వారినల్లా అడిగి, అదీ యిదీ తిరగేసి, విన్నవాటిని విన్నట్లు, కన్నవాటిని కన్నట్లు-అర్థం అయినా, కాకపోయినా వ్రాసి ఉంచుకొని తంటాలు పడితే ఏ నాటికైనా ఒక రూపం వాటికి తీసుకు రావచ్చు. సేకరణ ఒక పద్ధతి క్రింద చేయలేము. సేకరించిన పిదప ఒక పద్ధతి కల్పింప

1. ఈ వ్యాసంకూడా ఈ సంచికలోనే ప్రకటించాము—సంపాదకులు.

# ముద్దరాజు-రామన-కవిసంజీవని

శ్రీ రావూరి దొరసామిశర్మగారు



తెలుఁగు భాషలో ఛందోవ్యాకరణ లక్షణ గ్రంథములు పెక్కులు గలవు. అందు నేఁడు ముద్రితములై ప్రచారములో నున్నవి వ్రేళ్ళ లెక్కింపఁదగినంత స్వల్ప సంఖ్యాకములై యున్నవి. మిగులు మిక్కిలి యముద్రిత లక్షణ గ్రంథములందే నాలుగైదో సుపరిష్కృతములు. ముద్రణభాగ్య మందక క్రిమిగ్రస్తములై శిథిలములై నామగపితములునై యుద్ధరింపఁబడక తాళపత్ర గ్రంథాలయములందు మూలఁబడి

వచ్చు. ఈ విషయములో యింకా ఎంతో పర్యాప్తమైన పరిశీలన జరపవలసి ఉన్నది

'జరుగవలెను-జానపదుల సాహితీ సామగ్రిని సమకూర్చి, పరిశీలించి, సముచిత ప్రచారముతో వాటిని సంరక్షించడం వెంటనే జరుగవలెను.' అని పరితపించి 'ఊరూరు, వాడవాడ భిక్షగాడై తిరిగి' 'జేబులలో నోటుబుక్కు ఉంచుకొని' అక్కడిక్కడ అప్పటి కప్పుడు వ్రాసుకొంటూ వచ్చారు శ్రీ శాస్త్రిగారు. అప్పుడప్పుడు మచ్చుకు వాటిని ఆంధ్రపత్రికలలో ప్రకటిస్తూనూ వచ్చారు. ఇంకా ప్రకటింపవలసినవి బోలెడున్నవి. 'అమరము వలె మనుష్యవర్గము, జంతువర్గము, గ్రామవర్గము, జాతివర్గము, శరీరవర్గము, బాంధవవర్గము, నిందావర్గము, వ్యవహారవర్గము, నామవర్గము, కథావర్గము-ఇత్యాదిగా వర్గవిభజన చేసి, నానుళ్లను, పంటుబళ్ళను, లజ్జలను, పలుకు గుత్తులను ప్రకటించాలని వారి చిరకాల సంకల్పము. వర్గవిభజన చేసి ఏరుస్తున్నాము, కూరుస్తున్నాము, దైవం అనుకూలిస్తే త్వరలోనే ప్రకటిస్తాము.

సాహిత్యానికి శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చేసిన సేవ అపారమైనది. ప్రత్యేకించి జానపద సాహిత్యానికి వారు చేసిన సేవ అమూల్యమయినది. పలుముఖములైన శ్రీ వారి ప్రతిభకు నా శతసహస్రప్రణామములు!!

---

యనూహ్యంపకర్త్యములై పెక్కు తెలుఁగు లక్షణ గ్రంథములు ప్రకృతము గలవు. భాషాభిమానులు వాఙ్మయమునకు వెలుగులగు నిట్టిలక్షణ గ్రంథముల వెలుఁగులోనికిఁ దెచ్చుటకు యత్నించి పాటుపడుట వారికిఁ బ్రథమకర్తవ్య మని నా విన్నపము.

ప్రకృతము కవిజనసంజీవని యను లక్షణ గ్రంథమునుగూర్చి యిందుఁ బ్రస్తావింపఁదలఁచితి. ఇయ్యది ముద్రితమే. కాని యసమగ్రము, అపరిష్కృతము. సమగ్రగ్రంథ మొండేని లభించినచో నున్నదానితో సంప్రతించి పరిష్కరించి ప్రచురింపవలసియున్నది. లేదా ప్రచారములో నున్న యీ యసమగ్రప్రతి (వావిళ్లప్రతి) నైన సుపరిష్కృతము గావింపవలయు.

కవిజనసంజీవని తెలుఁగు ఛందోవ్యాకరణ విషయములఁగూర్చి స్వల్పముగా సూత్రప్రాయముగాఁ దెల్పు లక్షణగ్రంథము. దీనికిఁ గవి పెట్టిన పేరు 'కవిజనసంజీవని' యని యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

క. ఒనరించెద నన్నయాది
తిక్కనయజ్వప్రముఖనిఖిలకవిసూక్తమణీ
జని యగు 'కవిజనసంజీ
వని' యనులక్షణము సుకవివరులు నుతింపన్.

గద్యలో సయితము యీపేరే యున్నది.

కాని తరువాతి లాక్షణికులు దీనినే కవిలోక సంజీవని, కవిసంజీవని, కవిజీవసంజీవము మున్నగు పేళ్లతో వ్యవహరించియున్నారు.

కవిజనసంజీవనీ గ్రంథకర్త:

ముద్దరాజు రామభద్రకవి. ముద్దరాజు రామన, రామభద్రయ్య యని లాక్షణికులచేఁ బేర్కొనఁబడియెను. ఇతని తండ్రి ముద్దరాజు గణపయామాత్యుఁడు. గణపయ్యకుఁ బెదరామన, చినరామన, రామన (మనకవి) అని ముగ్గురు కుమారులు. అందు మనకవి కనిష్ఠుఁడు. ఇతఁడు నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు; మదనగోపాలభక్తుఁడు. ఈ విషయము లన్నియు

గ్రంథమునందలి యవతారికాశ్వాసాంత పద్య గద్యములచేఁ దెలియుచున్నవి.

సీ. అంపమా నీకే మహాసుధానిధి నిరా
ఘాటలాక్షణికతాకౌశలంబు
దొరయు నీకే కవిస్తోమస్తుతానేక
నాటకాలంక్రియాపాటవంబు
తగు నీకె శాస్త్రికస్తవనీయభాష్యకా
వ్యాటమహోశ్లోకవిద్యానిరూఢి
చెల్లు నీకె లసద్గీతయానాసక
విత్వశారదావిలసనంబు.

గీ. ననుచు బుధు లెల్ల వినుతింప నలరు ముద్ద
రాజు గణపయ్య గర్భవారాశిపూర్ణ
చంద్ర పెదరామ చినరామ సచివమణుల
కనుఁగుఁదమ్ముఁడ రామభద్రాఖ్యకవిని.

(1-3)

గద్య :— 'ఇది శ్రీమన్మదన గోపాల కృపాకటాక్ష ప్రాప్త సారసారస్వత సంపదానంద నందవరకులాలంకార ముద్దరాజు గణపయామాత్య పుత్త్ర పెదరామ సచివ సోదర రామభద్రప్రణీతంబైన కవిజనసంజీవని యను లక్షణగ్రంథము...'

పై రచనవలన రామన మహావిద్వాంసుఁడు, లాక్షణికుఁడు, కవితావిశారదుఁడనుట తెల్లమగును.

**ముద్దరాజు పెదరామన :—**

మన ముదరాజు రామన కగ్రజుండు. ఇతఁడు పింగళిసూరన రాఘవపాండవీయమునకు రాఘవపాండవీయాదర్శ మను పేర వ్యాఖ్య రచించె. ఆ వ్యాఖ్యలోని గద్య కవిజనసంజీవనిగద్యం బోలి యున్నది.

'ఇది శ్రీమన్మదన గోపాల కృపాకటాక్ష సంప్రాప్త సారసారస్వత సంపదానందనంద వరాన్వయక్షీరపారావార రాకాసుధాధామ ముద్దరాజ గణపయామాత్య పెదరామసుధామణి ప్రవర్తితంబైన రాఘవపాండవీయాదర్శంబు.'

దీనిని సరిగాఁ బరిశీలింపక కొందఱు రాఘవపాండవీయవ్యాఖ్యాత కవిసంజీవనీ కర్తయగు ముద్దరాజు రామనయే యని ప్రమాదమునఁ దలంచి ప్రకటించియున్నారు. ప్రథమముగా వీరేశలింగముగారు తమ కవుల చరిత్రలో నీ పొరపాటు గావించిరి. (ముద్దరాజు రామన్న కవి సంజీవని యను లక్షణగ్రంథమును రచించెను. మఱియు నితఁడు రాఘవపాండవీయమునకు వ్యాఖ్యానమునుగూడఁ జేసెను. కవులచరిత్ర - 2-వ భాగము) తరువాత ననంతుని ఛందో దర్పణోపోద్ఘాతమున శ్రీ గిడుగు సీతాపతిగారు వీరేశలింగముగారి వ్రాఁతను జూచి భ్రమించి ముద్దరాజు రామనకే వ్యాఖ్యానకర్తృత్వ మంటఁ గట్టిరి. (చూ. ఉపోద్ఘాత. పు. 9: ... ప్రథమాంకవిభక్తులపై...అనే ఛందోదర్పణము లోని పద్యమునే 16 శతాబ్దాంతమున ఉండినవాఁడని వీరేశలింగము పంతులుగారు చెప్పిన ముద్దరాజు రామన్న రాఘవ పాండవీయాదర్శములో రెండుచోట్ల ఉదాహరించినాడు.)

ఇంకను మఱికొందఱీ ప్రమాదమును లక్షణగ్రంథ పీఠికలలో పత్రికలలోఁ గావించియున్నారు. కవిసంజీవని వ్యాదర్శగద్య లించుమించు సమముగా నుండుటవలన భ్రమించి యాదర్శగద్యలోని 'పెదరామ' నామభేదమును పసిగాగ మనింపమిచే నీ ప్రమాద మేర్పడియుండుఁగాబోలు! ఈ పొరపాటును సవరించి, 'అనంతుని ప్రశస్తి' యను వ్యాసమున నాంధ్ర సాహిత్య పరిషత్పత్రికయందు నేను బ్రకటించియున్నాను. (చూ. పత్రిక సం. 38-సంచిక 1-3 పు. 25-26) ఇటీవల శ్రీ చాగంటి శేషయ్యగారి యాంధ్రకవితరంగిణిలోను నీ ప్రమాదము దొలఁగినది గాదు. (చూ. 10 సంపుటి-105 పుట: — )పింగళి సూరన చరిత్రము వ్రాయు సందర్భమునఁ దరంగిణిలో నిట్లు రచితము—'కవిసంజీవని యను లక్షణగ్రంథమును రచించిన ముద్దరాజు రామకవి యీ రాఘవపాండవీయమునకు వ్యాఖ్యానము రచించెను'. ఇఁకముందు ముద్దరాజు రామన చరిత్ర వ్రాయుపట్టున నెవరిని వీరీప్రమాదమును సవరించుకొందురుగాక.

కవిజనసంజీవనీకర్త ముద్దరాజు రామన; రాఘవ పాండవీయ వ్యాఖ్యాత పై రామన కగ్రజుండగు ముద్దరాజు పెదరామన యని విజ్ఞులెఱుంగుదురుగాక.

### రామన కాలము :

వీరేశలింగముగారు 16వ శతాబ్దాంతమువాఁడని స్థూలముగాఁ జెప్పిరి. ఇంచుక సూక్ష్మముగా నితని కాలము నిర్ణయింపఁ గడంగెద. రామన కగ్రజుండగు పెదరామన రాఘవ పాండవీయ వ్యాఖ్యాత యగుట చేతను, నాతని వ్యాఖ్యలో నాంధ్రభాషాభూషణము, కావ్యాలంకార చూడామణి, అనంతుని ఛందము, కవి చింతామణి యను లక్షణ గ్రంథము లుదాహృతము లయి, యీ కవిసంజీవని గ్రహీతము గాకుండుట చేతను, మన రామన సూరన తరువాతివాఁ డని, సంజీవని యాపద్య వ్యాఖ్యానంతర కాలిక మని చెప్పవచ్చు. సూరన రాఘవ పాండవీయ రచనాకాలము క్రీ. శ. 1545 ప్రాంత మని నిర్ణయింపఁబడియున్నది. (సూ. కవితరంగిణి- 10 సంపుటము 104 పు) ఏతద్గ్రంథ వ్యాఖ్యాత తమ్ముఁడగు మన కవి గ్రంథము క్రీ. శ. 1550 తరువాతిదిగా చెప్ప వచ్చు. 1550 సం. ప్రాంతమువాఁడగు చిత్రకవి పెద్దన తన లక్షణ సార సంగ్రహమున లాక్షణికులఁ జెప్పుచో నెడ మన రామనను బ్రస్తావింపఁ డయ్యె. చిత్రకవి పెద్దనగారి తనయుఁడు చిత్రకవి యనంత కవి. ఇతఁడు రామరాజ భూషణుని హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు వ్యాఖ్యానము రచించె. సూరన రాఘవ పాండవీయ ద్వ్యర్థిని జూచి రామరాజ భూషణుఁడు హరిశ్చంద్రనలోపాఖ్యాన ద్వ్యర్థి రచించినట్లు, ముద్దరాజు పెదరామన రాఘవ పాండవీయ వ్యాఖ్య వ్రాయుటఁ గని యీ యనంత కవి హరిశ్చంద్రనలోపాఖ్యాన వ్యాఖ్య వ్రాసియుండఁ గాఁబోలు! ఈ యనంతకవి తనదు వ్యాఖ్యలో 'సంధి గూర్పంగఁ బ్రథమాంత శబ్ద వితతి (1-12) అను కవిజన సంజీవని లక్షణమును బ్రమాణముగాఁ జూపెను. కావున ననంతకవి వ్యాఖ్యారచనకుఁ బూర్వమే యీ కవిసంజీవని రచన జరిగియుండవలయు. అనంతకవి క్రీ. 1550-1610 ప్రాంతీయుఁ డని కవిచరిత్రకారుల నిర్ణయము. హరిశ్చంద్ర నలోపాఖ్యాన రచన వసుచరిత్ర రచనానంతరము జరిగినది గాన, నయ్యది క్రీ. శ. 1580 సం. ప్రాంతము నందలిదిగాఁ గవితరంగిణి నిర్దేశించెను. తర్వాత 1610 లోఁగా ననంత కవి వ్యాఖ్య రచించి యుండవలెఁ గాన గవిసంజీవని 1590 ప్రాంతములోనిది గా చెప్పనగు.

మఱియు నీ కవిసంజీవనిలో రాఘవ పాండవీయము (1545 సం.) పాండురంగ మాహాత్మ్యము (1560), తరిగొప్పుల మల్లన చంద్రభాను చరిత్ర (1586-1613 ప్రాంతము), పొన్నిగంటి తెలగన్న యయాతి చరిత్ర (1574-81 మధ్య కాలము) నుదాహృతములు. వీరేశలింగముగారు 'ముద్దరాజు రామన యించుమించుగా రంగరాజుకుంటి తిమ్మకవి తోడి సమకాలికుఁ డగుటచే నీ కవిలోకసంజీవనినుండి యాతఁడు తన సులక్షణసారమున నేమియుఁ గైకొనలేదు' అని కవుల చరిత్రలో వ్రాసిరి. (చూ. ద్వితీయ భాగము - ము. రామన) వారికిది నుండిన సులక్షణసారమున లేదేమో కాని నేఁడు ప్రచారములో నున్న యా గ్రంథమునఁ గవిసంజీవని పద్యములు గలవు. ఒకవేళ నవి ప్రక్షిప్తములు అయి యుండునేమో? ఇదమిత్థ మని నిర్ణయింప నలవి గాదు. ఒక గ్రంథములోని దానిని మఱొకదాని లోనిదిగాఁ జెప్పుట, పూర్వకాలిక లక్షణ గ్రంథములందు త్తరకాలిక గ్రంథస్థ పద్యములఁ జొప్పించుట యిత్యాదులగు కార్యములు తెనుఁగు లక్షణ గ్రంథములందు గోచరించుచుండును. పై పరామర్శవలనఁ గవిజనసంజీవని రచనాకాలము 1590 సం. ప్రాంత మని, కవికాలము 16 వ శతాబ్దోత్తర భాగ మని నిర్ణయింపనగును. కవినివాసాది వృత్తాంతములు తెలియు నాధారములు ప్రకృతము గానరావు. ఇఁక గ్రంథమునుగూర్చి పరిశీలింతము.

### గ్రంథసమీక్ష :

ఈ కవిసంజీవనిలో నాలుగు తరంగములు గలవు. అందలి విషయములు వరుసగా 1. యతిపద్ధతి 2. విభక్తిపద్ధతి 3. సమాసపద్ధతి 4. సంధి పద్ధతి యనునవి. అన్ని తరంగము లసమగ్రములు, లుప్తమధ్యములు. ఈ సంజీవనిం జేర్చియున్న యుదాహరించిన లక్షణ గ్రంథములు-అప్పకవీయము, అహోబల పండితీయము, సులక్షణసారము, సర్వలక్షణ సారసంగ్రహము (కూచిమంచి తిమ్మన), కవిసంశయ విచ్ఛేదము (అడిదము సూరకవి), లక్షణశిరోమణి (పొత్తపి వేంకటరమణకవి), ఆనందరంగరాట్ఛందము (కస్తూరి రంగకవి) మున్నగునవి పెక్కులు గలవు. పై లక్షణకారులు కవిసంజీవని

లోని కొన్ని లక్షణములఁ గైకొనియు మఱి కొన్ని లక్షణముల ఖండించి స్వమతముల నట నట నుద్ఘాటించియున్నారు. అవి యెల్ల సంగ్రహముగా ముందు తెల్పఁబడును. కవిజనసంజీవనిలో నీ క్రిందిగ్రంథములలోని పద్యము లుదాహృతములు - కవిత్రయ భారతము, భాస్కర రామాయణము, రంగనాథ రామాయణము, వసంత విలాసము (నాచన సోమన?), పెద్దిరాజు నలంకారము (కావ్యాలంకార చూడామణి), నైషధము, వరాహపురాణము, శృంగారషష్ఠము, మనుచరిత్ర, ఆముక్తమాల్యద, రాఘవ పాండవీయము, పాండురంగ మాహాత్మ్యము, యయాతి చరిత్ర, చంద్రభాను చరిత్ర. ఇందు భారతమునుండియే చాల వఱు నుదాహృతులు గలవు. యయాతి చరిత్ర- నూరసరాజని యచ్చుప్రతి. ఈ నూరపరాజెవ్వఁడో? యయాతి చరిత్ర కర్త పొన్నగంటి తెలగన్న. రామన యొసఁగిన లక్ష్యము లల్లే వరుస దప్పక కొన్ని పట్టులందుఁ బై లక్షణ గ్రంథములందు సంగ్రహింపఁ బడి యున్నవి. కూచిమంచి తిమ్మన యీ సంజీవని లోని విషయము లామూలాగ్రము గ్రహించి తన కున్న మతభేదములను బ్రదర్శించి యున్నాఁడు. లక్షణశిరోమణిలోని ప్రథమా శ్వాసము కవిసంజీవనీ ప్రతిబింబము. ఆనంద రంగరాట్ఛందము చతుర్థాశ్వాస పూర్వభాగము (వ్యాకరణ విషయము) నట్టిదే. ఇఁకఁ గవి సంశయ విచ్ఛేద విషయమా! కవి సంజీవని లోని పద్ధతులఁ బునరుద్ఘాటితము సేయుచు నందు లేని యితర లక్షణ విశేషములఁ దెల్పుటకే రచిత మని యీ క్రింది తత్కృతిముఖ పద్యమువలనఁ దెలియనగు.

'కవిజనసంజీవనిలోఁ
దవిలినపద్ధతులు మఱి యితరలక్షణల
క్ష్యవినిర్దిష్టగతుల్ చె
ప్పవలయు వేఱ యొక్క పద్ధతిచేతన్.
ప్రియ మందఁగఁ గవులు కవి
త్రయ సుకవిత్వానుసరణిఁ దప్పక కవిసం
శయవిచ్ఛేదన మను నా
హ్వాయ మిడి లక్షణ మొనర్తు నార్యులు
[మెచ్చన్."

కవిసంజీవనియందు వలెఁ గవి సంశయ విచ్ఛేదమునఁ దరంగములను (1, 7, 8) విభాగము లుండుట గమనింపఁదగ్గ విషయము. ఇఁక వెలుఁగులోనికి రాక మూలఁబడియున్న లక్షణ గ్రంథము లెన్ని యీ సంజీవని ననుకరించెనో!

## ఆటవెలఁది : తేటగీతి

ఆటవెలఁదు లన్నఁ దేటగీతము లన్న
మనసు కరఁగిపోవు మంచుపగిది
నాట లేక తేటపాటయు లేకున్న
వెలఁదు లున్నఁ జాలు వేవరాలు !

(ఇది శ్రీ ఆచంట సాంఖ్యాయనశర్మగారి చాటువు. సంఘసంస్కర్తగా, మహాపండితుడుగా, వక్తగా వెలిగిన శ్రీ శర్మగారి చాటువులు పెక్కింటిని శ్రీనిడదవోలు వెంకటరావుగారు సేకరించి భద్రపరచారు. వాటిని క్రమంగా ప్రకటించుతాము. —సంపాదకులు.

# శాస్త్రిగారి ఖండకావ్యాలు

శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు.

కూలంకషమైన పాండిత్యపాటవముచేతను, దానికి సరివచ్చు ప్రతిభావిశేషముచేతను బుట్టుఁ గొమ్మలై పరమపావనమైన ప్రవర్తనముచేఁ బైరెంటికిని వన్నెదిద్దఁజాలిన విద్వద్వరేణ్యులు కీర్తిశేషులు ప్రభాకరశాస్త్రిగారు. పండితాఖండలులుగా, విమర్శకశిరోమణులుగాఁ, బరిశోధక ప్రథమగణ్యులుగా శ్రీశాస్త్రిగారు సర్వాంధ్రదేశమునకును సుపరిచితులే. వయసుతో వర్ధిల్లిన యాధ్యాత్మిక తత్త్వాభినివేశముచేతను, బహు ముద్రితాముద్రితగ్రంథ పరిష్కరణ పరిశోధన ప్రవణతచేతను, సత్యముకంటె నసత్యమునే యెక్కువగాఁ బ్రకటించునని కవిత్వమునెడఁ దమకుఁగల స్థిరమైన యభిప్రాయముచేతను నధికార సామర్థ్యములు కలవారయ్యు వారు మహాకావ్యరచనమునకంతగా మనసు చొప్పింపరైరి. లేనిచోఁ "గ్రొత్త ప్రాఁతల మేలుకలయిక"కుఁ బరమోదాహరణములైన ప్రౌఢకావ్యములను సృష్టించి వారాంధ్రభాషాయోష యామూల నభినవాలంకృతుల నెన్నింటినో కైసేసి యుండెడివారే. అట్టి యలంకారముల సంపూర్ణ సౌందర్యముతో నందగించు నదృష్టము మాంధ్రికి లేకపోయినది; కాని యా సౌందర్యప్రకాశము నించించుక ప్రదర్శించు చిన్నతొడవులు కొన్ని యామె ధరింపక పోలేదు. అవి శాస్త్రిగారు జీవితపూర్వార్ధమున నప్పుడప్పు డలవోకగా రచించిన లఘుకావ్యములు. ఇంచుమించు నూఱేసి పద్యములతోఁ గూడిన యట్టి కావ్యము లేఁబదిమిది యున్నవి. ఆకృతిని లఘువులయ్యు నందచందముల నతిప్రౌఢములైన యాకృతులఁ బురస్కరించుకొని శ్రీశాస్త్రిగారి కవితాప్రతిభను ప్రదర్శింప యత్నించెదను.

కావ్యమునకాలంబమైన కథావస్తువు నెన్నుకొనుటలో శ్రీశాస్త్రిగా రనుసరించు పద్ధతి విశిష్టమైనట్టిది. సాధారణముగా వారు యథార్థముగా జరిగినదియుఁ, దాము చూచినదియునైన విషయమునే కథావస్తువుగా గ్రహించుచుందురు. ఒక్క 'కపోత కథ'లోఁ దప్పఁ దక్కిన కావ్యము లన్నింట వారు తాము స్వయముగా నెఱింగిన విషయములనే వర్ణించియుండిరి. చిన్ననాఁటి చేష్టలు కేవలము వారి స్వానుభవమే. 'విశ్వాసము'నందలి కథ వారు ప్రత్యక్షముగా దర్శించినట్టిది. 'కడుపుతీపు,' 'దివ్యదర్శనము,' 'మా నాన్నగారి ముచ్చట' యను వానియందలి కథలును గల్పితములైనవి కావు. వానిని గూడ వారు కనినవో, వినినవో యథార్థము లని విశ్వసించిన పిమ్మటనే గ్రంథస్థములఁ గావించిరి. మా నాన్నగారి ముచ్చటలో "యథార్థమైన యొక గాథార్థంబు వ్రాయ వ్రేఁగా నారంభించితి"ననియు, దివ్యదర్శనమునఁ "జెప్పెదన్ నిజము పెంచి సమంచితమైన సత్కృతి"ననియు గ్రంథారంభముల వారే వ్యక్తము చేసియుండిరి. కల్పితకథలు కృత్రిమములై సత్యదూరములుగా నుండుననియు, జరిగినకథలు సహజసుందరములై పఠితలకు రసానందమును నీతిబోధను జాలఁ గొలుపుననియు వారికి మాఱని యభిప్రాయము. అందుచేతనే కల్పితములను, సత్యదూరములును, నూహామాత్ర సాధ్యములునైన కథలతోఁ గూడిన కావ్యము లన్న వారి కంత సంతసము చేకూరెడిది కాదు.

సంస్కృత లాక్షణికులు కావ్యప్రయోజనము నుగ్గడించు సందర్భమున "సద్యః పరనిర్వృతి"తో పాటుపదేశమునకుఁ గూడ నొక్కింత ప్రాధాన్యము నొసంగియుండిరి. ఆనందోపదేశములే (To teach and delight) కావ్యప్రధాన ప్రయోజనము లని పలువురు పాశ్చాత్య విమర్శకులును దలంచియుండిరి. శ్రీశాస్త్రిగారి కావ్యము లన్నింట నీతిబోధ నిండి నిబిడీకృతమై యుండును. వాస్తవమున వాని సృష్టికి మూలకందమైనది నీతిబోధన ప్రవణతయే. వారు 'దివ్యదర్శనము' వ్రాయుటకుఁ "దత్త్వ విస్ఫురణము లోకమందుఁ బరిపూర్ణము కాఁగలదన్న వేడ్క పొంపిరి గొనుట"యే ప్రధాన కారణము. మా నాన్నగారి ముచ్చటకు బీజము "ఆరంగూరిన కూరిమిం జెలఁగు భార్యాభర్త లేతత్కథాపారం బారసి మేలు

నవవ యిల్లాలు కృష్ణలో స్నానము చేయుచు 'అర్ఘ్యమిడి సూర్యునకు, హాగహాని యాటంము ముకుసెవుల్ మూసికొని యామె మునుక గొనఁగ' నొడ్డున నున్న పిల్లలు 'మునిఁగె మా యమ్మ యయ్యయో మునిఁగె'నని తందర బిందరగుటయుఁ, బని యంతయు ముగించుకొని యామె నిద్రపోవుటకు వచ్చి పిల్లలను జూచి 'అమ్మ యమ్మ యాటం చెప్పు డమ్మ'కొంటె రోదనం బాయె నే మూరుగో కదమ్మ అమ్మ లేకున్న'నని యుమ్మలించుటయు నామె పిల్లలను వియోగసముద్రమున ముంచి మరణింపఁబో నున్నదను భావ్యర్థమును సూచించుచున్నవి. దివ్యదర్శనమున బ్రాహ్మణునకు భోజనము పెట్టుటకు ముందు గృహిణీవేషమున నుండిన కనకదుర్గ వైవసాయత్యాగము కలుగ లేదని నిరుత్సాహుఁడై పరితపించు నాతనితోఁ జెప్పిన వాక్యము లన్నియు నర్థప్రాయ గర్భితములై యొక చమత్కారమును బ్రదర్శించుచున్నవి. ఆమె గృహిణి యని బ్రాహ్మణు నర్థప్రాయము కాని నిజమున కామె సాక్షాత్కనకదుర్గయే. ఈ యంశమును బురస్కరించుకొని మాచినచోఁ 'బ్రత్యక్షంబైనది నీ కొకింత, యట మాకై యింక నేమున్నది' 'కానన్ రాదనె దామె నీ యెదుర సాక్షాత్కారమై నిల్చినన్' అను వాక్యములందలి భావగాంభీర్యము వ్యక్తమగును.

వస్తువులతో వ్యక్తులతో యుండు వ్యత్యాసమును దేటపఱచుటకై శ్రీ శాస్త్రిగారు ప్రదర్శించు ప్రతియోగ ఘట్టము లద్భుతావహములుగా నుండును. విశ్వాసములో నిజమునకుఁ జేదరి ప్రక్కఁ గూర్చుండిన యల్లుని వృత్తాంతమునకును బ్రధాన కథా విషయమునకును సంబంధము లేశమైనను గానరాదు. కాని యది విశ్వాస నిధానమైన యాశ్వాసము ప్రవృత్తికిని సాధారణ మానవ ప్రవృత్తికిని గల భేదము సూచించుటకై యుద్దేశపూర్వకముగా నందుఁ బ్రవేశపెట్టఁబడినది. రైలు కదల మొదలిడఁగానే బ్రాహ్మణ యువకునిఁ జూడ వచ్చిన యత్తమామలతో నాతని పడుచు పెండ్లాము కూడ వెడలిపోయెను. ఉప్పరీని విడువఁజాలక యొట్లో స్టేషనుకు వచ్చిన యాతని శ్వానము మాత్రము యజమానుని యెడఁబాటు నోర్వఁజాలక రైలుబండితోఁ గూడ గుక్కఁబట్టి పరుగిడ మొదలిడెను. మానవులకును శ్వానములకును నుండు విశ్వాసములకుఁ గల తారతమ్యము నీ ఘట్టమెంతో చక్కఁగా వ్యక్తము చేయుచున్నది. ఉప్పరి తిరునాను గుక్కకును గల సంబంధమును వివరించుచు 'చావు తప్పించెనండి యీ దొడ్డ కుక్క నాకు బిడ్డలకును. మనిసి బుద్ధికంటె మా దొడ్డ బుద్ధండి, ముసలదండి యెప్పుడు మమ్మ విడిచి' యని చెప్పినప్పుడా తారతమ్యము మఱింత సుస్పష్టమగుచున్నది.

శ్రీ శాస్త్రులుగారి వర్ణనములు గాంభీర్యమునకు నెలవులై సహజసుందరములుగా నుండును. వారి కథ లన్నింటికిఁ దావలమైనది 'కృష్ణాతరంగిణీ తీరస్థితాంధ్రపల్లెలక్ష్మి.' ఆ ప్రాంతము లనే వారు పఠితలకుఁ బ్రత్యక్ష మగునట్లు వర్ణించి యుండిరి. ఆ తావు లన్నియు వారి జీవితముతో సన్నిహిత సంబంధము కల వగుటచే వారు సూక్ష్మాంశ వివరములతో వానికిఁ గావ్యములందు రూపకల్పనము కావించిరి. 'పల్లెటూరు మాది పశువులు, పైరులు, చెట్లు, చెలువు, కృష్ణగట్లు, గఱువు బైళ్లు, గుళ్ళు, పెంకుటిళ్లును గలవంటె' యను వర్ణనము చదువునప్పుడు కృష్ణాతీరమునందలి గ్రామశోభ ప్రత్యక్షము కాక మానదు. కడుపు తీపులో నవవ దంపతులు కృష్ణాతీరమును వీడి దక్షిణదేశమున కరుగవలెనని నప్పుడు చింతా పూర్వకముగఁ గావించిన వర్ణనలు సత్యములును సహజములునై యా ప్రాంతమందలి పాడిపంటలను, ప్రకృతి సౌందర్యమును, బ్రజల మనఃప్రవృత్తులను జక్కఁగా వ్యక్తము చేయుచున్నవి. చిన్ననాఁటి చేష్టలలోఁ గావింపఁబడిన యుత్సవ సమయమునందలి పక్షిగణకౌశ వర్ణనము నిసర్గ మధురమై యున్నది. ఉత్సవదిదృక్షాగత జన సముదాయముల కోలాహలముచే నా పల్లెటూరు 'తెన్నును దీరు నెఱుఁగరాని మాఱుటూరై'యెను. 'సర్కసు సందెంచె, నాటకశాల వెలసె, పత్తి అంకుల రాటంబు, హెచ్చె లాటరీలు, మఱి బొమ్మలాటలు చాలఁ గలిగె, గొందెకనులౌట పాలకయుండె నాకు' నను పద్యము శ్రీ శాస్త్రిగారి నిశిత పరిశీలనమునకుఁ దార్కాణముగా నున్నది. దివ్యదర్శనములోని కనకదుర్గాలయము చెంతఁ గల వివిధ జనుల

వ్యగ్రలై గృహకృత్య నిర్వహణము సేయని గరితలపై శాస్త్రిగారికిఁ గల యేవగింపింతింతన రానిది. సంపద్గర్వముచేతనో లేక లేమిచేతనో పతి శుశ్రూష కిల్లాం ప్రతినిధులను—అందును యువతులైన పరిచారికలను—నియోగించుట వారి కాపురమునకే కడగండ్లు తెచ్చు నని శాస్త్రిగారి యభిప్రాయము. "కుచసంపన్నత తూలిపోవు ననియో, కొవ్వారు మైసారు వింత చమత్కారము లంతరించు ననియో స్తన్యంబు లేకుండ గుబ్బచనుల్ దిబ్బలుగా నొనర్చుకొని డబ్బాపాలచే నిష్ఠపుత్రచయంబుం బెనుమార్చు" మాతలు మాతృనామమున కర్హలు కారనియు వాని గాలిమూతలుగా భావింపవచ్చు ననియు శాస్త్రిగారి నిశ్చయము. దివ్యదర్శనమున శాస్త్రిగారికి సాధనరొయిడను దివ్యములైన స్వప్నముల రొయిడను నభిప్రాయము తేటతెల్లము చేయఁ బడినది. మృష్టమును మిష్టమునైన భోజనమును శ్రీనాథునివలెనే శాస్త్రిగారును నభిమానముతో వర్ణించుచుందురు. "పనసగూడ పేచి పచ్చి మిరెపపండ్లు నుక్కలించి పోసి యూరనిచ్చి కొంత కొంత పాగిపికొను గోగుపచ్చడి చవికి నింక నోరు చివికితీరు" ననునది కడుపు తీపులోని దంపతులకే కాక శాస్త్రిగారికిఁ గూడఁ గల నిశ్చితమైన యభిప్రాయము.

ఇంక శాస్త్రిగారి భాషాశైలులను గూర్చి యించుక వచించి యీ వ్యాసమును ముగించెదను. సంస్కృతభాషపై నెంత యభిమాన మున్నను శాస్త్రిగారు సాధారణముగా దీర్ఘసమాససంఘటనమునకై యత్నము చేయరు. వారి రచన జాతీయములును మృదుమధురములును శ్రవణపేయములునైన పదజాలములతో మకరందప్రవాహమువలె సాగిపోవుచుండును. వారి పద్యము లన్నియు ధారాశుద్ధికిఁ బెట్టినది పేరు. వీనులకు వికటముగానుండు కుంటినడక యెచ్చటను గానరాదు. అపశబ్దములకుఁ గాని యనుచిత్యాడంబరములకుఁ గాని చోటీయక వారికవిత యాభిజాత్య సంపన్నయైన యిల్లాలి కీర్తియుల రాగుచుండును. మహాపండితు లయ్యు శాస్త్రిగారు శబ్దప్రయోగమున నెంతో విశాల దృష్టి వహింతు రనుటకు వారు నెడనెడ వాడు చుండునన్యదేశ్యపదములును, వ్యవహారయోగ్యము లైన యాంధ్రపదములును నిదర్శనములు. 'ప్రవాహినీ దేశ్యా' ''సిద్ధిర్లోకాద్వశ్యా'' యను సూత్రముల యంతరార్థమును వారివలె గుర్తించిన వా రెందరో యుండరు. పూర్వకవుల కావ్యములందలి పద్యములును వారందుఁ గావించిన యపూర్వప్రయోగములును శాస్త్రిగారికి జిహ్వాగ్రస్థితములై యుండును. వారట్టి యపూర్వప్రయోగములను జక్కఁగా వాడి చూపుచుందురు. ఇంటామె, తెల్లంద్రాచు, ఊరగందము, ఉత్తరించిపాలు మున్నగు ప్రయోగము లందుకుఁ దార్కాణము. వారి పద్యము లొక్కొక్కటి యొక్కొక్క సుప్రసిద్ధ పూర్వకవి కావ్యమందలి పద్యములను జ్ఞప్తికిఁ దెచ్చుచుండును. దీని కన్నియేని ఉదాహరణములు కలవు. దివ్యదర్శనమునందలి విజయవాడను వర్ణించు రెండవ సీసపద్యము మనుచరిత్రయందలి హిమవద్వర్ణనపరమైన పెద్దనగారి సీసము నందమును బడిక పుచ్చుకొనుచున్నది. నిజమైన క్రొత్త ప్రాతల మేలుకలయిక శాస్త్రిగారి కవిత్వమునం దెన్నియో తెఱంగుల గోచరించు చుండును. వారి కవిత్వమును జదువునప్పుడు పవిత్రమైన పూర్వకాలమున నివసించుచు నాధునిక సౌకర్యముల నన్నింటి ననుభవించుచున్నట్లుండును. వారి భాష సలక్షణమును సప్రమాణమును; వారి భావసంపద స్వతంత్ర సుందరము; వారి రచనక్రమ మౌచిత్యశోభితము.

శాస్త్రిగారికి వృత్తములందువలెనే గేయము లందును ప్రీతి హెచ్చు. సంగీతమునం దంతగాఁ బ్రవేశము లేనివారయ్యు వా రెప్పుడు నేదో గేయమును బాడుచునే యుండెడివారు. తిరుప్పావై-సప్తపదుల తెనిఁగింపులో వారికి గేయములతోఁ గల యపార పరిచయము వెల్లడి యగును. ఆ సప్తపదులను వా రెంతో మృదుమధురముగ నడపించినారు. వారి కావ్యములలో రసానుగుణమైన ఛందఃప్రయోగము కనిపించును. వృత్తము లన్నియు వారికి వశవర్తులే యయ్యును శార్దూలమును వాడుటయందు వారికిఁ బ్రీతి హెచ్చు. కడుపుతీపులో తూలెం గొంపలు, ఘోరక్రూర విహారగంబు అనుపద్యములు రసానుగుణములై మిక్కిలి యింపు నింపుచున్నవి. సీసపద్యరచనలో వారి శ్రీనాథ శిష్యత్వము సర్వతోముఖముగా గోచరించును. గీతములలోఁ దేటగీతి కన్న నాటవెలఁది వారి కెక్కువ ప్రీతికరము. విశ్వాసమునను, చిన్ననాటి చేష్టలందును బెక్కు పద్యము లాట

# గాథాసప్తశతి

## కొన్నిగాథలకు శాస్త్రిగారి అనువాదములు.

(1925 సం॥ ప్రాంతములందు శ్రీ శాస్త్రిగారు గాథాసప్తశతినుండి తెనిఁగించిన కొన్ని పద్యము లివి.)

కాళ్ల నీడఁ బడి మగఁడు వేఁడుకొన వీపు
గుల్ల యెక్కి యాడెఁ గుఱ్ఱవాఁడు
అట్టె యేర్పడ నాగ్రహము కొల్లగిల్ల యి
ల్లాలి కింత నవ్వు గాలువారె.

వండు నని చేయుచో మసి యంటుకొనియె
నేమొ చే యాది యిల్లాలి మోము నోక
ఉల్లసము నొందె నది గాంచి వల్లభుండు
నెచ్చెలీ ! యప్పనెల నీకు నెమ్మొగ మని !

ఏవి యేవి నీకు వేవిళ్ల కోర్కులు
చెప్పు మనుచు గ్రుచ్చి చెలికు లడుగ
నపతి చెల్వునయ్యకొ యొర్మలి మాఱ్కులు
మోడ్చెఁ గ్రొత్తమోలు మూడ్తరాలు.

మంచిమనసు లేనిమాఱఁడికి దినదిన
మోపి కులవధూటి చూపి నెప్పా
నిమిషములంగు వ్రాసుకొనుచు యున్న గామల
క్ష్మణుల కూర్మి, తమ్మ మంచివడత.

విప్రయోగ మార్గ వీలగు వేళ్లె
నదుఁ గిలయు నేర్పు మనేనాని
ఇర్వుఁ గొక్కు యూసి నేయుండి వివాహమ్ము
...ము టన్న హెచ్చు చావుకంటె.

పట్టుపగ తెంటి యొండకు బిట్టు జడిసి
వాకిటఁ దలమూప కొడలిలో మాఱఁగియుండె
నీడ స్థితిము తెరువరి! నీవు విడక
బాటు నడిచెగు విశ్రాంతిఁ బడయ వేల?

చెడ్డనడత కంటెఁ బడ్డది, వేర్వాసెఁ
జెక్కు, మరల నంటనిల్లుఁ గాక
నీకు గ్రాఁగెఁ, జల్లవానను గా, కింకఁ
దొంటి తియ్యఁదనము దొరకు నేమి?

తనమగండు గండ్ర వెనుకముం దరయఁడు
మాఱఁడి యింటఁ జెడ్డమనసు వాఁడు
వెల్లడింప కొదియు నిల్లాలు గుణవతి
నలఁగుచున్న దిల్లు నిలుపుకొనుక.

కాలుకొన్నవి వింధ్యశిఖరము లవి ద
వాగ్ని దరికొని కాల్ప గ్రీష్మాతపమున
గ్రొత్త కెంమ్మబ్బు లవి కావు పొత్తరీ! ది
గుల్వడకు దూర మరిగిన చెల్వకొఱకు.

మన తెలుంగు నెయ్యురతోడ మంతనంపుఁ
గర్జముల్ సాగకున్న సౌఖ్యమునె కూర్చు;
వేలు తీసైన వారితోఁ దారసిలిన
కర్జములు సాగె నేమి సంకటమె కూర్చు.

గోపరాగముల్ రాధకన్నులఁ బోలందు
గాలిపుక్కిళ్ల నూది పోకడఁచుచుంటి
వంతె కా దింక కృష్ణ ని న్నంటి వచ్చు
గోపరాగమ్ము లట్టు పోఁగొట్టుకొంటి.

ఎంత వృద్ధి గాంచె నేనియుఁ దనసొమ్ము
చేత లోభి సుఖము చెందలేఁడు
మంచు టెండ మాడుచుండ గ్రోవరి తన
యొడలి నీడఁ దనువు నొందనట్లు.

హెచ్చె నెల మాఘమాసము వచ్చె ననుచు
దుద్దుఁ గంబడి తెగ నమ్మి యొద్దుఁ గొనియెఁ
జలికిఁ బొంగ నేని కుంపట్లు గలవు తనకుఁ
గొలము ఓగినన్ను లనుత్పత్తి నేద్యగాఁడు.

కోపగింపఁడు సుజనుఁడు కోపగించె
కోపగించెనే చెడఁ జెప్పఁగను వెలఁపఁడు
తలఁచుగా కొక్కప్పుడు తప్పిదారి, నోర
నొగ్గు వల్కఁడు; పల్కెనే సిగ్గుపడును.

అది ఘనముచేత నెది గాఁ, పతఁడు సఖుఁడు
కష్టములయం దెవఁడు చేయూఁత యుండు
నది సురూపము గుణము లెంపెసరియుండు
నది యొఱుక ధర్మచింత లెందొదవియుండు.

జీబుగా నేలపై రాలెఁ జిల్కముక్కు
లట్లు పూవులు మోదుగు చెట్లక్రింద
కావిపాటులతో బుద్ధదేవు నదయు
గమ్మ కడ వ్రాలు భిక్షుసంఘమ్ము లనఁగ.

కొట్టమున మందలో నాకొం టెయావు!
గంటి వటె దాని సౌభాగ్యగర్వ మెంతో!
గురుసుటాఁబోతు కొనగొమ్ము నొరసి పరిహ
రించుకొనుచున్నదే! కంటె నెప్పుడురద.

ఆర్తకులముల కడగండ్ల నడఁచి సమ్మ
దములు వొందింప నిర్మారె తగినవారు
సర్వమంగళాధిపుఁ డైనశర్వుఁ డొకఁడు
శాలివాహనుఁ డనుమహిజాని యొకఁడు.

# కట్టుకథలు

వే. ప్రభాకరశాస్త్రి

[శాస్త్రిగారి పాండితి తెలుగులో నెంతటి తలస్పర్శి అయిందో సంస్కృత ప్రాకృతాలలోనూ అంతటిదే! వేద బౌద్ధయుగాల సాంఘికవ్యవస్థకూ, నేటి పరిస్థితులకూ గల సాదృశ్య వైదృశ్యాలను తెలుపుతూ శ్రీ శాస్త్రిగారు పెక్కు వ్యాసాలు రచించినారు. ఉపనిషత్తుల కథలకూ, నేటి జానపదగాథలకూ గల పోలికలను తెలుపుతున్న యీ వ్యాసాన్ని మచ్చుకు ఇక్కడ ప్రచురిస్తున్నాము.]

—సంపాదకులు.

సదాత్మకుడై ప్రేమరసికుడైన పరమ పురుషుడు అసదాత్మకురాలై చెప్పినట్లు వినక అడ్డదిడ్డాలాడే గయ్యాళిప్రకృతిని వలచి వలపించి లోబరుచుకొని తనతనమును ప్రకటించుకొనేటందుకు చేసే విశ్వప్రయత్నమంతా ఒక కట్టుకథే. శబ్దబ్రహ్మవివర్తంలో ఆద్యసృష్టులయిన వేదాలలో, ఉపనిషత్తులలో, కట్టుకథలన్నీ, పిట్టకథలన్నీ, నేడు మనం వాకొనే రచనలెన్నో ఉన్నవి. తైత్తిరీయ సంహితలో—ప్రజాపతి రకామయత, ప్రజాః సృజేయేతి...ఇత్యాదిగా ఒక చిన్నకథ.

ప్రజాపతి ప్రజలను సృజింపవలెనని కోరికతో ఒక సృష్టి చేయగా ఆ సృష్టి పాములయి నేలకన్నాలలో దూరిపోయినవి. రెండోసారి యింకో సృష్టి చేయగా అవి పక్షులై పైకెగిరిపోయినవి. మూడోసారి సరిగా మనుష్యులనే సృష్టించినాడు. ప్రజాపతి అనుభవాల మీద సృష్టిలోపాలను గుర్తించుకొంటూ దిద్దుకొంటూ ఉత్తమ సృష్టి చేస్తూ ఉన్నాడనడానికి ఈ పాముల పక్షుల కథ.

ఋగ్వేదంలో మండూకసూక్తమని కప్పల కట్టుకథ ఒకటి ఉన్నది. వానలు లేక వాగులు వంకలు ఎండిపోయే వఱపుదినాలలో పామర బాలకులు కప్పకాళ్లు కట్టి నీళ్ళకడవలో పెట్టి పసుపు కుంకుమలతో కప్పను ఊరేగిస్తూ పాట పాడుతారు. తుదిముక్కే జ్ఞాపకం ఉంది.

కప్పాకప్పా నీళ్లాడే
కడవల్నిండా వానా కురిసె
ముట్టో వానదేవుడా.

ఇదే ఋగ్వేదంలోని కట్టుకథ. శరదృతువునుండీ బొరియలలో మారి నానాటికీ ఎండి పోతూ ఉండే కప్పలు సంవత్సర సత్రం చేసే బ్రాహ్మణులవలె పర్జన్యప్రీతిగా అనూక్తం జపిస్తూ ఉంటవిట! ఆవులు చేరరాగా లేగలవలె, వానలు కురియగా అందాకా ఎండలలో ఎండి పోతూ ఉండే కప్పలు నీళ్ళలో తేలుతూ అరుపులు సాగిస్తున్నవి. ఒకకప్ప ఇంకోకప్పను పట్టుకొంటున్నది. వానలు కురుస్తూంటే రెండూ సంతోషిస్తూ నీళ్ళలో దాటులు వేస్తున్నవి. గురువుపదేశిస్తూ ఉంటే శిష్యులు సంతచెప్పుకొంటున్నట్లు ఒక కప్ప కూస్తూ ఉంటే తక్కిన కప్పలన్నీ దాన్ని అనుకరిస్తున్నవి. వానలు కురియడంచేత ఎండిపోయి గడ్డలు కట్టుకొన్న శరీరాలు నిండారగా నీళ్ళలో కప్పలు దాట్లు కొట్టసాగిస్తున్నవి.

బావురు కప్పలు, గోంగ్రు కప్పలు, మచ్చల పచ్చకప్పలు, రకరకాల కప్పలు అన్నీ ఒకటై శ్రుతి కలిపి అరుపులు సాగిస్తున్నవి. అనూక్తంలో తుదిముక్కకు ఛాయ.

మేకకూతల కప్ప మేటిసిరు లిస్తుంది
ఆవుకూతలకప్ప ఐశ్వర్య మిస్తుంది
గోంగ్రు కప్పిస్తుంది గోజాతి నోషధులు
పొలనా, వర్షాకాల మలరారగా మాకు...

ముండకోపనిషత్తులోని పిట్టకథ ఒకటి వినండి.

ద్వాసుపర్ణా సయుజా సఖాయా
సమానం వృక్షం పరిషస్వజాతే।
తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి
అనశ్నన్నన్యో అభిచాకశీతి.

సొగసయిన రెక్కలుగలవై కలికారముతో జంటగూడి రెండు పిట్టలు ఒక రావిచెట్టు నంటి పట్టుకొని ఉన్నవి. ఒక పిట్ట ఆ చెట్టు పండ్లు నారగిస్తున్నది. ఇంకోపిట్ట ఏమీ ఆరగించకుండా చూస్తూ ఆనందిస్తున్నది. శరీర మనే చెట్టున జీవేశ్వరులనే రెండు పిట్టలుండడం, జీవుడనేపిట్ట కర్మానుభవాల ననుభవిస్తూ ఉండడం ఈశ్వరుడనే పిట్ట సాక్షిమాత్రుడై చూస్తూ ఉండడం దీనితత్త్వార్థము.

ఇంకో కథ :—

జానశ్రుతి అనేరాజు ప్రజలకందరికీ సర్వార్థాలుత్యాగంచేస్తూ మహాధర్మాత్ముడుగా ఉండినాడు. ఒకనాటి రాత్రి ఉప్పరిగపై ఆకసం చూస్తూ హాయిగా అతను శయనించి ఉండగా రెండు హంసలు మీదినుండి వెళ్లుతూ జరిపిన సంభాషణ రాజు విన్నాడు. ఒక హంస 'ఓయి! అటు పోకు. అదిగో జానశ్రుతి త్యాగతేజస్సు స్వర్గం ముట్టుతూ వెలుగుతున్నది. దాన్ని ఢీకొంటే రెక్కలూ మనమూ మాడి పోతాము.

రెండోహంస— 'ఇతడేమి సర్వధర్మవేది అయిన రైక్వమహర్షయా? ఈతడు త్యాగధర్మమే ఎరుగన్నాడు. బ్రహ్మవిద్యాభ్యాసం చేసి దానివల్ల రైక్వుడు సర్వధర్మములూ ఎరుగున్నాడు. ఆయన తేజస్సు ఢీకొనరానిది' అన్నది. ఆసంభాషణ విన్నరాజు మర్నాడు రైక్వుణ్ణి వెదకించి నగరాలలో పట్టణాలలో గాక అతడొకమునిపల్లెలో బండిక్రింద కూర్చుండి చేతివ్రేళ్లచిడుము పొక్కులు గోకుకొంటూ ఉండగా గుర్తించి ఆయనకు తనకూతుర్ని గోవులను ఊళ్లను ఇచ్చి సంవర్గవిద్యను ఆయనవల్ల ఉపదేశం పొంది తానూ సర్వధర్మజ్ఞుడైనాడు.

వాల్మీకివ్యాసాదుల యితిహాసపురాణాదులలోను హాల, గుణాఢ్య, కాళిదాస, భవభూతి, విష్ణుశర్మ ప్రభృతి కవీశ్వరులకావ్యాలలోను, చెట్టుకథలు, పిట్టకథలు మాత్రమేకాక అద్భుతమయిన కట్టుకథలింకా ఎన్నో ఉన్నవి. మనుష్యపాత్రలను గొని కథ కట్టడంకంటే చెట్లమీద పిట్టలమీద జంతువులమీద కథలు కట్టితే అవి చాలా ఆహ్లాదకరంగా ఉంటై. విద్యావివేకవంతులయిన మనుష్యులను తమకంటె తక్కువ తక్కువ యోగ్యతలుగల, జంతువుల, పిట్టల, చెట్ల చేష్టలూ, అవి వెలయించే భావాలూ, సూక్ష్మసుకుమారములై పసిపిల్లల చేష్టల వలెనే ముద్దులు ముచ్చట్లు గొల్పుతూ చిత్తములలో సంస్కారములను స్థిరముగా కల్పించి చక్కదిద్దగల్గునవి.

వాల్మీకి మహర్షికి తన హృదయక్షేత్రం కవితారసార్ద్రమై పదనుదేరి కవితాంకురములు మొలవడానికి ఆదనుకెదకుతూ ఉండగా కటిక బోయవాడొకడు రెక్కతార్పుతో కవగూడి కామవిలాసంలో ఉండే క్రౌంచపిట్టల జంటలో మగపిట్టను ఉండేలుదెబ్బతో చావగొట్టడం, కువకువ గోలపెట్టి రోదిస్తూ ఉండే పెంటిపిట్టను చూడడం అప్పుడు పుట్టిన శోకమే శ్లోకమై నోట వెల్వడడం దానినుండి రామాయణ మహాకావ్య ప్రవాహం పొర్లివారడం జరిగింది. రామాయణంలో సీతావిరహము వర్ణించినప్పుడెల్లా వాల్మీకి చెవులలో పెంటిక్రౌంచ కువకువ ధ్వనులు గోచరిస్తూనే ఉండినవి కాబోలును. పై పిట్టకథ సంస్కృత కవితా సరస్వతికి ప్రసవిత్రి అయి ప్రఖ్యాతి గన్న కరుణకథ.

ఆర్యేతిహాసాలలో మత్స్యకూర్మాంజనేయ గరుత్మదాదుల కథలు, బౌద్ధజాతకేతిహాసములలో మహాకపి, పారావతాదుల కథలు, అట్లే జైనతీర్థంకరేతిహాసములలో యింకా ఎన్నో హృద్యమయినవి, కట్టుకథ లనదగినవి కానవస్తున్నవి. "అత్రాప్యుదాహరన్తీమమితిహాసంపురాతనమ్" అంటూ భారతంలో ధర్మోపదేశపరము లయి ఉన్న పిట్టకథలకు, కట్టుకథలకు ఆకరములు ఏవేవో యెరుగరాదు. కొన్ని కథలు వేదాలలోనివయి ఉంటవి. అనేక కథలు వ్యాసులవారే కల్పించి ఉంటారు. భారతంలోని కట్టుకథలనుగూర్చి సరియయిన పరిశీలన మెవ్వరూ యింతవరకు జరపినట్టు కానరాదు.

భారతంలో లుబ్ధకపోతోపాఖ్యానం, ధర్మవ్యాధోపాఖ్యానం మొదలయిన కథలు ఒకసారి చదివితిమా మరి జన్మమున్నంతదాకా వాటిని మఱవజాలము. చిత్తవృత్తులను శిక్షించగల పై కథలను నా పసితనంలో చదివి చదివి ఎన్నో నాళ్లు వాని మననంలోనే మునిగిపోయినాను. భాగవతపు కట్టుకథల విశేష మేమంటే అవి వినోదమాత్రఫలములూ, బలవంతాన ఏదో పరమార్థము తేల్చుకొని ముడిపెట్టుకోవలసినవీ కాక, ఆదినుండి అంతందాకా ధర్మోద్బోధ

న్యూర్తితోనే పతితలకు మెలకువలు గొల్పుతూనే ఉంటవి. బౌద్ధజాతకకథలూ అలాటివే.

బుద్ధుడు అహింసా, త్యాగ, సత్య, దయాద్యుత్తమగుణముల పారమ్యం పొందడంలో ఒక్కొక్క గుణపారమ్యానికీ ఎన్నెన్నోగా చాలా జన్మ లెత్తినాడట అందు జంతుజన్మలూ, పక్షిజన్మలూ, వృక్షజన్మలూ కూడా ఉన్నవి. జాతకకథ లంటే అవే. అమరావతి, నాగార్జునకొండ, సారనాథము, కాంచి మొదలయిన ఆజాతకకథలు ఆనాడే శిల్పచిత్రమై వెలసినవి.

ధర్మపాలుడనే బౌద్ధాచార్యుడు కాంచీపురంలో నివసిస్తూ త్రిపిటకాలకు వ్యాఖ్యలు రచించినాడట. అందు ఆంధ్రార్థకథలు చేర్చినాడట. ఆంధ్రార్థకథల విషయం సమంతపాసాదిక అనే బౌద్ధగ్రంథంలోనూ జాతకకథలలోనూ కానవస్తున్నది. బుద్ధుడూ తచ్ఛిష్యులూ రచించిన గ్రంథాలలోని ఒక్కొక్క గాథాపద్యరచనకూ ఒక్కొక్క అర్థకథ ఉంటుంది. ఆ గాథ ఎవరికోసం ఏసందర్భంలో ఎప్పుడు ఎవరు రచించినదో తద్వివరణలో ఒక్కొక ధర్మోద్బోధమునకూ దృష్టాంతంగా అర్థాంతరన్యాసంగా ఒక్కొక్క కథ ఉంటుంది.

ఆ కథలు కొన్ని అనుశ్రుతంగా ఆంధ్రదేశంలో వాడుకలో ఉండేవి కొన్ని ఆగాథారచనకు కారణంగా అప్పుడే జరిగినవీ, కొన్ని కల్పితము లయినవీని. ఆర్యదేవుడనే బౌద్ధాచార్యుని చతుశ్శతిక అనే నన్నూఱుగాథల బౌద్ధధర్మ గ్రంథానికి నన్నూఱు అర్థకథలూ ఉన్నవి. ఆర్యదేవుని ఒతాథస్మము గుంటూరు జిల్లా నందూరిలో దొరకింది. కనుక ఆయన గ్రంథానికి సంబంధించిన అర్థకథలు ఆంధ్రార్థకథలే అవుతవి. అందులో చాలా గొడ్లకాపరుల కథలూ, పనిపాటలవారి కథలూ ఉన్నవి.

హాలుని గాథాసప్తశతిలోని యేడ్నూఱు గాథలూ యేడ్నూఱు కట్టుకథలే.

మహాకవుల కావ్యాలు చాలా కట్టుకథల పుట్టలే. కాళిదాసు మేఘసందేశములో కథానాయకుడు యక్షుడు తొలకరి మబ్బుద్వారా తొయ్యలికి కబురు పంపడం వట్టికట్టుకథ కదా విప్రలంభ శృంగారపు ముచ్చటలలో మునిగి కాబోలు కాళిదాసు ఆకట్టుకథ కట్టినాడు. పేరికి లఘుకావ్యమైనా అది రసికాస్వాద్యతలో మహాకావ్యమే అయింది. కాళిదాసు మూడునాటకాలూ చాలామట్టుకు కట్టుకథల పుట్టలే. తుమ్మెద శకుంతలముఖాన్ని పద్మమనుకొని దానిపై వాలడం, చీకాకుతో శకుంతల చెలికత్తెల సహాయం కోరడం వారు దుష్యంత మహారాజు సహాయం వేడుకోమనడం; వీరాధివీరుడు దుష్యంతు డంతట నేను రాజ్యమేలుచుండగా ఎవరురా ముగ్ధలయిన ముని కన్యలకు బాధకలిగించేవాడూ? అంటూ కామసంగ్రామరంగానికి ప్రవేశం చేయడం ఎంత వింత కట్టుకథ! గండుతుమ్మెద యిక్కడ కామవిజయానికి ఎలగోలు సైనికు డైనాడు. విరిసిన పువ్వు దొప్పలో తుమ్మెదదంపతులు కలిసి మధుపానం చేసినారట. యువదంపతులకీ తుమ్మెదల చెయ్దమెంత సంతోషము గొల్పుతుందో కాళిదాసె ఎరుగును.

భవభూతి కట్టిన కట్టుకథ...ఇది. శ్రీరాముడు పన్నెండేళ్ళు అరణ్యావాసంలో సీతతో నివసించిన అడవిపట్టుకు పాతికేళ్లయింతర్వాత మళ్లీ వస్తాడు. ఈ రావడం సీతను ఒంటరినిగా అడవులపాలు చేసిన తర్వాత. అక్కడి వనదేవత సీతాత్యాగవార్తకు దుఃఖిస్తూ రామునికి ఆయా ప్రదేశాలన్నీ ఎఱుకకు తెస్తుంది. రాముడు పరవశుడై నిలువజాలకుండగా ఇక్కడ కూర్చోమని ఒక రాతిబండ చూపి అంటుంది...

ఏతత్తదేవ కదళీవనమధ్యవర్తి
కాంతాసఖస్య శయనీయశిలాతలం తే
అత్రస్థితా తృణమదాద్బహుశో యదేభ్య
స్సీతా తతో హరిణకైర్న విముచ్యతేస్మ...

ఆనాళ్ళలో అరటితోటనడుమ రాతిబండమీద సీతతో వినోదిస్తూ కూర్చుంటూ ఉండేవాడవే. ఆరాతిబండే సుమా యిది. అప్పుడు సీతమ్మ తల్లి లేళ్లకిక్కడే కూర్చుండి గరికపిడచలు మేపుతూ ఉండేది. ఆనాడిక్కడ సీత చేతిగరికపిడచలు మేసిన అలవాటుచేతనే ఇప్పటికీ ఈ రాతిబండను విడవలేకుండా దీన్నే చుట్టువారి పడుకొని నెమరు వేస్తున్నవి చూడు లేళ్లు. దీనిమీద కూర్చుండి విశ్రాంతి పొందుమా శ్రీరామచంద్రా! అన్నది వనదేవత. ఆనాటి అరటితోట నేడు లేదు. ఆనాటి సీత నేడు లేదు. ఆరాతిబండమాత్రమే ఉంది. రాముడు మాత్రమే ఉన్నాడు. తెలివితేటలు గల మనుష్యులకు కృతజ్ఞత ఉండదుగాని జంతువులు, లేళ్లు చూడు,

ఇక్కడ మేత మేసేవారు లేకపోయినా అలవాటుచే ఈ పట్టును విడవలేకుండా ఉన్నవి అనడం, పైగా దీనిపై కూర్చొమనడం–గాముని కడుపుకోత కాదండీ! రాతిబండ, అరటితోట, తేళ్లు మనుష్యవర్గంకంటే తక్కువ తక్కువ లయిన జంతువర్గ, వృక్షవర్గ, ధాతువర్గముల లోని వయినా మనుష్యయోగ్యత నూపాంతలుగిస్తున్నవి. ఇది ధనభూతి కల్పిన కల్పకథ. నేను చిత్రకారుడనయితే ఈ శ్లోకార్థాన్ని చిత్రించి ఉండేవాణ్ణి.

ప్రధానంగా భారతమునకూ, ఇంకా ఆ కాలపు గ్రంథాలకూ అనుకృతి కొంత, కల్పన చాలా సమకూర్చి హితోపదేశ మనీ, పంచ తంత్ర మనీ రెండు గ్రంథా లున్నవి. పైశాచీ భాషలో గుణాఢ్యుడు రచించిన బృహత్కథకు అనుసరణంగా కథాసరిత్సాగరం, బృహత్కథా మంజరీ అనీ రెండు గ్రంథా లున్నవి. జైన తీర్థంకర కథలకు అనుకరణంగా ఆదిపురాణ మనే గ్రంథం ఉన్నది. ఇంకా దండి, అవంతి సుందరీ కథ, బాణుని కాదంబరి కథ మొదలైనవీ, శుకసప్తతి, యశస్తిలకచంపు, సాల భంజికల కథలు, విక్రమార్క కథలు ఇత్యాదిగా ఎన్నో కట్టుకథల రచనలు సంస్కృత సారస్వతంలో ఉన్నవి. అన్నింటిలోకీ పంచ తంత్ర మనేది దివ్యకథాసంపుటం. ఇది రెండు వేలేండ్లకు పూర్వమే ప్రపంచ భాషలలోని కన్నింటిలో పరివర్తిత మయిందట. దానికథలే ప్రపంచ ఖండాంతరాల కథ లన్నింటికీ మూల భూత మయినవట. పంచతంత్రం పసితనంలో చదివి అందులోని ఆషాఢభూతి కథకూ, కీలోత్పాటి కథకూ పొట్ట చెక్క లయేటట్టు నవ్వి నవ్వి ఇంకా అన్ని కథలూ చదవడం కోసం ఉవ్విళ్లూరి పోయినాను. పులితోలు కప్పుకొన్న గాడిదకథ ప్రపంచభాష లన్నింటి లోకీ ఎక్కిందిట.

ప్రపంచతంత్రంలో మెలకువతో ప్రవర్తించ గోరేవారికి పంచతంత్రం పట్టుపట్టునా అనుసంధించు కోవలసిన కథాంశాలూ, నీతి శ్లోకాలూ కల్గిన దివ్యోద్బోధ గ్రంథము. దాని లోని మేకు పెరికిన కోతికథ లోకతంత్రలో ఎంత ముఖ్య మయినది—ఎంత నవ్వు పుట్టించేది? కథాసరిత్సాగరం, భేతాళపంచ వింశతి, భోజవిక్రమార్క కథలు, శుకసప్తతి కథలు కథాప్రధానరచనలు.

ఇదిగాక భృంగపంచకమనీ, తుఖ్యాపంచక మనీ, హరిణీపంచకమనీ, అన్యాయపురీ పంచక మనీ, చమత్కారకథాగర్భితము లయినశ్లోక పంచకములు చాల ఉన్నవి. సంస్కృత మే వేదాంతాది మహాశాస్త్రాలకూ, ధర్మ శాస్త్రాలకూ, అధ్యాత్మవాదాలకూ పనికి వచ్చేదే కాని సాధారణజన చిత్తవినోదజనకము లయి చమత్కారాత్మకములయి తద్వారా ధర్మ తత్త్వాన్ని తెలిపే కథాగ్రంథాలు గలది గాదనే వ్యాపోహాను పై గ్రంథాలు పరిహరించగలవు.

సంస్కృతసారస్వతం పైగ్రంథాలకు కథ లకు ఆకరం కావడం, ప్రపంచ కథల కన్నిం టికీ పై సంస్కృత కథా గ్రంథాలు మూల ములు కావడం, పై కథా గ్రంథాలు నేటికీ నవీనతతోగూడా ప్రపంచంలో మంచి మంచి కథాగ్రంథాలకు ఊటపట్టు కావడం సంస్కృతసారస్వతం నిత్య దేదీప్యమానంగా వెలుగుతుంది.

ఇట్టి చమత్కార సారస్య చతురములయిన కట్టుకథలను ప్రసవించిన తల్లికి సంస్కృత సరస్వతికి జే...జే...లు.

(ఆల్ ఇండియా రేడియో విజయవాడ కేంద్రం వారి సౌజన్యంతో)

## కొండయమంత్రి

ఉ॥ నూటపదారు లిచ్చి వినూతనదాన్యుఁడ వంచు నెమ్మదిన్
మాటికి నెంచి వచ్చితిని మానితకీర్తిధనుండ వౌచు నీ
సాటి ప్రధాను లెవ్వరిక సంశ్రితరక్షణశక్తి నెను బా
హాటము కాన ప్రోవుము కృపాకర ! కొండయ మంత్రిశేఖరా !

గ్రంథసంస్కరణలో ప్రథాకరుల కైవాడం

# చిన్నిమార్పులతో చెన్నైనపాఠాలు

ప్రాచీనగ్రంథ సంస్కరణప్రయత్నాలు ఒక కొత్త శాసనలిపి, తాళపత్రలిపి సుబోధంగా పోల్చు కోదగింది. కాని తాళపత్ర గ్రంథాలలో విలేఖకులు తలకొక విధంగా వ్రాసేవారు. బండిఱటలు వ, పలు న, నలు కతలు, గుణితాలు ఇలాంటివి వేరుపరచ డానికి వీలు చాలవరకు వుండదు. దీనికి తోడు వ్యాకరణ కార్యాలైన గసడదవా దేశాలు, పూర్ణ, అర్ధబిందువులు, అనుస్వారానికి మారుగ వర్గ పంచమాక్షర వ్యవహారం, పాఠాంతరాలు లేఖక ప్రమాదాలు-వీటన్నిటితో పరిష్కర్త ఏ కొండగాలినో ఊబిలోనో ఇరుక్కున్నట్టవుతుంది.

ఇలాంటప్పుడు తెనాలి రామలింగని చెప్పినట్టు "తెలిసునివన్ని తప్పులని దిట్టతనాన" నిర్ణయించుకొని సంస్కర్తలు తమ కాలానికి అనుగుణంగావున్న వ్యవహారం ఆధారంగా పాఠాలు నిర్ధరిస్తూ పాఠాంతరాలు కల్పిస్తూ తమవాదాలను సమర్థించుకొన జూచేవారు. నన్నెచోడుని కుమారసంభవం నన్నయ భారతానికంటె ప్రాచీన మని నిరూపించడానికి పరిష్కర్తలు పడినపాట్లు తెలుగునా ఎరింగినదే. నన్నెచోడుని కుమారసంభవం ప్రతి ఆంధ్రదేశం మొత్తంపైన దొరికినది ఒక్కటే. అది తంజావూరు సరస్వతీ గ్రంథాలయంలో మన అదృష్టవశాత్తు భద్రపరచ బడింది. తర్వాతి ప్రతులన్ని దాని ప్రతికలే. నన్నెచోడుడు తన గ్రంథం అవతారికలో దేశి కవితాప్రస్తావంలో

"మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం [ర్"
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువు

అని అన్నాడు. భారతానికంటే దీని ప్రాచీనత్వాన్ని సాధించడానికి సమకట్టిన పరిష్కర్తలు ఈ పద్యం నాల్గవ పాదాన్ని "జన సత్యాశ్రయుని దొట్టి చాళుక్యనృపుల్" అని దిద్దివేసినట్లు వదంతి. దీనితో తెలుగునా డెల్లా ఒకప్పుడు కల్లోలిత మైంది. అప్పుడు బయలుదేరిన విమర్శలకు, వ్యాఖ్యలకు, నిందలకు, ఆక్షేపణలకు లెక్క లేదు. ఇంతకూ ఈ పద్యం నాలుగో పాదం (తిప్పని పాదం)లో పేర్కొన్న చాళుక్యనృపుడు ఎవరో ఇంతవరకు తేలలేదు. పరిష్కర్తలు ప్రాచీనప్రతుల పాఠాలను దిద్ది వేయడానికి వెనుకాడేవారు కారనడానికే ఇంతగా వివరించవలసి వచ్చింది.

చిత్రభారతంలో "మానభూపాలు చిత్రాంబుఖానుఁ డతడు" అని వుండగా శ్రీ వీరేశలింగంగా రంతటి వారికే సందేహం కలిగి 'చిత్రాంగఖానుఁ డతడు' అని దిద్ది వేశారు. దానితో సుమారు 30ఏండ్లదాకా మరుగుపడింది. 30 ఏండ్ల పిదప చిత్రాంబుఖానుడు సుప్రసిద్ధ పౌరుడని అది సితాబ్ఖాను అనేపేరు అని శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు గుర్తుపట్టారు. శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు (హైదరాబాద్) విపులంగా సితాబ్ఖానుని చరిత్ర ప్రకటించారు.

మరికొందరు స్వసిద్ధాంత స్థాపనకు కాకపోయినా తాము గ్రామ్యమని భావించిన వానిని ప్రాచీనకవులు ప్రయోగించి వుండరనే నమ్మకంతో పెడదారి త్రొక్కారు. చూతాము, మరాక, వరక మున్నగు రూపాలు గ్రామ్యాలనే దృష్టితో, చూతము, మరువక, పెరువక అని దిద్దివేసేవారు. చూతాము అనేది తప్పని చూతంబు అని దిద్ది అంతకంటే పెద్ద తప్పు చేశారు. చూతాము అనే క్రియారూపం ఫలము, ఫలంబు అయినట్టు చూతంబు కాదనే సంగతి వారికి తోచలేదు. కంసహారం, కల్హారం, యవ్వనం, సమూహి, బాలకి, సఖుడు అనే సంస్కృతప్రయోగాలు తప్పని భావించి దిద్దడానికి పూనుకొని పద్యానికి పద్యమే మార్చి వేయడానికి ప్రయత్నించారు. ఇలాటి ప్రయోగాలను నన్నెచోడుడు, అనంతునివంటి ఛందఃకారుడు యతిప్రాసలలో బిగించడంవల్ల కదపడానికి వీలులేక తలలు మార్చే సంస్కర్తలకు పచ్చి వెలక్కాయైనవి.

శ్రీనాథుడు భీమఖండములో ప్రౌఢుడు వలె ప్రాడ్వాడు (పగ్గఁలాగ నిర్జీవంగా అగు) అనే జాతీయం ప్రయోగించగా దానిని

సంస్కర్తలు రాట్పడు అని దిద్దివేశారు. భాషా శేవజంలోను బాలకవి శరణ్యంలోను నిద్దర్శను తూర్పార బట్టారు శ్రీ గిడుగువారు.

కాలనిలో పాణిని తొలగించి వంచినీటిని ముందుకున్నట్లు లేఖక ప్రమాదాలను పరిశీలించి కవి హృదయాన్ని గుర్తెరిగి, సాధుపాఠాలను నిర్ణయించేవారని మన దేశంలో ప్రేళ్ళపై లెక్కించ వచ్చు. వారిలో నాదృష్టిలో ప్రథమగణ్యులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు. వివిధ ప్రతులను సైఫారు చేసి పాఠాలు వేర్పపరచే పద్ధతికి వారు మూలపురుషులు. సాధు పాఠ నిర్ణయంలో వారి ప్రతిభ అద్వితీయం. తాటాకు పుస్తకాలను నిరంతరం చూడడం చేత కాబోలు వారి చూపు ఎప్పుడూ సాధు పాఠాల పైనే ఆగేది. సంస్కరణకు వివిధ భాషాపాండిత్యంతో పాటు స్ఫూర్తి ముఖ్యం. శ్రీ శాస్త్రిగారు సంస్కృతం, ప్రాకృతం, తమిళ, కన్నడ వాఙ్మయాలను తరచిన వారు గనుక అంతవరకు సరిగా అర్థంకాని మాటలు తలకట్లో, గుడ్లో, కొమ్మో, మార్చి చెప్పగా నే పంతగా అతికేది. ఎంతో హాయిగా అర్థమయ్యేది. తర్వాత ఇంత చిన్నమాట తెలియక పోయిందేమా అని సిగ్గుపుట్టేది.

హరవిలాసం, నన్నెచోడుని కుమార సంభవం, కాశీఖండం మున్నగు గ్రంథాల పాఠాలను శ్రీ శాస్త్రిగారితో సంస్కరించ డానికి తంజావూరు వెళ్ళే అవకాశం, ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీలో వారి క్రింద పనిచేసే అవకాశం కొంతకాలం నాకు లభించింది. సాధు పాఠాల నిర్ణయంలో వారి కున్న అపూర్వ స్ఫురణకు కొన్ని తార్కాణలను పేర్కొంటున్నాను.

ఆంధ్రాప్రెస్ కోసం శ్రీ శాస్త్రిగారు హరవిలాసాన్ని పరిష్కరిస్తున్నారు. నేను తంజావూరి నుంచి తెచ్చిన పాఠాంతరాలను సైఫారు చేస్తున్నాను. ద్వితీయాశ్వాసంలో చిరుతొండనంబి కథ. చిరుతొండడు శివభక్తులు పంక్తిని లేనిదే భుజింపని వాడు. శివభక్తుల కోసం వెదకుతూ వెళ్ళితే ఒక వృద్ధదంపతులు కనిపిస్తారు. వారిని సాపాటుకు పిలువగా కొడుకును చంపి వండి వడ్డిస్తే వస్తానంటారు. సరే అని చిరుతొండడు ఒప్పుకుంటాడు. కాని ఇంటికి వెళ్ళి అందరితో వల్లె అనిపించుకోమని ఆశివభాగవతుడు అంటాడు. "కంచి దాపుననే వుందికదా. అడుగామడనా? వెళ్ళక"మ్మంటాడు. ఇది ప్రసంగం. "అవంచియే గంచి నీకు అడుగామడయే" అని వుంది పాఠం. ఎంత ఆలోచించినా అర్థం కాదు. శాస్త్రిగారికి తెలుసుక్కమని మెదడులో మెరిసింది. సరే, "పాత మహానగరాలెన్నోయ్?" అన్నారు. ఎందుకు అడుగుతున్నారో అర్థం కాలేదు. అయినా అయోధ్య, మధుర, మాయ, కాశి, కాంచి, అవంతి, ద్వారక అని ఏడు ఏకరువు పెట్టాను. "ఇంకేం? అర్థం చెప్పు" అన్నారు. నాకు తోచలేదు. "అవంచి అవంతి ఒకటే. అవంచి రూపాంతరం. కాంచికి కాంతి అనే రూపంకూడా వుంది" అన్నారు. "పక్కన వుంటే కంచేకదా, చిటికలో రాగలవు కదా. అవంతి అంత దూరంలోది కాదు కదా? అని అర్థం చెప్పారు. ఒక్క అక్షరం మార్పుతో సంపర్కం అతికిపోయింది.

మరొకసారి చెన్నపురినుంచి బెజవాడ వెళ్లుతున్నాము. కాశీఖండం పాఠాలను గురించి శ్రీ శాస్త్రిగారు శ్రీ బులుసు వెంకటరమణయ్య గారితో చర్చిస్తున్నారు. నేను వింటున్నాను. సూర్యవర్ణన ఘట్టం "సృష్టికన్నెర్ర" అని సూర్యునికి విశేషణం. సృష్టి కందోయి అనే పాఠం కూడా వుంది. సూర్యుడు ఒకడే గనుక కందోయిపాఠం కుదరదు. సూర్యుడు సృష్టికి కన్ను అని చెప్పడం కవి అభిమతమై వుండడం స్పష్టమని చర్చ జరిగింది. పదార్థం కుదరదు. సృష్టికన్నెర్ర అంటే సృష్టికి కన్నెర్ర ఏమిటి? బెజవాడ చేరేవరకు శాస్త్రిగారు దానితో కుస్తీ పడుతూనే వున్నారు. నేను అంపైర్‌ను. బస్సు ఎక్కుతుండగా, "కుదిరిందయ్యా, అయినా చూడు" అంటూ, "కంచెర అంటే ఎలా వుంటుంది?" అని అడిగారు. సృష్టికి కండ్లు తెరపించేవాడు; జగత్తుకు చక్షువు అని అర్థం చెప్పారు.

నాచనసోముని హరివంశంలో పౌండ్రక వాసుదేవుడు ద్వారకపై దండెత్తి వచ్చిన ఘట్టం. కోటలో బందోబస్తు జరుగుతున్నది. కోట కొమ్మ కొమ్మకు పైనుంచి శత్రువులను సులభంగా

చూచి పరిమార్చడానికి వీలుగా "సోదన దీవి యొత్తుడు" (కొమ్మకొమ్మ నిరంతరమున్ సోదన దీవి నెత్తుడు) అని ద్వారకాధిపతి ఆనతిస్తున్నాడు. సాదనదీవి అని ముద్రితప్రతి పాఠం. అర్థం కాలేదు. ఇది సోదనదీవి, సాదనదీవి కాదు అని శాస్త్రిగారు అన్నారు. అప్పుడు మాత్రం నాకు అర్థమైందా? మరల వెర్రిమొహం చూశాను. "కన్నడం వచ్చునని విర్రవీగుతావుగా, ఇంత మాత్రం తెలియదా?" అన్నారు. "[illegible] శోధించడానికి, వెదకడానికి ఉపయోగించే పొగగల్ల చేతి దీపంలాంటిదానిని కన్నడంలో సోదనదీవె అంటారు. దీనిని సంపకని ప్రయోగించారు. ఇది శోధనదీపతద్భవం. మన పాత పుస్తకాలు—ముఖ్యంగా నన్నయ భారతం, హరివంశం, కుమారసంభవం, బసవపురాణం వంటివి బాగా అర్థం కావాలంటే కన్నడ సంప్రదాయం తెలియాలి" అని వివరించారు.

శృంగారనైషధంలో ఒక భోజనవర్ణన. "ఆవపచ్చళ్లు చవిచూచి రాదరమున సొగలు నెగయగ నాసికాపుటములందు, ఎగ్రదనమున" —అని వుంది.

"ఆవపచ్చళ్లలో ఎగ్రదన మేమిటండి? మిరపపండు వచ్చిందా ఏమిటి? ఇంతకూ మిరప మొక్క శ్రీనాథుని తర్వాతేగా మనకు దిగుమతి అయింది మచిలీనుంచి" అని ప్రశ్నించాను. "ఎగ్రదనం కాదయ్యా, వగ్రదనం, వగ్రదన మంటే తీవ్రత, కారం, లేఖకుడు 'వ'కు తలకట్టు ఇవ్వడం మరచాడు. నీ తలలో కట్టు కట్టుకుంది. అర్థం కాదు" అన్నారు.

నైషధంలోనే చంద్రవర్ణన. చంద్రుడు చలిమిడి ముద్దలాగా, కళంకం నూటిడి (నూల బిండిపిడచ) లాగ వున్నదని నోట్లో నీరూరించే వర్ణన. నూటిడి అనేది అపపాఠమని శ్రీ వేదం వెంకటరాయశాస్త్రి గారు నూబిడి అని దిద్దివేశారు. నూలు+ఇడి ఔపవిభక్తికం రాగా నూటిడి అయింది. శ్రీ శాస్త్రి గారు వివరించే వరకు నూటిడి ఏమిటో తెలీలేదు.

అన్ని పుస్తకాల పరిష్కరణ ఒకఎత్తు. నన్నెచోడుని కుమారసంభవం పరిష్కరణ ఒకఎత్తు. అడుగడుగుకు సందేహాలే. ఉన్నది ఒక ప్రతి. తమిళ కన్నడ సంప్రదాయాలు తెలియనిది ఒక పద్యం పెగలదు.

కుమారసంభవం, ద్వితీయాశ్వాసం 69 వ పద్యంలో "[illegible]ళిమి పట్టు కలిగి పాశుపతము దాల్చుగ నేర్చికి" అని వుంది. అర్థం కావడం లేదు. నేను బట్టు కలిగి ఏమిటని ప్రశ్నించగా, శ్రీ శాస్త్రి గారన్నారు, "ఇమ్మడి వైబ్రహ్మాస్త్రం మాట వినవయ్యా" అన్నారు. బళిమి బిట్టు కలిగ (బిట్టుగ సోపించి) అని, 'బ'కు గుడి ఇవ్వమన్నారు. గుడి భద్రంగా అర్థ మిచ్చింది.

కుమారసంభవంలోనే అష్టమాశ్వాసంలో (159) శృంగారవర్ణన. ఒక నాయిక సగసు నితో అంటున్నది, "చెరకు [illegible] తీస్తే కదా రసాస్వాదనం, [illegible] స్త్రీలవిషయం లోను" అని.

క. చెరకున బుస్సక రిమ్ముల
[illegible]
[illegible]
[illegible] మనోరథములు ధరుడు వడయున్.

అని పద్యం. మొదటిపాదం చెరకున బుస్సక రిమ్ముల ఏమిటి? శాస్త్రిగారిని కోరాను వివరించమని. చెరకు అనే పదంలోని "కు"కు గుడి దీర్ఘం పెట్టి, రిమ్ములను రిమురి అని సవరించి [illegible] "చెరకును ఈనె తీయకుండా నమిలితే ఏ రసముంటుంది? ఇప్పుడు సరిపోయిందా?" అన్నారు. [illegible] ఏంచేస్తాను? కాని నా [illegible] కూడా వెలిగిద్దామని తోచింది. "[illegible] భావం సంస్కృతంనుంచి అపహరించాడండి" అన్నాను "అది అపహారం కాదోయ్ వారియెడ వుండే గౌరవాభిమానాలను గ్రంథస్థం చేయడమేనోయ్. శ్రీనాథుడు స్వయంగా వర్ణించలేకనా, మయూరుని సూర్యశతకాన్ని స్వీకరించడం? తిక్కన పాల్కురికి వారి పదాలను పదిల పరచుకొని గౌరవించాడు. నన్నయ తనకు ముందున్న కన్నడకవుల ప్రయోగాలు సంతరించి గౌరవం చూపాడు" అన్నారు.

కుమారసంభవం ఏకాదశాశ్వాసంలో యుద్ధవర్ణన. వీర పురుషులు నాయికలతో తమ మగంటిమిని చెబుతున్నారు.

"పోర బాకు దాల్చి నీరు గొన్నట్టు ప్రతి
బలము నెల్ల బాయపడగ దోలి
గొడుగు క్రింది రూపు బోడిసి జయంబు నీ
కిత్తు నధిప నమ్ము నింత నమ్ము."

ఇదే మద్రాసు విశ్వవిద్యాలయం వారి ప్రతి పాఠం కూడా. పోరలో బాకు దాల్చి, శత్రు బలాన్ని పారద్రోలుతాను అని అర్థం చెప్పితే నీరుగొన్నట్టు అనే వాక్యానికి అర్థం? శాస్త్రిగారు ఎంతో ఆలోచించి "పోర బాకదల్చి" అని సవరణ సూచించారు. కోనేటిలో పాచిని పాయచేసి నీటిని తీసుకొనేటట్లు శత్రుసైన్యాన్ని పారదోలి జయం నీ కిస్తాను అని ముచ్చటగా అర్థం వివరించారు. విని ఎంతో ఆనందం, ఆశ్చర్యం కలిగాయి.

కుమారసంభవంలోనే ఏకాదశాశ్వాసంలో తారకాసురునిపై ముట్టడిని వర్ణించే ఘట్టం. దాడి ఏర్పాట్లు చేయించడానికి పైవారు క్రింది వారికి ఉత్తరువులు చేస్తున్నారు. "వారువ ముందు పంపు సహావాసుల నంటిపెట్టుము కాపు గాన్" అనిపాఠము మద్రాసు విశ్వవిద్యాలయం ప్రతిపాఠం కూడా ఇదే. వారువ మందు పంపు గుర్రం అక్కడికి పంపు అని అర్థం చెప్పితే కుదరదు. [illegible] "గుర్రపు దళం" పంపమని ప్రస్తావం ఉంది. కనుక ఘటన క్లిష్టమవుతుంది. మరల శాస్త్రిగారినే ఆశ్రయించాను అర్థంకోసం. 'వారువ మందు' అనే చోట మకారానికి కొమ్ము ఇవ్వమన్నారు వారు. వారువముందుపంపు అయినది. ఏదో కొంచం అర్థమైంది. ఇప్పుడు అది కూడా శూన్యం. దిక్కులు చూచాను. 'ఏమిటి అలా వాచ్చుతున్నావు? పొచ్చుకున్నావు' అని వారు ప్రశ్న వేశారు. చూడు అనే అర్థంలో వున్న వాచ్చు ధాతువుకు తుమన్నర్థక రూపం (చూచుటకు) వారువన్ అని తెలిసింది. అంతఃపురం కాపుగా మనకోసం నిరీక్షించడానికి కొందరిని ముందు పంపుమని అర్థం కుదిరింది. వాచ్చుక్రియ పార్ తమిళక్రియా సమానార్థకమని పార్వాన్ పార్వాన్ చూచేవాడు, భవిష్యత్తును చూచేవాడు. బ్రహ్మవేది, పార్వాన్ అయిందని శాస్త్రిగారు తెలిపారు.

ఇలాంటి సన్నివేశాలు వేనకువేలు. గ్రంథపరిష్కారంలో శాస్త్రిగారికి దీటుగల పండితులు డాక్టర్ సీతాపతి, శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగార్లున్నారు. నడివయస్సు వారిలో వారి స్థాయిని అందుకోగలవారు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు.

ఈనాడు ప్రాచీనగ్రంథాల నిర్దుష్ట ప్రచురణ అవసరం. శ్రీ శాస్త్రిగారు చూపిన బాటలో వాటిని నూతనసంస్కరణలతో ప్రచురించేదాం మనం.

—రామచంద్రం.

## సి. పి. బ్రౌను

సీ. చంద్రుఁ డెవ్వరికని జల్లనై యుండెఁడా పద్మముల్ చేసినపాప మేమి?
యిల వసంతుఁడు వనంబుల నెల్లఁ బ్రోవఁడా జాజి చేసినయదృష్టం బదేమి?
సంపెంగ వాసనల్ సర్దింప శక్యమా లేఁ తేఁటులకును ప్రాప్తి లేదు కాని
హరుఁ డే ప్రసూనంబునైనఁ జేపట్టఁడా గేదంగికిని ప్రాప్తి లేదు కాని
గీ. నాకు భాగ్యంబు లేదు గాఁబోలు సుమ్ము, యెవ్వరికి నీవు యిచ్చి రక్షింపలేదా
కబ్బములమేల ! కందర్పహారుని సాటి ! పరఁగ నమ్మితి బ్రౌనుభూపాలతిలక !

ఇందు నీచార్థములను వాల్గింటిని ప్రాచీనములను గైకొని గీతపద్యము నెవ్వఁడో [illegible] గాఁడు కవితాప్రియుఁ డయిన బ్రౌనుదొర పిచ్చిరగనలో నడికించి చెలేచినాఁడు. 'భోజనం దేహి రాజేంద్ర' యన్న భోజరాజుమీఁది శ్లోకమున కిది రచనలో అన్న!

# సంస్కృతరూపకాలు - శాస్త్రిగారి : అనువాదాలు

శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు

బహుముఖముల పాండితీప్రకర్షను చూపి తమ ప్రతిభను వెల్లడించి భాషావాఙ్మయముల కపారసేవ చేసినవారిలో శ్రీ ప్రభాకరశాస్త్రిగా రగ్రగణ్యులు. ఆంధ్రవాఙ్మయమునకు మూలభూతమగు సంస్కృతవాఙ్మయము నవలోడన చేసి శ్రీ శాస్త్రిగారు తెలుఁగునకు సోదరభాషలగు అఱవ, కన్నడములలో అసాధారణ పరిశోధన మొనర్చిరి. ఆంగ్లమునఁ గావలసినంత జ్ఞానము గడించిరి. శాసనపరిశోధనమున అగ్రతాంబూలము గ్రహించిరి. అనువాదము లొనర్చుటలో నందె వేసిన చేయి యనిపించుకొనిరి. పండిత ప్రకాండులలో ప్రథమశ్రేణికిఁ జెందినవా రని పేరుపడిరి. కవులలోను, కథకులలోను ఉత్తమశ్రేణికిఁ జెందినవా రని కీర్తిఁ గాంచిరి. శ్రీ శాస్త్రిగారు వ్రాసిన ప్రతివ్యాసమునందును ఏదైన నూతనాంశము వెల్లడింపఁబడుచునే యుండును.

మన దేశమున నొకటి, రెండు విషయములలోఁ బరిశ్రమ యొనర్చి, వానియందుఁ గూలంకషమగు ప్రజ్ఞను గడించినవారు కొందఱుండ వచ్చును. కాని శ్రీ శాస్త్రిగారివలె సర్వతోముఖముగ వైదుష్యము గడించి, చక్కని కవిత్వము చెప్పఁగలవారు మిక్కిలి యరుదని చెప్పవలెను.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ప్రభుత్వప్రాచ్యగ్రంథాలయమున నిర్వహించినది ఆంధ్ర పండిత పదవి. విరామము గైకొనిన పిదప తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధన సంస్థలో నిర్వహించినది ఆంధ్రపరిశోధకపదవి. ఇట్లయ్యును శ్రీ శాస్త్రిగారు అమరవాణియెడ నపేక్ష చూపుచు వచ్చిరే కాని యుపేక్ష చూపలేదు.

'పరిశోధన'యనునది శ్రీ శాస్త్రిగారికి బాల్యమునుండియు పట్టుపడినది! వీరి పరిశోధనలో సంస్కృతాంధ్రములు రెండును సమానఫక్కినే నడచినవి.

సంస్కృతవాఙ్మయమును శ్రీ శాస్త్రిగారు తొలి దినములలోనే ప్రారంభించిరి. అందుకుఁ దగిన పాండిత్యము నాయన శ్రీ అద్దేపల్లి—సోమనాథశాస్త్రిగారికద్ద విద్య నభ్యసించి సంపాదించిరి. ముక్త్యాలనుండి వెలువడుచుండిన 'శ్రీసరస్వతీ'పత్రికలో అపూర్వగ్రంథములతోఁ బాటు సంస్కృతవాఙ్మయచర్చలను ప్రకటించెడివారు. ఉదారరాఘవకర్తయు, 'చతుర్భాషాపితామహ' బిరుదాంకితుఁడును అగు శాకల్యమల్లభట్టుంగూర్చియు, విద్యానాథ బిరుదాంకితుఁడై, ప్రతాపరుద్రయశోభూషణమును రచించిన అగస్త్యకవింగూర్చియు, చెన్నుభట్టు, అన్నంభట్టు, జాయసేనాపతి మున్నగువారిఁ గూర్చియు నందే శ్రీశాస్త్రిగా రమూల్యవ్యాసములను ప్రకటించిరి.

శ్రీశాస్త్రిగారు స్వతంత్రరచనలతోఁ బాటు కొన్ని యనువాదములను వెలయించిరి. వానిలో సంస్కృతానువాదములును కలవు. అవి కర్ణభారము, మధ్యమవ్యాయోగము, ప్రతిమానాటకము, భగవదజ్జుకము, మత్తవిలాసము, నాగానందము అనునవి. ఇందు నాగానందమునందలి తొలి రెండంకములే వీరి రచన. తక్కిన గ్రంథమును శ్రీదివాకర్ల-వేంకటావధానిగారు పూరించిరి. ఆగ్రంథ మీనడుమనే ప్రకటింపఁబడినది.

పయి యన్నియును రూపకములు. వీనిలో కర్ణభార, మధ్యమవ్యాయోగ, ప్రతిమానాటకములు భాసకృతుల కాంధ్రానువాదములు. మత్తవిలాసము మహేంద్రవిక్రమవర్మకృతి కనువాదము. భగవదజ్జుకముకూడ నట్టిదే! దీనిని మహేంద్రవిక్రమవర్మయే రచించినను, వ్యాఖ్యాత బోధాయనకృత మని పేర్కొని యున్నాఁడు. ఈ యంశమును శ్రీశాస్త్రిగారు 'భగవదజ్జుకము' తొడిమలో వివరించి యున్నారు.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ప్రభుత్వప్రాచ్యలిఖితగ్రంథాలయమునకై గ్రంథములను సేకరించుటకుఁ గాను శ్రీ రామకృష్ణకవిగారితోఁ బాటు తిరువనంతపురమునకు వెళ్లి, యచట భాష

నాటకములను కనుఁగొని నప్పుడు వీ రిరువురి కిని వానిని తెలిఁగింపవలె ననుకోరిక కలిగిన దఁట! కావున ఆ వెనువెంటనే శ్రీ శాస్త్రి గారును, శ్రీ రామకృష్ణకవిగారును కూడ కొన్ని రూపకముల ననువదించిరి. శ్రీ శాస్త్రి గారి యనువాదములలో ఆ రీతిని తొలుత కర్ణభార, మధ్యమవ్యాయోగములను తెలిఁగించిరి.

శ్రీ శాస్త్రులుగారి యనువాదములు మూలమున కన్యూనాతిరిక్తము లయి, మూలమునకు మెఱుఁగు పెట్టఁజాలి యుండును. సారళ్యము, రసోచితమగు కూర్పు, తెలుఁగు నుడికారపు సొంపులు వీరి రచనలలోని విశిష్టతలు! మూలమునఁ బ్రాకృత ముపయోగింపఁబడిన చోట్ల నెల్ల వీరి తెనిఁగింపులలో చక్కని వ్యావహారిక ముపయోగింపఁబడినది. నమూనకుఁ గొన్ని గ్రంథములనుండి యుదాహరణలు—

కర్ణభారమునుండి - (మూలము)

శ్లో. హతోఽపి లభతే స్వర్గం
జిత్వా తు లభతే యశః,
ఉభే బహుమతే లోకే
నాస్తి నిష్ఫలతా రణే.

(అనువాదము)

క. చచ్చిన స్వర్గము వచ్చును
వచ్చి జయించినను యశ మనశ్వరము కల్గున్.
మెచ్చు గల రెండు పొసఁగిన
రచ్చలలో రిత్తపాటు కలుగదు చూవే !

మధ్యమవ్యాయోగమున -- (మూలము)—

శ్లో. తాత! తనయానురూపకాన్త!
నియమపరార్ధ్య మానప్రసక్తబుద్ధే!
కథమివ గజరాజదన్తభిన్న
స్తరురివ యాస్యసి పుష్పితో వినాశమ్.

(అనువాదము)

ఉ. 'ప్రాయపుఁగన్నతండ్రి! వర
వంపుఁబవల్ గల ముద్దుఁగుఱ్ఱ! యా
మ్నాయనిషక్తచిత్త! నియ
మవ్రతతత్పర! నాశ మయ్యెదే?
పోయెదె? యయ్యయో! యనుఁగుఁ
బుత్త్రక! మత్తగజంబు కొమ్ములం
ద్రోయుచు వ్రాల్చినం ధరణిఁ
గ్రుంగెడు క్రొంబువుమాఁకుచందమై.'

ప్రతిమానాటకము - (మూలము)

శ్లో. 'భ్రమతి సలిలం వృక్షావర్తే
సఫేన మవస్థితం,
తృషితపతితా నైతే క్లిష్టం
పిబన్తి జలం ఖగాః,
స్థల మభిపతన్త్యార్ద్రాః కీటా
బిలే జలపూరితే,
నవవలయినో వృక్షా మూలే
జలక్షయరేఖయా.'

[పంచమాంకము]

(అనువాదము)—

సీ. 'ఆలవాలముల నిండార నుర్వులువాఱి
వారిపూరము పొఱువాఱుచుండె,
దగఁగొన్న ఖగము లిత్తరుల చెంతలనుండి
యూఁగెంచి బురదని రాసలుండె,
బిలములందు జలమ్ము నెలకొన్నఁ గీటంబు
లంతంత మెరకల కరుగుచుండె,
తరుమూలముల నీరు తఱుఁగుచున్న కొలంది
వలయముల్ క్రొంగ్రొత్త వెలయుచుండె

గీ. తీయనీ రిప్పు డిప్పుడే పోయుచున్న
పగిదిఁ గనుపట్టు నీచెట్లు పాదు; లింత
లంతలం బ్రాంతముల జనకాత్మజాత
చెలఁగుచుండె నటంచు సూచించుచుండె'

ఇందు గీతిలోని చివరి పాదములు రెండును మూలశ్లోకముకంటె విశేషమును తెల్పుచు, ప్రస్తుతవిషయమున కెంతయు మెఱుఁగుపెట్టుచున్నవి.

మత్తవిలాసము --(మూలము)

శ్లో. ప్రజ్ఞాదానదయానుభావధృతయః
కాన్తిః కలాకౌశలం
సత్యం శౌర్య మగూఢతా వినయ ఇ
త్యేవంప్రకారా గుణాః
అప్రాప్తాశ్రయాః సమేత్య శరణం
యాతా యమేకం కృతా
కల్పాన్తే జగదాది మాదిపురుషం
సర్గప్రభేదా ఇవ.

(అనువాదము)

శా. కాంతిప్రౌఢి వితీర్ణ సూనృత కలా
కౌశల్య దాక్షిణ్యవి
క్రాంతి క్షాంత్యనుభావముఖ్యగుణముల్
కాలిక్కలిన్ నిల్వనా
పొంతన్ గానక మొత్తమై శరణ మా
భూపాలునిం జెందెఁ గ

ల్పాంతంబం దఖిలాది నీశ్వరుని న
య్యైశ్వర్యపుష్టు గన్నట్లుగాన్.

మత్తవిలాసమునందే క్రింది ప్రాకృతగాథను చక్కని గేయరూపానువాద మొనర్చినారు శ్రీశాస్త్రిగారు.

(మూలము)

'గహీదశూలొ॰ బహువేశధారిణో
శరం పిశాఅ ఉదకే వహన్తి మే,
శరం చ వగ్గా నిశగ్గభీశణం
ముహేణ ముంచామి అహం మహాశరఏ'

(అనువాదము-గేయము)

శూలాలు పట్టుకోని
చాలా వేషాల్ వేసికోని
వేలకొద్దీ పిశాచాలు
వెళ్తా ఉంటై నాపొట్టన్;
పెద్దపుల్లూ వందలకొద్దీ
దద్దరిల్లూ ఉంటై నాలో
గద్దరిశాచుల్ చిట్టుల్ బుస్సుల్
కొవిస్తుంటై నానోట్లో."
నా గానందము—(మూలము)

శ్లో. ఉత్ఫుల్లకమలకేసర
పరాగగౌరద్యుతే! మమహి గౌరి!
అభివాంఛితం ప్రసిద్ధ్యతు
భగవతి! యుష్మత్ప్రసాదేన.'

(అనువాదము)

ద్విపద:--
అరవిరిసిన తమ్మి యకరుపుప్పొడి
గౌరవర్ణము మేనగల దేవి! గౌరి!
మామక నన్నతల్లి యుష్మత్ప్రసాదమున
సమకూరుగాక నా సమభివాంఛితము

పయి యుదాహృతులు యాదృచ్ఛికముగ గ్రహింపబడినవి గాని, ఏర్చి కూర్చినవి కావు.

ఇట్లనువాదములను వెలయించుటయే కాక కొన్ని సంస్కృతగ్రంథములను పరిశోధించి శ్రీ శాస్త్రిగారు పరిష్కరించి యున్నారు. అందు వీరు సంస్కరించిన 'నీతిద్విషష్టిక'ను శ్రీ కనుపర్తి-మార్కండేయ శర్మగారు తెలుగున ప్రకటించి యున్నారు.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు కృషి యొనర్చినను, ఆ విషయము సందర్భికిని వెల్లడింపరు. వారి యాప్తులకును దెలియని పెక్కు విషయము లే కాగితములలోనో మఱుగపడియుండవచ్చును. అట్టివానిని పరిశీలించిన శ్రీశాస్త్రిగారి సంస్కృతభాషా వాఙ్మయసేవ యింతో-అధికముగ వెల్లడి కాగలదు. అట్టి పనికి 'శ్రీ ప్రభాకర పరిశోధకమండలి' వారు పూనుకొందు రని విశ్వసించుచున్నాను.

## కృష్ణభూపతి.

క॥ అప్రదుఁ డక్షిప్రదుఁడును
గుప్రదుఁడును నీవు సరియె కువలయమందున్
సుప్రద కృష్ణమహీభుజ!
విప్రోత్తమకల్పభూజ! విద్యాభోజా!

## కవి - దాతతో

ఉ॥ పుట్టెఁడు వడ్లు దూది యరపుట్టెఁడు గంధపుఁజెక్క తక్కెడున్
బట్టును నూనె పేర్పెఁడును బంగుము సెన్నలు నిక్రమంబునన్
గట్టిగ మాసమాసమునకుఁ గట్టడి చేసిన జాలుఁ జాలు నీ
పొట్టకు బట్టకున్ నుసటిబొట్టుకు జుట్టుకు బొట్టెలట్టుగన్.

# వర్ణనవిధానంలో పెద్దనసంయమం

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులుగారు

(గతసంచిక తరువాయి)

మాయాప్రవరుఁడు కంటఁబడినప్పుడు గూడ వరూధినీ ప్రవర్తనము జాత్యుచితమై, సన్నివేశ సముచితమై యున్నది. ఆమె కపటభూసురుని జూచినది "కువలయ ఘనరుచ్యాకూతస్వాంత వనీ సంభవములై మించుఁబస్వ పుష్పాదుల" (మ. 3. 87) యందు. వాఁడప్పుడు దేవపూజకై విరులు చిదుముచుండెను. అతఁడు నిరతవ్రతస్థుఁడు. అది ప్రాతఃకాలము తోడనే వరూధిని వయస్యల డించి 'కలక్వణత్కాంచికయై' యెదురేగెను. కపట విప్రుని జూచినంతనే యామెకుఁ గలుగాంచిన వణఁకును డాఁచి 'కాంచినటు' (మ. 3. 89) లైనదట! ఆమె గుండె జల్లుమనెను. కాళ్లు దొట్రుపడెను. ముఖాంబుజము దీనమైనది. కనుదోయి చంచలమయ్యెను. ఇవన్నియు నా కవి గ్రంథమున బ్రవేశపెట్టిన నాటక పద్ధతులు. తరువాత వరూధిని 'గ్రీటు గొనుచు' ముక్తసరిగా మూఁడు పద్యములు పలికెను. శాస్త్రప్రకారము చంద్రవదనాదులంతకుముందే సాఁగిననిగదా! అప్పుడు మాయా ప్రవరుఁడు గ్రుక్కత్రిప్పక పదిపద్యములు చదివినాఁడు. ఇంతకుముందు ప్రవరుఁడు పెదవి విప్పుటయే పెద్ద యనుగ్రహము. హఠాత్తుగ వానిలోఁ గలిగిన యీ మార్పునకు వరూధిని మిన్నందికొన్నది. వాని వాలకముఁ జూచిన, ఆమెకు వాఁడు మెత్తఁబడినట్లే తోఁచెను. ఇంతవరకు నవకాశము దొరకక తనకులాడుచున్న 'సిగ్గు' గబుక్కున వరూధినిపై మూకినది. ఆమె 'తన చేతి చెలఁగు ఓగయుం బెనచుచు' ప్రణయమానమును జూపెను. జలకేళిలో మునిఁగియున్న చెలికత్తెలకీ గొడవ తెలియనే తెలియదు. పిదప వారును గుంపుగాఁ గూడుకొని, 'అలఁతి హాస్యముల'తో నేమున్నా మనిపించినారు.

వరూధినీ ప్రవరుల శృంగారము గూడ మూఁడు పద్యములలో ముగిసిపోయినది. ఇతరులనేక పద్యములలోఁ జెప్పు విషయమును సంగ్రహించి పలుకు టాయన కలవాటు. కాని పలికిన ప్రతిపదమును బది పద్యములంత యుండును. అయింత యవకాశములోననే వారికొక చక్కని శయ్యఁ గూడ నేర్పాటు జేసినాఁడు.

రచనమునందుఁ దనకున్న పాండిత్యమంతయుఁ గనుపరుపవలె ననుదృష్టి పెద్దనకుఁ దక్కువ. సమస్త శాస్త్రపారంగతుఁడయ్యునే శాస్త్రమర్యాదను జూపఁడు. వ్యాకరణ పరీక్షములగు పదములను భయంకరముగ వాడి చెడఁగొట్టఁడు. మీమాంసను వెలార్పఁడు. అవశిత్వము అనన్యసాధ్యము. అతని కవిత అచ్చమున వీణానాదము.

ఆకాలమున అన్నిరంగములలోను ముఖ్యముగా సంబంధము గలిగిన వ్యక్తు లిర్వురు. వారు పెద్దన ముక్కుతిమ్మనలు. అల్లసాని పెద్దన వ్రాసిన చాటువులు గొన్ని యగపడుచున్నవి. తిమ్మనవి గనబడుటలేదు. ఆనాటి యన్ని రంగములలోను అంత వ్యాపకుఁడు గనుకనే, 'మనుచరిత్ర'లో నా సమాజము బ్రతిబింబించినంత మఱియేనియందును గనుపింపదు. 'రాయలనాటి' జనత యిట్లున్నదని చెప్పుటయేగాక, యా సమాజ మెట్లుండవలెనో గూడ బెద్దనలు చెప్పఁగలరు. ప్రథమాశ్వాసమున బ్రహ్మాండమగు సీసపద్యమున గృహస్థాశ్రమమును వర్ణించుట, నాటి జైనులు — వైదిక మతమునందలి 'వర్ణవ్యవస్థ'పై దండెత్తుట చేతనే.

మనుచరిత్రలో పెద్దనామాత్యులు వ్రాసిన

సీ. బుద్ధీంద్రియాక్షోభములకుఁ బెట్టనికోట,
విపదంబురాశిదుర్వ్యకృతి కోడ,
ఖలగరాలాప మార్గణ వజ్రకవచంబు,
రణమహీస్థలికి శ్రీరామరక్ష,
శాత్రవదుర్గర్వ సంస్తంభనౌషధి,
మొనయు చింతాశ్రేణి మూకవిప్పు,
యోగాదిసంసిద్ధు లాడఁగూర్చు పెన్నిధి,
తూలు నేకాకుల తోడునీడ,

గీ. సకలసుగుణప్రధానంబు సకలకార్య
జాలసాఫల్యకరణైకసాధనంబు
స్థైర్యగుణ మట్టి స్థైర్యంబు దక్కి పోరఁ
ద త్తఱింతురె యకట! మీతరమువారు.

ఈ పద్యము మనుచరిత్రకై రచించినది గాదని నా తలఁపు. అంతకుముందే రా

రాయచూరు యుద్ధమునందో సేనలను బెదరఁ గొట్టుటకై వ్రాసియుండును. ఆ పద్యము బాగుండుటచే గావ్యమున వాడుకొని యుండును. నా యీ యూహకు 'రచనము' లోని 'మీఁతరము వారు' అను మాట యుపష్టంభకము. ఆ పదము చాటువున కదికినంత గాఁ గావ్యమున కతుకుట లేదు. అది యట్లుండె.

స్వారోచి ముసలితనమున — మన యొక భార్యతోనే యేడ్చుచుండగా — ముప్పురను గట్టికొన్నాఁడు. ఆ వేడుకను గమనించిన యొక హంసి వాని దక్షిణ నాయకత్వమునకు మెచ్చికొన్నది. అప్పుడా రాయంచమాటలు విని యొక చక్రవాకి 'నీ కేమి పిచ్చిపట్టినది ఈ స్వారోచియందు వీరికిఁ బ్రేమ లెక్కడిది? ఒక్క పురుషుని యందు—'సమతాభిమానవతు'లైన మగువల కనురాగమే యున్నచో, నెండమావులలో నీ రేల యుండదు? ఆ నాయిక లీ స్వారోచికి దాసీనికరమువలెఁ బైవశమైనారు. అంతే పొమ్ము''ని (మ. 6. 72, 73) అలము సేసెను. ఇట్టి సన్నివేశమును మహాకవి మఱలఁ దెచ్చినాఁడు. ఒక హరిణోత్తంసమును లేటిపిండు, సానురాగముగ మెయి నాకుచున్నది అప్పుడు వాఁడు 'తలఁగుఁడోహో! నేను స్వారోచినే! సంకేతాక్షులతోడ నెల్లప్పుడు దర్పస్ఫూర్తిఁ గ్రీడింప' (మ. 6. 70) నని హుంకరించెనట! ఈ విషయమును మఱల మఱల చాటిచెప్పుట ఆనాటి బహుభార్యాత్వమనెడు చెడుగును ఖండించుటకే యని తోఁచును.

మన జాతికి సంప్రదాయము పాశమువంటిది. మంచిదైనను, చెడ్డదైనను వారు తొందరగ వదలరు. మార్పు బ్రదికియున్న జాతికి గుఱుతే గావచ్చును. కాని, పునః పునః పరివర్తనశీలమైన జాతి తెగిన గాలిపటమై పోవును. 'కనువేదుఱు'న జిక్కిన వరూధిని ప్రవరుని నొప్పించుటకై బ్రహ్మాండముగ శాస్త్రచర్చలు తోడినది. అన్నియు విన్న ప్రవరుఁడొకసారి నవ్వినాఁడు. నవ్వి 'మోక్షలక్ష్మీపథ్యాగమ సూత్రపంక్తి కివెపో! మీ సంప్రదాయార్థముల్' అని యొకమాటతో నెగురఁగొట్టినాఁడు. హేతువాదమును మనవారు శ్రుత్యవిరుద్ధమైన నే యంగీకరించిరి. కాని నాఁడా తర్కమునకు వెల లేదు. మనను విఱిగిన వరూధిని 'గాసట బీసట'గా పురాణ గాథలు ప్రవ్వెను. దాని కా ప్రవరుఁడు బదులే యొసఁగలేదు. వరూధిని పలుకుచుండినంత సేపు ఆమె— 'మేనిజవ్వాదిపసఁ గవుంగిలింపు నోడలు' గడిగికొనుచుండెను. పెద్దల మాటలే ప్రమాణముగాని వారి చరితములోని లోటుపాటులు గావన్న 'వ్యాసవచనము'ను జక్కగా మననము సేసిన వాఁడా మనుష్యుఁడు.

ఇంత జాగ్రత్త గలవాఁడైనను — సమకాలిక మగు నుద్రేకమునకు లోఁబడి యాకవి యౌచిత్యమును జెడగొట్టికొన్న తావులుగూడ కావ్యమున నున్నవి. వలపున గలిగిన వింత వేడికి—సిలుగులఁ బడుచున్న వరూధిని చంద్రుని బడఁదిట్టుచు.

క. గోవధము సేయుతురకల
జీవంబవు నీవు మొదలఁ బక్కగ పాంథ
స్త్రీ వధము సేయ నో [illegible]!''

యనుచున్నది. ఈ జాతిని గుఱించి పెద్దనకుఁ దెలిసినంత —వరూధినికిఁ దెలియదనుకొందును. ఇట్టివే మఱికొన్ని యక్కడక్కడఁ గనబడును

ఏండ్లను బాండ్లను, గొలికలు గట్టికొన్న, చెప్పక చెప్పెడు, నోములు నోచినమ్మలు; తామరతంపగ, మొదలైన ప్రయోగము లా మహాకవి తెనుగు బ్రతుకుల లోతులు దడవి తెచ్చినవి. కొన్ని స్వయముగ కవిసహజమైన రసవాద విద్యతో నిర్మించికొన్నవి. జముకాణము, ఘూసకము, ఇత్యాదులు-యెన్నో నాళ్ళనుండి తెనుఁగున గలిసిపోయిన కన్నడ పదాలు. మొహదా, ఫరుంజు, సిరాజీ వంటివి కొన్ని యన్యదేశ్యములు.

పెద్దనామాత్యుల శైలికి ధ్వని ప్రాణము. అక్షర సంయోజనమందాయనకుఁగల జాగ్రత్త యన్యుల కెవ్వరికిని సాధ్యముగానిది. 'తరు గహనగుహావిహార' అనుచోట - నా గవుల యొక్క వైశాల్యమును జూపుచున్నాడు. 'తనుషండమండలాంతర' యనున దగణ్యములో తఱచుండనమును, 'ఉద్దండగండక వేదండ' యను సమాసము ఆరణ్యకములైన మృగముల క్రూరత్వమును జెప్పక చెప్పుచున్నవి. వరూధిని యిల్లు చాల విశాలమైనది. ఆ వైశాల్యమును దెలుపుటకు గుర్వక్షరసంయోజన మెక్కువగాఁ గల 'శార్దూలము' గావలసి వచ్చినది. పెద్దన్న

గారి అంజని కాంచె (మ 2. 3) యను పద్యము వానలు కురిసినట్లు, వంకలు బారినట్లే యున్నది. ఈ పనినే యాతఁడు చతుర్థాశ్వాసమునఁగూడఁ జేసినాఁడు. అక్కడ నా కవి వర్ణించిన 'కరకాచిటపటరవభీకరమై' (మ. 4. 11) యనెడు రచన మచ్చముగ వాననే గురిపించును.

వరూధిని ప్రవరుని జూచి నంతనే, 'మహీసురాన్వయం బెక్కడ! యీతనూ విభవ మెక్కడ?' అని యన్నది. ఆమె కీతనిజాతి యెట్లు దెలిసెను? అసలు ప్రవరుని రూపము నాకవి 'సకలు ప్రవరు'ని జూచి యూహింపు (3. 71) మనును.

నాటి రాచమరియాదలు అమాత్యుఁడైన పెద్దనకు బాగుగాఁ దెలియును. మనోరమ పెండ్లికి నలకూబరుఁడు వచ్చినాఁడు. అపుడు యక్ష యువరాజు కూరిమి మంత్రితో నేకత మాడి కుబేరుని పేరిట వధూవరుల నాశీర్వదించి యుడుగరల సమర్పించెనట! (5. 96) ఆ వస్తువులను జదివించిన పురోహితుఁడు నారదుఁడు. పెద్దవాఁడైన కుబేరుఁడుండగా—నలకూబరుఁడు—దన పేరిట జదివించుట—అవినయప్రదర్శనముగదా! గంధర్వరాజు బిడ్డ పెండ్లికి గుహ్యకేశ్వరుఁడు స్వయముగ రాలేదు. ఆయన 'దర్జా' పెద్దది. అందుచేఁ గుమారు నంపించినాఁడు.

గంధర్వరాజును రాక్షసత్వ మావేశించి నప్పుడు పెద్దనల వర్ణన ముక మహాసృష్టి. (5. 24) ఇట్టి వర్ణనమును గాళిదాసు శాకుంతలమున రెండుమూడు చోటులఁ జేసెను. పెద్దన్న గారి యీ రచనముగూడ నా జాతికిఁ జేరినదే.

ఆనాటికవులు జిజ్ఞాసతోఁగాని, జిగీషతోఁగాని సమకాలికుల కావ్యములను జదువు చుండిరి. ఇప్పుడా రెండును శూన్యము. మనువసు చరిత్రలనిండ ఈ పోలికలే యున్నవి. అట్టివె పెద్దన్న తిమ్మనల కావ్యములందును గలవు. పారిజాతాపహరణము మనుచరిత్రకంటె ముందే ముగిసినదని నా యూహ. రెండు మూఁడుదాహరణములు మాత్రము చూపింతును. ముక్కుతిమ్మన పార్వతిని ముగ్ధ నాయికగా (పా. 1. 2) వర్ణించినాఁడు. దీనిని గాంచిన పెద్దనామాత్యులామెను 'మధ్య'గా (మ. 1. ?) దయారుజేసిరి. ఈ లక్షణముల ననుసరించి, భట్టుమూర్తి పర్వతరాజకన్య ప్రౌఢనాయికయై (వ. 1. 5) గూర్చున్నది. తిమ్మన్నగారి గణపతి వర్ణనము మంచి యర్థపుష్టి గలిగిన పద్యము (పా. 1. 3) దీనిని జూచి 'పండ్లు పులిసిన' పెద్దన్న మెల్లగాఁ జల్లని భ్రాంతిమంతము నని వేసినాఁడు. రామరాజభూషణుని వినాయకుఁడు పెద్దగా నెదిగి, సంసారమును విచారించి కొనుచున్న రాజు. శివునకు సంబంధించిన పనుల నన్నిటిని దానే చక్కఁబెట్టుచు, 'పితృప్వాంతములను' బాగుగా వెలయించి వేసెనట! ఆయన వక్త్రము సామాన్యమైన యేనుగది గాదు; అది (వ. 1. 7) 'యిభరాడ్వక్త్రము.'

'అల్లసాని'వారి హాస్యము చాల లలితమైనది. ఒక పదముచే, ఒక యలంకారముచే నాతఁడు హాస్యమును ధ్వనింపఁజేయును. వారి నవ్వు పెదవి దాటిరాదు. 'సెలవివానవ్వుట' ఆయన పెద్ద హాస్యము. ఒక్కొకసారి యట్టి ఘట్టములలో, పాఠకులనే 'యూహించికొనుఁ'డని దాటిపోవుటయుఁ గలదు. మనోరమా వివాహమునఁ బేరటాండ్రు వధూవరులకుఁ 'గడు నవ్వొందమమఁ గొలుగుల' (5. 94) ముడివెట్టిరట! వారెట్లు 'నవ్వించిరో' మనకుఁ దెలుపలేదు పెద్దనలు. తపస్సు నడపుచున్న ఋషి 'దూదిరాశిగాఁ జేసిన రీతి' నుండెనట! వారొకసారి హాస్యమును 'పాముగడు ముడిసి కడపటగామగు చందము'న—అని యలంకరింతురు. 'జిహ్వాగ్రముప్పాడుల్ల,' 'వీసాలపైఁ దేనియల్' 'ఈ పాండిత్యమునీకుఁదక్క మఱియెందేఁ గంటిమే' మొదలైనవి—పదములతో, పలుకుబడులతో వారు చేయు హాస్యములు. పెద్దన హాస్య మర్థమగుటకు మనకుఁ జాల లలితహృదయము గావలెను. 'బీద బలిసి బందెకాఁడైన పొరువులు బ్రదుకుఁగనునె!' ఇది—'అల్లసాని' కవుల దండి హాస్యము.

పెద్దనామాత్యులు రాయల కాలమున సాహిత్యమున వెలిఁగిన మహాజ్యోతి. ఆనాటి యన్ని కావ్యములును ఆ సహస్రకిరణుని కాంతి పుంజముచే జిగజిగలాడినవే. వారిని విడచిన విద్యానగర సాహిత్యమే లేదు. వారున్న నికఁ గావలసినది లేదు. అతని కవిత రత్నాకరము. దానినుండి నాటి కవులు కావలసిన 'జాతి రత్నము'ల నేరుకొని, 'చిలుసానలు' పట్టించికొన్నారు. కవితాపితామహులు చెఱచిన పాత్రలుగూడ—'స్వారోచి'ని బోలినవి—గొన్ని యున్నవి. అవియు రత్నాకరమున జలజంతువుల వంటివి. అంతే! (సశేషము)

# రాజరంజన విద్యావిలాస నాటకం

శ్రీ ఎస్. వి. జోగారావు.

ఇది తంజాపురాంధ్ర తాళపత్ర గ్రంథ సంచయమునకు చెందిన యొక అముద్రిత యక్షగానము. ఆంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రచురించిన కేటలాగులో గాని, ఆంధ్రవాఙ్మయ సూచికలో గాని యిది పేర్కొనబడలేదు. కాని యొక కాగితపుప్రతి ఆంధ్రవిశ్వకళాపరిషత్తున గలదు.

గ్రంథకర్త :

తంజావూరు మహారాష్ట్ర ప్రభువులలో నొకడగు తుళజరాజు. ఆ భోసలరాజ వంశమున తుళజ నామధేయు లిరువురు గలరు. ముందు నిరూపింపబడు గ్రంథస్థ నిదర్శనములబట్టి ఏతద్గ్రంథకర్త తలిదండ్రులు దీపాంబ, ఏకోజీ-శహాజీశరభోజు లితని కగ్రజులు. ఆ మహారాష్ట్ర రాజవంశమున ఏకోజీలును ఇరువురు గలరు. కాని యేతద్గ్రంథావతారికలో ఏకమహారాజసుతుడౌ నతడు 'శాహాజీసింద్రాత్మజు' డని యున్నది. అతడే ఛత్రపతి శివాజీకి సవతి తమ్ముడు, తంజాపురమున మహారాష్ట్రప్రభుత్వ ప్రతిష్ఠాపకుడును. అందుచే నీ గ్రంథకర్త మొదటి తుళజరాజగుచున్నాడు. రెండవ వాతడు గ్రంథకర్త యైనట్లు నా 'ఆధారి' కందలేదు. ప్రస్తుత గ్రంథకర్తకు 'తుక్కోజీ' అను నామాంతరము గలదు. అతని రాజ్యపాలన కాలము క్రీ. శ. 1729-35. (ఆం. వి. ప. కేటలాగు). ఈ గ్రంథరచన మా కాలముననే సాగియుండ వచ్చును. శివకామసుందరీపరిణయ మను నింకొక యక్షగానము, సంగీత సారామృతమను నొక శాస్త్రగ్రంథము నితని గ్రంథాంతరములు. ఆ రచనల పౌర్వాపర్యవిచారమునకు ఆధారము లగుపింపవు. తుళజరాజు విష్ణుమతసహిష్ణు వగు శివభక్తుడు. పాడి యెరిగిన రాజు, కవి, పండితుడు, శాస్త్రనికషాయితమైన సంగీత ప్రియత్వము గలవాడు. తలిదండ్రుల యెడనె కాక అన్నలన్నను నతి భక్తిప్రపత్తులు గలవాడు అని గ్రంథావతారికల ద్వారా విశదమైనది. ఆ యోగ్యత లన్నియు నొక యెత్తు. అతని అద్వైత తత్త్వజ్ఞాన మొక యెత్తు. ఆ జ్ఞానమే యీ యక్షగానరచనమున కధిష్ఠానము.

గ్రంథావతారిక :

నాంది. ద్వి. 'శ్రీసచ్చిదానంద శివ జగత్కంద
సామాదినిగమప్రసవమకరంద
అతిశయాధార పద్మాంతరామోద
తతమధువ్రత లసత్ప్రియ స్వరూప
పరిపూర్ణ నిర్గుణ బ్రహ్మాండకోటి
సురుచిరమణిసూత్ర (సు) జ్ఞానదీప
సరసాక్షిగా కాన సజ్జనాధార
కరుణించి రక్షించు కరుణాపయోధి.'

నాంద్యంతమున వసంతవర్ణనము. సూత్రధారుడు వచ్చి పారిపార్శ్వకుని పలకరించి 'తుళజమహీపురందరుండు గావించు నాదివరాహస్వామి మహోత్సవంబు కనుగొన పరమహంసలు, పరమయోగులు, పరమమునులు, పరమ వైష్ణవులు, తక్కిన రసికజనులు వచ్చి సభ గూడినారు —

'ఇహపరంబులు గల్గ నూహించి భక్తి
నెలయ తుళజేంద్రుడు వెలయ గావించినట్టి
రాజరంజన విద్యావిలాస మిప్పు
డిదె యొంతయు సభ మెచ్చ నద్భుతముగ'

అని పది సంస్కృత శ్లోకములలో వరుసగా నిత్యానందమును శుభమును, సరస్వతిని, ఆదిమకవులను, ఏకమహారాజ దీపాంబికలను, శహాజీ శరభోజులను స్తుతించి, సభాసమస్కారము చేసి, భూదేవిని ప్రార్థించి పుష్పాంజలి సమర్పించును. తదుపరి యొక ద్విపదలో కథాసంగ్రహము చెప్పబడినది. తరువాత పారిపార్శ్వకు 'డద్వైత' మాహాత్మ్యము నుగ్గడించును. సూత్రధారుడు విఘ్నేశ్వరు నావాహనము సేయును.

కథ :

పారిపార్శ్వకుడు 'విఘ్నేశ్వరుడు వచ్చెను, మహాసంతోష మాయె నోయి' అని 'పలికిన మాట వెంబడినె సంతోషుడు' (ఆత్మమహారాజు కొలువు కటికీడు) వచ్చును. వాడు వచ్చి సభకు హెచ్చరిక చేసిన యంత పుండరీకపురాధీశు డాత్మమహారాజు కొలువునకువచ్చును. అపుడు మాయాదేవి అరిషడ్వర్గ జనయిత్రి,

గాత్రపురాధిపతి యగు జీవరాజు మంత్రులు చిత్తశర్మ సుజ్ఞాన వర్మలు దన్ను చూచుకొని తన్ను తనయాసహితముగా వెడల నడువగా 'కడుపు చురుక్కని' యట గదలి తన 'కంచంత కాపుగ' మాగడి వోయినదని మెరగబెట్టుకొనుట కాత్మరాజు నగరి 'బంకు' (మొగసాల?) వాకిటికి వచ్చి కటికముతో రాజుగారికి 'నా మాట మండలించి (విన్నవించి, చెప్పి) భేటి (సముఖము) చేయించవోయి' అనును. భేటి యగును. ఆ భేటికి మాయాదేవివలె ఫిర్యాదీలై మోహుడు, కర్మశర్మ, 'పశుపక్షులకును సైతము సకల స్వర్గఫలము సమకూర్చువాడు' సుఖాభిధానుడు, 'వ్యవహారం తప్పి మాట్లాడితే యెవరి పేరైతునుగో ఆ పేరు' గలవాడు ధర్ముడు (వాడు నైషధమున కలిమహాశయుని విధమున నుపన్యసించును), తామసీ బుద్ధియు వత్తురు. జీవరాజు మంత్రులమాట విని మంచివాడై పోవుచున్నాడని వీరి విచారము. ఆ సందర్భమున ఆత్మరాజు రాజనీతి ప్రవచనము!

'తా వివర మెఱిగి సచివుని
భావస్థితి తెలియు రాజు పడయును శుభముల్
కేవలసచివాయత్తత
భూవిభు కేవేళ కీడు పొందించు మహిన్.'

తరువాత రాజుగారు 'ఓరిమి మోహన యోగి! నీవు... దేహపుగస్థితి తెలుసుకోగవి! ఊహింత మటుమీద నుచితకర్మములు' అని మోహుని నియోగింతురు. అక్కడితో కథారంగము మారును.

జీవరాజు కొలువు ముందుగా ధర్ముడు సభవారి నెచ్చరింపవచ్చును. తరువాత చిత్తశర్మ వచ్చి, ఆత్మరాజు మాయాగుల కథయు మిచ్చి తమపై వారిని పురికొల్ప నున్నాడని 'వలనొప్ప నే గాలి వార్తగా వింటి' నని చెప్పును. సుజ్ఞానవర్మయు, నిశ్చయుడును వత్తురు. ఆ వేళకు మృగేంద్ర వాహనము లేదు గాని మణిస్తంభునివలె దిగినాడు మోహన యోగి. నాటకము పేరు సార్థక మగునట్లు జీవరాజు, అతని యాప్తవర్గమువారలు నాశ్చర్యచకితులగునట్లు వింతవింతవిద్యలు ప్రదర్శించును. జీవరాజతని నిన్ని విద్యలింత పిన్నవయసున నెట్లు లబ్బెనని ప్రశ్నించును. అంతయు శివుని చిత్తము, తన తపోభాగ్యము నని వాని సమాధానము. అది విని నోటినుండి జీవరాజు తపశ్శిక్షీర్షు వగును. ఆత్మరాజతని తపమునకు మెచ్చి శివస్వరూపమున సాక్షాత్కరించును. అంత జీవేశ్వర సంవాదము - జీవుడు ముక్తి నిమ్మని: శివుడు 'వినవోయి జీవరాజ! సంసారములో నున్నప్పటికిన్ని ఘాసలలోని దారము వలె నిస్సంసారివై నిగామయుండవై యుండవోయి' అని. అవితథము శివునాజ్ఞ. తరువాత జీవరాజ మాయాదేవులకు వాగ్వాదములు నడచును. మాయ తన కన్నకొడుకు కాముని పెండ్లికొడుకు నొనర్చి వంశ ముద్ధరించి పుణ్యము కట్టుకొమ్మని శివుని బతిమాలును. రతిమన్మథుల రాకలు వర్ణింపబడినవి. మాయాదేవీజీవేశ్వరుల ఆధ్వర్యవమున వారి కల్యాణకాండ జరుగును. మటోపాలి తిమ్మనభట్లు, దోశల కాశీభట్లు 'వివాహంబునకు యాజ్ఞికంబు సేయ' నరుదెంతురు. వారి వెంట పేరటాండ్ర రాకలు. వారి రాక లెల్ల వెటకారనుగా వర్ణింపబడినవి. అట్టి వెటకారములు నాటి కృతులందు మిగుల సామాన్యమైన విషయము. గంధర్వుల మంగళగానముతో గ్రంథము ముగియును.

గ్రంథాంతగద్య :—

"శ్రీ మద్భోసలకుల కలశాంభోధి రాకాశశాంక సముగ నిష్కళంక, వృషాంక పాద పంకజ సేవాధురంధర సకల భాషాకవితా నిర్వాహక విలస దేకమహారాజ దీపాంబికాతనూజ శాహమహారాజ శరభ రాజానుజ తుళజమహారాజ ప్రణీతం రాజ రంజన విద్యావిలాసనాటకం జగమాత్మ ప్రీతయే సకల విద్వన్మనేకకల శ్రేయసేఽస్తు॥ శ్రీ దక్షిణామూర్తయేనమః॥"

గ్రంథసమీక్ష

విషయము తాత్త్వికము. విశేషన సాంకేతికము. జీవన్ముక్తిని, గృహస్థాశ్రమమును సమర్థించును. కథారంభమున పారిపార్శ్వకవచనము ద్వారా గ్రంథ ప్రతిపాద్య విషయము అద్వైత సంబంధి యని కవియే సూచించినాడు. ఇతివృత్తమును బట్టి తంజావూరు గ్రంథసంచయమందలి పరమానంద తీర్థయతి ముక్తికాంతా పరిణయము, చల్లా సూరయ్య వివేక విజయము నిట్టివే. అప సీతరగతి కావ్యము లన్నియు కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయమునకు మానసు

వారు. వారి ప్రోత్సాహముచే శాస్త్రులుగారు మద్రాసు చేరుకొనిరి. తమ కవితా పాండిత్య ప్రతిభావిశేషములచే అచిరకాలములోనే మద్రాసునందలి యాంధ్రప్రముఖులు శ్రీ రెంటాల వేంకటసుబ్బారావు పంతులుగారు, శ్రీ వప్పాకం అనంతాచార్యులు, పండిత డి. గోపాలాచార్యులు, శ్రీ వేదం రామేశము పంతులుగారు, శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు మున్నగు పెద్దలు వారి సాహిత్యము యాదరాభిమానములకు గురియైరి. ఒకటి రెండేండ్లు ట్రిప్లికేన్ హిందూ హైస్కూలులో, ప్రసిడెన్సీ కాలేజీలో సంస్కృతాంధ్ర పండితులుగా పని చేసిరి. పిదప ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో ప్రవేశము సంపాదించుకొనిరి. ఆనాఁడు మద్రాసులో గల సభలలో, సమావేశములలో, నాటక ప్రదర్శనాదులలో తప్పనిసరిగా శ్రీ శాస్త్రులుగారికి ప్రవేశప్రాముఖ్యము లుండెడివి. వాని కెవరు శ్రీ శాస్త్రిగారంతో యింతో యుపన్యసింపవలసినదే. ఏదో కమ్మని పద్యములు వ్రాసి చదువవలసినదే, అభినందింప వలసినదే. శ్రీవారి ప్రశంసలను బడయకున్నచో నాఁడు వాని కంతగా గణింపే లేదు.

గవర్నమెంటు ఓరియంటల్ లైబ్రరి తెలుఁగుశాఖలో నద్యోగులుగాఁ జేరి బహు గ్రంథములను పరిశీలించిరి. తీవ్రమైన పరిశోధనలను జరిపిరి. క్రమముగా ఆ శాఖకు అధ్యక్షులైరి. ప్రభుత్వము వారి యాదేశము మీఁదనే తంజావూరు లైబ్రరీకిఁ బోయి ఆ తెలుఁగు గ్రంథముల నెల్లఁ బరిశోధించిరి. అముద్రితములై యుండంగు మఱుగుపడి యున్న సంస్కృతాంధ్ర గ్రంథముల సేకరించు పని మీఁదఁ దెలుఁగు దేశము నాలుగు చెఱగుల సంచరించిరి. ఉద్దండులగు పండిత ప్రకాండులను పలువురిని కలసికొనిరి. పెక్కు తాళపత్ర గ్రంథములను, వ్రాఁత పుస్తకములను వెలికిఁ దీసిరి; అనేక శాసనములను సేకరించిరి. వాని నన్నిటిని చక్కఁగాఁ బరిశోధించి భాషా విషయకములగు నిగూఢరహస్యముల నాంధ్ర లోకమున కందించిరి. శ్రీ వారి సారస్వతాబ్ధి మథనమునఁ బొడమిన యమృత ప్రవాహములే చాటుపద్యమణిమంజరి రెండు భాగములు, శృంగార శ్రీనాథము, బసవ పురాణ టీక, తెలుఁగు మెఱుఁగులు, [illegible] తళుకులు మున్నగునవి.

1916 సం॥ ప్రాంతములో శ్రీ ప్రభాకరశాస్త్రులు గారికి జబ్బు చేసినది. కొంత కాలము సెలవు పెట్టి సకుటుంబముగా స్వగ్రామము చేరుకున్నారు. ఆ సెలవులో గురుపాదులగు శ్రీ వేంకట శాస్త్రులుగారి దర్శనార్థము బందరు వచ్చినారు. ఆ తరుణమున నేను శ్రీ వేంకటశాస్త్రుల వారి యొద్ద సిద్ధాంతకౌముది చదువుకొనుచున్నాను. అప్పుడే నాకు శ్రీ ప్రభాకరశాస్త్రిగారితో ప్రత్యక్షముగా పరిచయ భాగ్యము కలిగినది. ఇది నాకు శాస్త్రిగారితోడి రెండవ సతీర్థ్యత్వము. మొదటి సతీర్థ్యత్వమును గూర్చి చెప్పవచ్చే శ్రీ వారి ముఖముఁ దెలిసి కొన్నాను. శ్రీ వారికి నాయందు దయాదాక్షిణ్య మేర్పడినది. దగఱకుఁ జేరఁ బిలిచి కొత్త విషయములఁ జెప్పుచుండువారు. ఉభయులము కలసి మెలసి తిరుగుచుండు వారము. ఒకే మంచముపైఁ బండుకొనువారము. శ్రీ వారి ప్రతిభా విశేషము, పాండిత్య ప్రకర్షము, కవితా ధురీణత్వ విమర్శకత్వాదులు లేక పోయినను, ఒక్క సతీర్థ్యత్వ సౌజాత్యమును బురస్కరించుకొని యుబ్బి తబ్బిబ్బై పోవుచుండువాఁడను. క్రమముగా మా స్నేహము వృద్ధి పొందినది. తరువాత మద్రాసు నుండి వారు శెలవులకు వచ్చినపు డెల్ల వారి యింటనే కాని, మా యింటనే కాని, వారి శ్వశుర గృహముననే కాని యుభయులము కలసి యుండవలసినదే.

శ్రీ శాస్త్రుల వారి కప్పట్లో కల్గిన వ్యాధి యే మందు మాకులకు లొంగక పోయినది. వారిలో నిరుత్సాహము, అశాంతి, వెఱపు ప్రబలినవి. తలవని తలంపుగా, పురాకృత సుకృత ఫలముగా శాస్త్రిగారికి కుంభకోణ వాస్తవ్యులగు శ్రీ సి. వి. వి. స్వామి పాదుల శిష్యత్వము లభించినది. వారి కరుణా కటాక్షముచే చేతితోఁ దీసి వైచినట్లు వ్యాధి నిర్మూల మైనది. వెనుకటి నిరుత్సాహ భయాదు లంతరించినవి. నూతనోత్తేజ మేర్పడినది. జీవితములోఁ బెద్ద మార్పు వచ్చినది. తాను తరించి లోకమును తరింపఁజేయవలెనను దృఢ నిశ్చయ ముదయించినది. అంతకు మున్ను

చేయుచున్న యుత్కృష్టమగు భాషా సేవ కూడ వారి దృష్టికి నిక్కృష్టముగాఁ గాడఁ దూపినది. శ్రీ కే. వి. వి. స్వామి వారి యుపదేశానుసారము యోగాభ్యాసము చేయ సాగిరి. ఎప్పటికి కష్టతరము గురుపాదులవలన సంశయములను దీర్చుకొనుచుండిరి. దీక్షతోఁ గృషి చేసిరి. కొంతకాలమునకు శాస్త్రులుగారి కృషి ఫలించినది. అపూర్వములైన కొన్ని యోగ సిద్ధు లలవడినవి. తన్మూలమునఁ బెక్కు మొండి వ్యాధులను నిర్మూలము చేసిరి [illegible]

ప్రభుత్వోద్యోగమునందు విరమించక పూర్వ మీఁదట సారస్వత సేవాధురంధరులగు శ్రీ శాస్త్రులుగారిని తిరుపతి శ్రీ వేంకటేశ్వర స్వామి వారి ప్రాచ్యభాషాపరిశోధనాలయము లోనికిఁ గొనిపోయిరి. అక్కడఁ గూడఁ బెక్కు [illegible] పరిశోధనములను గావించిరి. శ్రీ శాస్త్రిగారి దృష్టి తాళ్లపాక వారి పద కవిత్వముపైకిఁ బ్రసరించినది. చిక్కని నుడికారము, చక్కని భావములు గలిగి తాళపత్రములలోను, రాగి రేకుల మీఁదను జీర్ణించి పోవుచున్న మధుర మధురములైన కీర్తనలను వేల కొలఁదిగా సేకరించి వాఙ్మయ లోకమున కెఱుకపఱచిరి.

మా గురుపాదులగు శ్రీ వేంకట శాస్త్రులు గారిని ఆస్థానకవి పట్టభద్రులనుగాఁ జేసి మద్రాసు ప్రభుత్వము గౌరవించు సందర్భమున బెజవాడలో శ్రీ శాస్త్రులుగారిని కట్టకడపటగాఁ గలసికొన్నాను. తిరుపతి వచ్చి తిరు సన్నిధిలో పదిరోజుల పాటు ఉండవలసినదిగా నిండు వాత్సల్యముతో సెలవిచ్చిరి. కాని నాకా భాగ్యము పట్టలేదు. ఎప్పుడో సావకాశముగాఁ బోవుద మనుకొను వాఁడను. అంతలోఁ దలవని తలంపుగా శ్రీ శాస్త్రులు గారు భౌతిక దేహమును వదలి వేసినారు. స్వకుటుంబమును, బంధుమిత్ర శిష్యవర్గమును, తెలుఁగు లోకమును అపారమగు దుఃఖ సముద్రమున ముంచి వదలి వేసిరి. ఇది శాస్త్రుల వారి జీవిత సంగ్రహము.

శ్రీ శాస్త్రిగారి కవిత్వము మిగుల రసవంతమై గంభీరమై ముద్దులు మూట గట్టుచుండును. పద్యమును చక్కగా దువ్వి దిద్ది తీర్చి హృద్యముగ తయారైన మీఁదటనే గాని బయటఁ బెట్టువారు కారు. యతిప్రాసలకై పడికట్టు రాళ్లు వేసికొనుట, వ్యర్థములైన పదములతో నేదో విధముగా పేలవముగా పద్యము పూర్తి చేయుట శాస్త్రిగారికిఁ గిట్టని విషయములు. పద్యగమనలో వారికి శ్రీనాథుఁ డాదర్శము. కమ్మచ్చున లాగిన తీగ లాగున శాస్త్రిగారి పద్యములు నొగ్గులు లేక సాఫుగా సాగి పోవుచుండును. చూడుఁడు.

శా. అంగీకారప్రేమడిం జెలఁగు భా
ర్యాభర్తృ లేతత్కథా
నాదం బాలసి మేలుగాంతు రనుచు
త్సాహమ్ముఁ గ్రొత్తి నిం
డాంగ [illegible] మైన యొక గా
థాగ్రంథ [illegible] వ్రాయుచుంగా
నాంధ్రాంచితి నిదే సుకవితా
వ్యాపారపున్ ధోరణిన్.

శ్రీనాథుని చాటువుల వలెనే శ్రీ శాస్త్రిగారి చాటువులు గూడ మిక్కిలి హృదయంగమములైనవి పెక్కులు గలవు. మచ్చునకుఁ గొన్నిటి నిందు నుదాహరింతును.

ఒకనాఁటి ప్రాతఃకాలము శ్రీ శాస్త్రులు గారు శ్రీ గంటాల సుబ్బారావు పంతులు గారితోఁ గలసి యొక తటాకతీరమున ముఖ మార్జనము చేయుచుండిరఁట. ఆ చెరువున నొక వనిత శుద్ధస్నానము చేయుచున్నది. పంతులుగారి కోరికపై నా దృశ్య విషయమును గూర్చి శ్రీ శాస్త్రులుగారు చెప్పిన పద్య మిది.

సీ. కొనగోటఁ గురుల చిక్కులు దీర్చి ముడిచుట్టి
నలుగులం దిలలఁ జూపుల లోలయఁ జేసి
యొడుగుటు గుబ్బల లైక కదలించి దుసికిళ్లు
వెలయఁ బయ్యెంటచేఁ గలయఁ బొదివి
గుమురెత్తు పులకల నిమిరి పొక్కిలిబంటి
నీట లేయెండ మై నాట డిగ్గి
గుమ్మడిమూటగాఁ గూర్చుండి చిగురాకు
దొప్పదోయిటఁ నీ రప్పళించి

గీ|| కరఁగి పోసిన పొంగుబంగారు వోని
యొరపు మైకాంతి తరఁగలఁ బొరలియాడ
గొలనఁ గనుగొమ్మ చెలికాఁడ! జలకమాడు
చెలఁగు మాసినచిన్నారి చిగురుఁబోఁడి.

ఒకప్పుడు మే ముభయులము శ్రీ చల్లపల్లి రాజా వారి కోటలోని పూఁదోటకుఁ బోయి నాము. ఒక సంపఁగిపూవు నెత్తావిచే మ

మ్మాకర్షించి దర్శన మిాకపలు తిప్పలు పెట్టినది. అప్పుడు శాస్త్రిగారీ పద్యముం జెప్పిరి.

శా. ఇంపుం బెంపున నీదు సౌరభము మ
మ్మోనాఁడు మమ్మాకొను రా
వింపం బేరడియాస పాల్పడియు ని
న్వీక్షింప రావయ్యె; మ
న్నింపం జెల్లదె గంధగౌరవమున
న్నిండారు నీతీ గహో!
చాంపేయంబ! గుణాతిరేక మెసఁగన్
శ్లాఘ్యంబ కా గర్వమున్.

స్వభావోక్తులు, అర్థాంతర న్యాసములు శాస్త్రులుగారికి మిక్కిలి ప్రియములు. ఒకప్పుడు శాస్త్రిగారు నెల్లూరి సీమలోఁ బర్యటించుచుండఁగా ఎవరో యొకరు గురువర్యులగు శ్రీ వేంకట శాస్త్రులవారిం గూర్చి హేళనగా మాటాడ నిట్లు సమాధానము చెప్పి తమ గురుభక్తిని వెల్లడించిరి.

ఉ. కొంకులు వోవు సత్కవన
గుంభన, మంతకు మించి బింకపుం
బొంకము గల్గఁగాఁ జవులు
పొంపిరి వోవఁ బలించు నేర్పు మా
వేంకటశాస్త్రి పండితక
విప్రభుసత్కృతిఁ దక్కఁ దక్కువి
ద్యాంకుల యందు నెందుఁ గల
దా? సకలాంధ్రమహామహీస్థలిన్.

ఒకప్పుడు శ్రీ శాస్త్రిగారు గుంటూరు జిల్లాకు క్యాంపు వెళ్ళిరి. ఏదో పనుల మీఁద నందందుఁ దిరిగి యెండఁ బడి డస్సి బసకుఁ జేరుకొనిరి. అప్పుడు చెప్పిన పద్యము శాస్త్రిగారి యర్ధాంగి యొక్క యుత్తమశీలమును గండ్లకుఁ గట్టినట్లు చూపుచున్నది.

ఉ. దూరమునుండి యెండఁ బడి
దూపిలి యింటికి నేగుదెంచుచో
ప్పారసి కూర్మి పేర్మి విన
యంబు భయంబు దొలంకుచూడ్కి నిం
డారిన మోముతోడ నెదు
రయ్యెడి తొయ్యలి డించి కేశసం
చారము సేఁత గోఁత; పరి
చారకులా? ధనమా? వృథా వృథా."

ఒకప్పుడు గురువర్యులగు శ్రీ వేంకటశాస్త్రులు గారి నిట్లు కుశలప్రశ్న గావించిరి.

సీ. కుశలమే మీకు, మీ కులవర్గములకు? వి
ద్యావ్యాసంగమునఁ గ్రొత్త యంట్లు గలవె?
తిరుపతి గురుకవీశ్వరు చరిత్రము రచిం
చెద రంటే? యది ముగించితిరె కాదె?
అవధానములు నూడ నర్థ్యపూతులు కేఁడ
నేగుచుందురె యొప్పు నెపటికేని?
గాటంపుఁ దమిఁ దోట నాటుకొన్నావు నిం
డారఁ బండెనె జహాంగీరుమావి?
గీ. కుంకుఁ గుజ్జుల నునుతొక్కు పల్కులందుఁ
బసిమి దేరిన మామిడిపండులందుఁ
బ్రౌఢిమీరిన సుకవితాఫణితులందుఁ
జక్క గుఱుతించుచుందురే చవులవారి?

ఇట్టి చాటువుల నెల్ల సేకరించి యొక గ్రంథరూపమునఁ బ్రకటించుట యత్యంతావశ్యకము. శ్రీ శాస్త్రులవారి దృష్టి యాధ్యాత్మికము వంకకు మరలి పై మెట్టునకుఁ బోవుటచే మొదలు పెట్టిన గ్రంథములే పెక్కులు పూర్తి కాకుండ నిల్చిపోయినవి. ఆ గ్రంథముల గురదృష్టము. శివ్యదర్శనము, లోకయాత్ర, మొదలగునవి పూర్తి చేసి యున్నచో నాంధ్ర భాషాయోష కమూల్యాలంకారములై శాశ్వతముగా వెలుగొందుచుండెడివి.

శ్రీ శాస్త్రులుగారి కవితా ప్రాశస్త్యమును గూర్చి నేను చెప్పఁ బూనుటకంటె మా గురుపాదుల ముఖమునుండి వచ్చిన మాటల నుదాహరించుట మేలు. ఒకనాఁడు శ్రీ వేంకటశాస్త్రులు గారు తమ గీరత ద్వితీయభాగ మగు గురుదక్షిణను దీసి అందు "సతీర్థ్యసంప్రాప్త"మను శీర్షికతో నున్న ప్రభాకర శాస్త్రులుగారి పద్యములను జదివి వినిపించి "నాకు నచ్చునట్లుగా మరలఁ గవిత్వము చెప్పఁగలవాఁడు మా ప్రభాకర మొక్కఁడే; ఈ పుస్తకము తీసినప్పు డెల్ల నీ పద్యములు చదువ మనస్సు పుట్టును" అని సెలవిచ్చిరి. ఇట్లు గురువుల మెప్పు వడసిన కవిశేఖరులు ప్రభాకరశాస్త్రిగారు.

సంస్కృతాంధ్రములలో నెంత వారికిని గొఱుకుపడని యనేకపద్యములకు నిర్దుష్టముగా, సరసముగా నర్థసమన్వయము చేసి మాపిన పండితప్రవరులు శ్రీ శాస్త్రిగారు. తెలుగు పదముల సాధుత్వాసాధుత్వములను గూర్చి ప్రయోగ విశేషములను గూర్చి పలువురు పండితులు శ్రీ ప్రభాకరశాస్త్రిగారికి వ్రాసి సలహాల నందుచుండువారు. భారతిలోఁ బ్రకటితములైన వారి

# శరణార్థి

[ముప్పై ఏళ్ల క్రిందట శాస్త్రిగారు చేసిన రచన యిది. గురజాడవారంటేనూ, వారి రచన లంటేనూ శాస్త్రిగారి కుండే మోజుకొద్దీ ఆనాళ్లల్లో వారు వారిలాగే ముత్యాలసరాలను కూర్చారు. ముత్యాలసరా లంటే కన్నడ భామినీషట్పదిలో 'చక్కసగమే'! ప్రాచీనకన్నడకవు లెవరూ దీని నాదరించలేదు. ప్రజాకవులే దీన్ని ఆదరించారు. అయినప్పుడు గురజాడవారూ, సాహిత్యం ప్రజానుబంధి అని గుర్తించిన శాస్త్రిగారూ దీనిని పరిగ్రహించడానికి గల కారణం వెదకడం చర్వితచరణం.

—సంపాదకులు.]

త్రాహి లోక మశేష మేత
న్మోహ మపనయ నిత్యశుభ మా
ధేహి సాహి జగద్గురో! ఇత
ఏహి భో స్వామిన్ !—అభయం
దేహి భో స్వామిన్.—

మీఱితిమి మీయాజ్ఞ, లోకో
ద్ధారకుల మని పొంగితిమి పై
బోరగిలఁబడు టెఱుఁగ మైతిమి
ప్రోవుమా తండ్రీ! దయతోఁ
గావుమా తండ్రీ!

అధికులము మే మనియు వే ఱిత
రధము లని దంభోక్తు లాడితి
మధఃపతనం బెఱుఁగ మైతిమి
ఆనుకొను తండ్రీ - దరికిని
జేనుకొను తండ్రీ!

నీరుమీఁదను నేలమీఁదను
నింగిమీఁదను వెలయఁ గంటిమి
చేయు నెఱుఁగక పోతి మిఁకర
క్షింపు మో తండ్రీ—దయ వీ
క్షింపు మో తండ్రీ!

పూనితిమి విశ్వాధిపత్యము
పొంగిపోయితి మంతె కాని
మానవుల మనుమాట మఱచితి
మాను మా తండ్రీ—తప్పిద
మాను మా తండ్రీ!

సత్య మెఱుఁగము నిత్య మెఱుఁగము
కృత్య మెఱుఁగము వ్యత్యయంబుల
నత్యయంబులఁ దీయుచుంటిమి
యరయు మో తండ్రీ—మాలో
మెఱయు మో తండ్రీ!

క్రమము తెలియదు తెలుపఁ గలయొన
గాఁడు లేఁ డటు నిట్టుపఱచుచుం
భ్రమయుచుంటిమి కటికచీఁకటిఁ
బాపు మో తండ్రీ—వెల్తురు
చూపు మో తండ్రీ!

ఆయె నింతకు దుర్వివేక
చ్ఛాయలోఁ బడి కొట్టుకొండఁగ
మాయు పెంపెర గప్పి తది పెడ
ద్రోయు మో తండ్రీ—యిట దయ
చేయు మో తండ్రీ!

ఈ వ్యథలు భూకంపములు మ
గ్రహ వ్యవస్థల దాఁటినవి, మీ
దివ్యదర్శన మిచ్చి వీనిం
దీర్చు మో తండ్రీ – మముఁ గడ
తేర్చు మో తండ్రీ!

త్రాహి లోక మశేష మేత
న్మోహ మపనయ నిత్యశుభ మా
ధేహి సాహి జగద్గురో! ఇత
ఏహి భో స్వామిన్ !—అభయం
దేహి భో స్వామిన్!

వే. ప్రభాకరశాస్త్రి

# “తెలుఁగుం బోలంతికిఁ బేటులు రేగు గందవొడిపూఁతలు

శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు.

శ్రీ వేటూరివారి పీఠికలు విలక్షణ లక్షణోపేతములు. వారు గ్రంథమునందలి కండపట్టులైన విషయములను స్పృశించి కూలంకషముగ విమర్శింతురు. అణఁగి మణఁగి యున్న విషయములను వెలికి తీసి వెలుఁగులోనికి తీసికొని వచ్చి వానికి సాహిత్యక్షేత్రమున స్థానమును గల్పింతురు. ఈ విశిష్ట లక్షణములు రెండును శ్రీ శాస్త్రిగారి పీఠికలకు పెట్టనిభూషణములు.

ఆయా గ్రంథములకు వేటూరివారు వ్రాసిన పీఠికలందు భాషాకవి చరిత్రాత్మకములు, ఐతిహాసికములు, భౌగోళికములు, సాంఘికములు నైన విషయములు కోకొల్లలుగా గోచరము లగుటచే విషయవిభాగ మొనర్చి వానిని పర్యాలోకించుట అవసరము. సారస్వతపీఠిక లనియు, చారిత్రక పీఠిక లనియు వారి పీఠికలను ద్వివిధముగ విభజింపవచ్చును. భాషాకవి చరిత్రాద్యుద్బోధక విషయములు సారస్వత పీఠిక లందును, రెండవదానిలో సాంఘిక, చారిత్రకాది విషయములును చర్చింపఁబడును. తొలుత సారస్వతపీఠికలను పరికింతము.

భాషాకవి చరిత్రాది జిజ్ఞాసువులకు ప్రబంధరత్నావళియు, చాటుపద్యమణిమంజరి ప్రథమ ద్వితీయ భాగములును తోడునీడలు. వ్రాఁబడిన కవనములయందలి బాగోగుల నరసికొనుటకీ బృహద్గ్రంథములు గీటుఱాళ్లు. ప్రాచీన కవీశ్వర రచితములగు చాటుధారలతో నిండి నిబిడీకృతములైన యీ గ్రంథములం దొక్కొక్క కవిప్రవరునిగూర్చి వారు పలికిన పరిచయ వాక్యములు బంగరుటక్షరములతో లిఖింపఁదగినవి. సంక్షిప్తతలో సమగ్రతను మూర్తీభవింపఁజేయు మహత్తరశక్తి వారి లేఖినికి కలదు. వెత్తితలలు వేయువాదములు కలుపక, సాధ్యమైనంతవఱకు సత్యాన్వేషణము నే సలిపిరి. కావున ఆయా పీఠికలకు చిరంజీవిత్వము సిద్ధించినది. ప్రబంధరత్నావళి పీఠికలో వారు నన్నిచోడ, భీమన కవిపుంగవుల కాల విచారమును కొంతవఱకు జరిపిరి.

కవిరాజ శిఖామణి బిరుదవిరాజితుడగు నన్నిచోడ దేవుడు నన్నయార్యునికంటె ముందటివాఁడనియే విశ్వసించువారు నేటికి కొందఱు లేక పోలేదు. శ్రీ వేటూరి వారు తంజావూరు సరస్వతీ మహల్ పుస్తక భాండాగారమునందు కుమారసంభవమునకు లభ్యమైన ఏకైక ప్రతి నాధారముగ చేసికొని యీ వాదమును సునిశితముగ విమర్శించిరి. పూజ్యులు శ్రీ మానవల్లి రామకృష్ణకవి గారి... 'నిలిపి రంధ్ర విషయమునఁ జన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్' ఈ పాఠము ననుసరించి సత్యాశ్రయుని విషయమై చేసిన ఊహాపోహలను పెడచెవిని బెట్టి శ్రీ వేటూరి వారు తంజావూరి ప్రతిని పురస్కరించుకొనియే ఒక నిర్ణయమునకు వచ్చిరి....నిలిపి రంధ్ర విషయంబునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్——' అను పాఠము నాధారము చేసికొని చాళుక్యరాజనగా రాజరాజ నరేంద్రుఁడే ఏల కాకూడదనితలచి, చోడఁడు నన్నయకంటెఁ బ్రాచీనుఁడనుట కాధారములు తగినవి లేవు అని వేటూరి వారు నిర్ణయించిరి. కుమార సంభవమునకు ప్రత్యంతరము లభ్యము కానంతవఱకు ఈ వాదమే నిజమునకు దగ్గఱ చుట్టముగా నున్నట్లు తోఁచును. ఏల యన, ఆంధ్ర వాఙ్మయ చరిత్రకు రూపురేఖలు దిద్దిన రాజకులైకభూషణుడగు రాజరాజ నరేంద్రుఁడే చరిత్రకు తెలియవచ్చిన తొలితెలుఁగు భాషాపోషకుడు.

ఆంధ్రవేద కర్తయగు అన్నమాచార్యుని పవిత్రనామమును ఆంధ్రుల శ్రవోయుగళిలో మాఱు మ్రోఁగింపఁజేసి శ్రీ శాస్త్రిగారు పుణ్యము గట్టుకొన్నారు. అన్నమయగారి సం

కీర్తనములను వెలికి తీసి వానిని వెలుగులోనికి తీసికొనివచ్చిన మహనీయులు వారే. అనగా ఆంధ్ర సంకీర్తన వాఙ్మయమునకు ప్రాణప్రతిష్ఠ గావించి రన్న మాట! అన్నమాచార్య చరిత్ర పీఠికలో వారు పేర్కొనిన విషయ బాహుళ్యమును తిలకించినచో శ్రీ శాస్త్రిగారు జంగమ విజ్ఞాన సర్వస్వ మని నుడువ వలసి యున్నది. అన్నమాచార్యుల జీవితచరిత్రాదులు తిరుపతి కొండపై వేంచేసి యున్న వడ్డికాసులవానికి జరగు వైభవములు, ఆంధ్ర సంకీర్తనముల వైశిష్ట్యము, సంగీత రచనకు సంబంధించిన అపూర్వ విషయములు, నాఁటి యాంధ్ర భాషా విశేషములు, కవితా రీతులు—మున్నగు పెక్కు విషయములు వారు వెలయించిన పీఠికలలో కూలంకషముగ ముచ్చటింపఁ బడినవి. మీఁదు మిక్కిలి తాళ్లపాకవారి విగ్రహములు, తాళ్ళపాక వారు ప్రతిష్ఠించిన వేల్పులు, తాళ్ళపాక వారర్చించిన విగ్రహములు, చేపట్టిన చిఱుతలు, తాళ్ళపాక గంగమ్మ గుడి—గంగమ్మ, అవ్వచరి కోన—మొదలగు వానికి చిత్ర పటములను సేకరించి వానిని గూడ లోకమునకు తెలియఁ జేసిరి. వాగ్రూపముగ నున్న పీఠికకు చిత్ర వ్యాఖ్యానమును జతగూర్చి అన్నమయ జీవిత చరిత్రకు మెఱుఁగులు దిద్దిరి.

ఈ సందర్భమున మఱియొక విషయమును గూడ పేర్కొనుట సముచితము. కవికర్ణ రసాయన కర్తయగు సంకుసాల నరసింహకవి అన్నమాచార్యుని కుమారుడను గొప్ప విషయము మనకు తెలియవచ్చినది అన్నమాచార్య చరిత్ర పీఠికవల్లనే. అందులకు వారు చూపిన యుపపత్తులు సహేతుకములు, సమంజసములు నని చెప్పఁదగును.

"చిన్నన్న ద్విపద కెఱుఁగును" అనుపద్యమున నిరుపమాన సుకవితా నిర్వాహకుఁడయిన తెనాలి రామకృష్ణకవి తాళ్లపాక కవులను సంస్తుతించెను. ద్విపదమునకు చిన్నన్నయు, పదమునకు పెదతిరుమలయ్యయు, పద్యగద్య శ్రేణిని నరసింగన్నయు ప్రాలునని యాపద్యమునకు శ్రీ శాస్త్రిగారు లెస్సగా అర్థము చెప్పిరి. చిన్నన్న, పెదతిరుమలయ్య విషయమై యద్వైధమైన సంశయములేదు. కాని నరసింగన్న విషయమునే కొందఱు సంశయింపవచ్చును, పద్యమునందుదాహృతుడైన నరసింగన్న తాళ్ళపాక వంశీయుఁడే యని సమ్ముట కాధార మేది? అని ప్రశ్నింపవచ్చును. తాళ్ళపాక కవులను ప్రస్తుతించుచు రామలింగఁడంతటి సందర్భశుద్ధిగల కవిప్రవరుఁడు మఱియొక కవిపేరు నచ్చట పేర్కొనఁడు. అట్లొనర్చుట పాసకములోని పుడకవలె నుండును. పైపెచ్చు సంకుసాల యను గ్రామమునకు కొంత కలకు సమోచ్చారణముగల 'సుంకేసుల' యను గ్రామము రాయలసీమలో నుండుట వలనను, కవికర్ణరసాయనమునందు వైష్ణవమతాభిమానము, అద్వైతమతద్వేషము, అన్నమాచార్య సంకీర్తన చ్ఛాయలు నిండారుగా నుండుట వల్లను, రాజాశ్రయ గర్హణముకూడ నుండుట వల్లను-శ్రీ వేటూరివారు పయిపద్యమున పేర్కొనబడిన తాళ్ళపాక నరసింగన్నయే కవికర్ణరసాయన కర్త యని స్థిరీకరించిరి. ఇన్ని కారణములను పురస్కరించికొని చేయఁబడిన సిద్ధాంతమును సత్యదూర మనఁదగునా?

శ్రీ శాస్త్రిగారు సిద్ధాంతములు చేయునపుడు గ్రంథములందలి అంతస్సాక్ష్యములను పరమ ప్రమాణములుగా తీసికొనుచుందురు. ఆయా గ్రంథములందలి పదబంధములు, పలుకుబళ్లు, కూర్పుతీర్పులు, పద్యచ్ఛాయలు మున్నగునవి వేటూరివారికి హృద్గతములు. కావుననే వారు క్రీడాభిరామ, కవికర్ణరసాయన కర్తృత్వ సమస్యలను సునాయాసముగ పరిష్కరించినారు. ఆంధ్రవాఙ్మయాంబుధిని ఆపోశనము పట్టిన యగస్త్యకల్పుఁడాయన! కనుక గ్రంథకర్తృత్వ సమస్యా పరిష్కారావసరమున శ్రీ వేటూరివా రవలంబించిన అంతస్సాక్ష్య పరిశీలన విధానమే శరణ్యమని స్పష్టమగుచున్నది.

వేటూరివారి సారస్వత పీఠికలందు 'మధుర కవితలు' అను పేరుగల సుగ్రీవవిజయ పీఠికకూడ పేర్కొనఁదగినదే. ఆంధ్రనాటక (యక్షగానములు) వాఙ్మయచరిత్ర మిందు దిక్ప్రదర్శనముగ వివరింపఁబడినది. యక్షగానముల పుట్టుపూర్వోత్తరములు, కాలక్రమమున అవి పొందిన మార్పులు మున్నగువానిని వివరించి మధుర కవితలకు వాఙ్మయమున గల ప్రాధాన్య మెట్టిదో కూడ స్పష్టము చేసినారు. దేశి వాఙ్మయమునకు చెందిన యీ మధుర కవితలు నిజముగా మధురకవితలే. పాలకురికి సోమనాథుని బసవపురాణమునకు వారు సంతరించిన పీఠిక

కూడ సారస్వతోపాసకుల సంస్తుతిని సము
పార్జించిన దగుటచే దానిని గూర్చి వేఱుగ
నుడువ నవసరమే లేదు. ఇంకను పేర్కొనఁ
దగు సారస్వత పీఠికలు గలవు. అయినను
స్థలాభావముచే వానిని పేర్కొనుట మానితిని.
ఇఁక వేటూరి వారి చారిత్రకపీఠికల ప్రాధాన్య
మును గమనింతము.

పండితుడుగా, కవిగా, విమర్శకుడుగా,
గ్రంథపరిష్కర్తగా, అముద్రిత గ్రంథ ప్రకాశ
కుడుగా వినుతి కెక్కిన శ్రీ శాస్త్రిగారికి
చారిత్రకరంగమునందును విశిష్టమగు స్థానమే
కలదు. వారి చారిత్రక పరిజ్ఞానమునకు
తంజావూరి యాంధ్రరాజుల చరిత్ర పీఠికయే
సాక్షి. భౌగోళికవిజ్ఞానమునకు హరవిలాస
పీఠికయే సాక్షి.

తంజావూరి యాంధ్ర రాజుల చరిత్రకు
వేటూరి వారు వెలయించిన 'తొడిమ'
సుదీర్ఘమైనది. అసలునకు మించి పోయినది
కొసరు. అయిన నేమి? తంజావూరు నేలిన
నాయకరాజుల రాజకీయ చరిత్ర, వారి భాషా
సేవ, వారు కావించిన దాన ధర్మములు, వారి
ఆస్థానీయులైన గోవింద దీక్షితులు, రత్నఖేట
దీక్షితులను నామాంతరము కలిగిన శ్రీనివాస
దీక్షితులు మొదలగు వారికి సంబంధించిన
ముఖ్యాంశములు—ఇట్టి వివిధ విషయాదిక
మును తొడిమ పేర్కొనుచున్నది. శ్రీశాస్త్రిగా
రాపీఠికలో ఆంధ్రభోజుడగు శ్రీ కృష్ణ దేవ
రాయల వారి కులమును గుఱించి సలిపిన
చర్చ సోపపత్తికముగ నున్నది. రాయలు
క్షత్రియుడా! శూద్రుడా అనునదే ఆ సమస్య.
రాయలు చంద్ర వంశ క్షత్రియుడని కావ్య
ములు విశదము చేయుచున్నవి. కాని రాయల
వారి తమ్ముడగు అచ్యుత దేవరాయలు తన
మఱదలను మూర్తమాంబను చెవ్వప్పనాయని
కిచ్చి వివాహ మొనర్చెను. రాయలు క్షత్రి
యుడే యైనచో ఇట్టి వివాహము జరిగి
యుండదు. కావున రాయలు శూద్రుడై యుండ
నోపు నని కొందఱి సంశయము. అచ్యుత
దేవరాయల వారి భార్యయగు తిరుమలాంబ
పట్టమహిషి కాక పరిగ్రహీత యై యుండ
వచ్చు ననియు, పరిగ్రహీతలు భిన్న జాతివారు
కూడ కావచ్చు ననియు వేటూరి వారి యుక్తి
ప్రాయము. బహుభార్యాత్వము బహుళ
ప్రచారములో నున్న ఆ దినములలో రాజులకు
రమణులు పెక్కురు వలపు నేస్తములుగ
నుండి యుందురు. కనుక వేటూరి వారి
సూక్ష్మపరిశీలనము సమంజస మని తేలుచున్నది.

బూతులబుంగ యను అపప్రథను గడించు
కొన్న క్రీడాభిరామము ఏకశిలానగర సంఘ
చరిత్రకు దర్పణముగ నున్న దని శ్రీ వేటూరి
వారు తమ పీఠికలో వివరించి ఆ కావ్యము
నకు చారిత్రకముగ స్థానమును గల్పించిరి.
సంఘ జీవన విధానమును ఇంత సజీవముగను,
కన్నులకు కట్టునట్లుగాను వర్ణించు కావ్యము
క్రీడాభిరామమును మినహాయించినచో మఱి
యొకటి లేదని నుడువఁ దగును. తన్నగర
మందలి సంతలు, వివిధ వర్ణములకు చెందిన
స్త్రీలవర్ణనలు, వైలారభటుల ప్రశంస—మొద
లగు విషయము లిందు సుస్పష్టింపఁ బడినవి.
ఇంకొక విశేషము. అముద్రితములుగ నున్న
ఆదిలక్ష్మీ విలాసము, కామేశ్వరి చరిత్రము అను
గ్రంథములను పరిశీలించి శ్రీ శాస్త్రిగారు
కామేశ్వరి కథను (అక్కల చరిత్రము)
గూడ పీఠికలో వివరించిరి. ఇటుల నూత
నాంశము లెన్నిటినో ఆ పీఠిక ద్వారమున
లోకమున కెఱిఁగించిరి.

ఇటులనే హరవిలాసమున నుదాహరింపఁ
బడిన దేశములను గుఱించి ఆ నూతనాంశము
లను వివరించుచు శ్రీ శాస్త్రిగారు విలువగల
పీఠికను సంతరించినారు. వాని నెల్ల పేర్కొ
నుట చర్విత చర్వణము గ నుండును.
అన్నమాచార్య చరిత్ర పీఠికలో గూడ
విజయనగర సమ్రాట్టుల ప్రశంస నెఱపిరి.
విజయనగర రాజ్యముపై కపిలేశ్వర, పురుషోత్తమ
గజపతులు సలిపిన దండయాత్రలను, తురు
ష్కులు జరిపిన దౌర్జన్యములను శ్రీ శాస్త్రిగారు
పేర్కొని ఆ నాటి రాజకీయ, మత, సాంఘిక
చరిత్రలను తెలియఁజేసిరి.

విజ్ఞాననిధు లనఁదగుపీఠికలను సంతరించిన
శ్రీ ప్రభాకర శాస్త్రిగారు ప్రశంసార్హులు.
కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ
గారు నుడివినట్లుగా, "వేటూరివారి వ్యాఖ్య
లును, పీఠికలున్ దెనుఁగుం బొలంతికిన్
చేటులు లేగ గందవొడి పెట్టినపూఁతలు!"

# ఆచార్యసత్తముడు

ఒడ్డుంబొడుగు నయినదొడ్డశరీరము, బ్రహ్మవర్చస్సు పరివేషముగాఁ జుట్టియున్న గంభీరవదనము, శాంతసుందరము లయిన దృగంచలములు గలిగి యాసనమునకు నిండుగా బుద్ధభగవానునివలె శిష్యగణముచేఁ బరివేష్టింపఁబడియుండిన యలనాఁటి నాగురుమూర్తి నా హృదయసీమలో నేఁటికిని నిలిచియే యున్నది. అది నా తొలిదర్శనము. కళాశాలలో విద్యార్థులలోఁ జేరుటకై పోయినదిన మది!

'నాయనా! మీయింటిపేరేమి?' అని ప్రశ్నించిన దొక గంభీరవాణి.

'తిమ్మావజ్ఝలవారండి'- అమాయకముగా నే నంటిని

'ఇంటిపేరు నిలుపుదువుగదా'

'నిలుపుదు నండి' తిరిగి యమాయకముగా నేను బ్రత్యుత్తరించితిని.

వెంటనే వారిని బరివేష్టించి యుండిన శిష్యగణ మంతయు గొల్లు మన్నది. నేను నివ్వెఱపోయితిని. వెఱ్ఱిగా వారివైపు చూచితిని. అప్పుడే మా కళాశాలపైకప్పుపైఁ గోఁతులు కొన్ని యల్లరి చేయుచుండినవి. వా రా యల్లరిని జూపిరి. 'మీయింటిపేరు తిమ్మావజ్ఝలవా రంటివి కదా! అందుకని వీ రందఱును నవ్వుచున్నారు' అనిరి. అప్పటికి నా కర్థ మయినది. నవ్వితిని.

'ఇంటిపేరు నిలిపెద నంటివి. ఈ కోఁతులవలె నల్లరి చేయక యింటిపేరు నిలుపవలెను సుమా' యని హెచ్చరించిరి.

'సరే' అంటిని.

* * *

ఆసంవత్సరము మేము చదువుచుండిన ప్రవేశకక్ష్యలో క్రొత్తగా నిద్దఱు విద్యార్థినులు చేరిరి. ప్రభాకరశాస్త్రిగారికి శీలము ప్రధానమయినట్లు తక్కిన దేదియుఁ బ్రధానము గాదు. తనవిద్యార్థులు సచ్ఛీలురు కావలయు నని వారి యాశయము. స్త్రీజనము విషయమున నెందులకో వారియొడలు కంపర మెత్తి పోవును. వా రున్నచోటికి మే మందఱముఁ బాఠము నేర్వఁ బోయితిమి. కూర్చుంటిమి. కూర్చున్నదే తడవుగా వా రొకపద్యమును వ్రాసికొనవలసిన దని మమ్మాదేశించిరి.

"లాఁచి పరాంగనల్ వరవి
లాసమనోహరరూపసంపదం
జూచినఁ జూడఁ డుత్తముఁడు,
చూచినఁ జూచును మధ్యముండు, తాఁ
జూచినఁ జూడకుండినను
జూచును నీచుఁడు, వారిలోన నన్
జూచినఁ జూడకుండఁగుణిఁ
జూచినచూపునఁ జూడు మంబికా!"

పద్యము వ్రాసికొంటిమి 'ఈపద్యముఁ గంఠస్థము చేసి రేపు నాకప్పఁ జెప్పవలయు' ననిరి. 'సరే' యంటిమి.

'ఇది త్రిపురాంతకుఁ డనుకవి రచించిన యంబికాశతకములోని పద్యము. ఈనాఁడు మీతరగతిలో నియిరువురు విద్యార్థినులును జేరినారు. మీరు సోదరీసోదరులవలె మెలఁగవలయును' అనిరి. మాకన్నులు చెమ్మగిల్లినవి.

* * *

మంచి దస్తూరీ యనిన శ్రీశాస్త్రిగారికి ముద్దు వచ్చును. ముద్దు వచ్చుటయే కాదు. వారట్టి దస్తూరీని నిజముగను ముద్దు పెట్టుకొందురు.

'ఆంధ్రభాష యమృత, మాంధ్రాక్షరంబులు
ముద్దు లొలుకుగుండ్రముత్తియములు
ఆంధ్రదేశ మాయురారోగ్యవర్ధకం
బాంధ్రజాతి నీతి ననుసరించు.'

ఈపద్యమును వారు ప్రతివిద్యార్థిచేతను వల్లె వేయింతురు. గుండ్రముత్తియములవంటి యక్షరములు వ్రాయుఁ డని ప్రబోధింతురు. అసలు వారిది చక్కని దస్తూరీ. అభిప్రాయార్థము క్రొత్తపుస్తక మేదేని వారికడకు వచ్చినచో శ్రద్ధగా, గుండ్రని యక్షరములతో దానిపైఁ దమపేరును వ్రాసికొనుట యందు వారికి ముచ్చట!

* * *

లేఁతవయసున నున్నవిద్యార్థులు శృంగారగ్రంథపఠనమువలనఁ దప్పుత్రోవలు పట్టుదు రని వారి గట్టి విశ్వాసము. వారు పీఠిక వ్రాసి ప్రచురించినది గదా యని యభిమానముతో క్రీడాభిరామముఁ జదువఁదలఁచి వారి యనుమతికై చీటి వ్రాసికొని పోఁగా వారు దానిపై సంతకము పెట్టువారు కారు. వివాహితు లయినవిద్యార్థులు కొంద ఱుండెడివారు. వారికే యనుమతి లభించెడిది. మేము బహుప్రయత్నమున 'ప్రిలిమినరీ'

చదువుచుండఁగా నాపుస్తకముఁ జదువుకొనుట కనుజ్ఞఁ బడసితిమి. అదియు నందలిపద్యములను దుర్వినియోగపఱుప మని వాగ్దానములు చేసిన మీఁదట!

* * *

పారిజాతాపహరణము చదువుచుంటిమి. అందులో—

క. కలకాల మొక్కగతిఁ బూ
సలలో దారంబుమాడ్కి సతిమదిలోనన్
మెలఁగెడుపురుషుఁడు గలుగుట
తొలిజన్మము నోముఫలము తోయజనేత్రా!

అనుపద్యముకడకు వచ్చితిమి. పద్యము సుగమముగానే యున్నది. వ్యాఖ్యకు, వివరణమునకు నెట్టి యవసరమును లేదు. ముందునకుఁ బోవుచుంటిమి. వా రాఁగు మని గద్దించిరి. పద్యము తిరిగి చదువు మనిరి. చదివినంతనే యిందులో దోష మున్నది. పూసలలో దారము - సతిమది లోనన్ పురుషుఁడు-అని రెండుమూఁడుసారులు దానినే తిరిగి తిరిగి చదివిరి. భిన్నవచన మను దోష మిందున్నది. పూసలోన దారంబుమాడ్కి సతిమదిలోనన్ మెలఁగెడు పురుషుఁడు అని కాని, పూసలలో దారంబు మాడ్కి సతుల మనములన్ మెలఁగెడు పురుషుఁడు అని కాని యుండవలయు ననిరి. ఆరెంటిలోఁ గూడ సతుల మనములన్ మెలఁగెడు పురుషుఁడు - ప్రస్తుతము కాదు. సత్యభామ పలుకుచున్న పలుకు లివి. కనుకఁ బూసలోన దారంబుమాడ్కి సతిమదిలోనన్ - అను తొలి సంస్కారమే సమంజస మనిరి. 'పూసలలో దారంబుమాడ్కి' నని సమాహారముగాఁ దీసికొని భావమును మాత్రమే కయికొని యర్థమును జెప్పుకొనరాదా' యంటిని. వారు నవ్వి 'కుయుక్తులు పన్నవల' దనిరి. ఆ సంవత్సరము వారు విద్వత్పరీక్షకుఁ బరీక్షాధికారులుగ నుండిరి. ఈ పద్యములోని దోషమును గుర్తింపవలసిన దని వారు ప్రబంధముల ప్రశ్నపత్రములో నొక ప్రశ్నమును గూడ నొసఁగిరి! నే నడిగితిని. 'మీకుఁ దోఁచిన యొకానొకవిషయమునుగూర్చి పరీక్షలోఁ బ్రశ్నించుట ధర్మమా?' అని. వారు నన్నుఁ గేకలు వేసిరి. 'ఒకపద్యము నిచ్చి యందు దోష మున్న దని తెలిపి యాదోష మేదో తెలిసికొనుఁ డని యడుగఁగాఁ దెలిసికొనఁజాలనివాఁడు రేపు పండితుఁడై యేమి వెలిఁగించును?'' అనిరి.

* * *

పావులూరి గణితమును వారు పరిష్కరించుచుండిరి. అప్పుడు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము తిరుపతిలో నుండినది. అచ్చటి పావులూరి గణితప్రతులను జూచి ప్రతికలు వ్రాసికొని వచ్చితిని. పాఠాంతరములు సేకరించితిని. మూలముతో సరిచూచి లెక్కలు కుదిర్చితిని, కొన్నిపట్టులు కుదుర నే లేదు. అట్లు కుదురనిపట్ల నట్లే విడిచి ప్రశ్నార్థకచిహ్నముల నుంచితిని. సాఫు వ్రాసి వారిముందు పెట్టితిని. ప్రకీర్ణకగణితములో నిక్రిందిపద్యముఁ జూపితిని.

గీ. అష్టమాంశంబు మొదలుగా నర్థభాగ
మంత్యముగఁ గ్రమంబున శేష మగుచునున్న
సప్తగోదావరీసరోజములఁ దెచ్చి
ద్రాక్షారామభీమేశ్వరు లోకనాథు?

గీ. పంచమాంశంబులోపలఁ బరగ నాలు
పుచ్చ శేషంబు నిజవర్గ మిచ్చ సరిగ
నాలు విజనస్థలంబున నాడుచుండె
నెన్ని మగునీగజములు మా కెఱుఁగఁ జెప్పుమ.

ప్రశ్నార్థకచిహ్న మున్నచోటుఁ జూపి 'వ్రాఁతప్రతు లన్నిటను సపాద మిట్లే కలదు. పాఠాంతర మేదియుఁ గానరాలేదు. ఇది యిట్లే యుండుటకు గణభంగము, యతిభంగము. సంస్కరణము చేతఁ గాక ప్రశ్నార్థక చిహ్నముతో నట్లే వదలితి' నంటిని. వా రాపద్యము నొకమాఱు చదివిరి. మొగ మెత్తి నన్నుఁ జూచి యొకమాఱు నవ్విరి. 'కుదుర లేదా?' యనిరి. 'కుదురలే దంటిని'. 'నేఁ గుదిర్చెదను. చూడుము' అని కలముఁ దీసికొని వా రాపాదమును బూర్తిగాఁ గొట్టివైచి యిట్లు వ్రాసిరి. 'డాకరేమి భీమేశ్వరు లోకనాథు' 'సంస్కరణమునకుఁ బాండిత్య మొక్కటిమాత్ర మున్నఁ జాలదు. బహువిషయపరిజ్ఞాన ముండవలయును. 'డాకరేమి' యనునది ద్రాక్షారామమునకుఁ బేరు. ఇదిగో 'చూడు' మని యక్కడనే శ్రీ జయంతి రామయ్యపంతులుగారు ప్రకటించిన శాసనపద్యమంజరి యుండఁగా దానిఁ గొని యందలి శాసనములలో ద్రాక్షారామమునకు డాకరేమి యని యుండుటను జూపిరి. 'ఒక్కప్రతిలోఁ గూడ 'డాకరేమి' యని లేదేమి?' యనిరి

ప్రశ్నించితిని. డాకగమి యనఁగా నేమో పాఠకుల కర్థము కాదేమో యని యీ ప్రతి విలేఖకులు 'డాకశమి' యనుచోట ద్రాక్షారామ మనియే వ్రాసికొని యుందు రని వారు సమాధానము చెప్పిరి. ఆసవరణ యెంత చక్కఁగా, సరిగాఁ గుదిరినది యని యిప్పటికి నే నాశ్చర్యపడుచుందును.

* * *

కులతత్త్వముల విషయమై వారి దృక్పథ ముదారము. మేము వారి సన్నిధిని జగుపుకొను చుండఁగా కృష్ణామండల వాస్తవ్యుఁడు కాఁబోలు దాసి బసవయ్య యను హరిజన విద్యార్థి తాను విద్వత్పరీక్షకై చదువఁదలఁచి నట్లును, నందుకై సహాయము నర్థించుచుంటి ననియు శ్రీ శాస్త్రిగారి కొక యుత్తరము వ్రాసెను. అది చూచి శ్రీ శాస్త్రిగారు వెంటనే యాతని రమ్మని యుత్తరము వ్రాసిరి. అతఁడును బయలుదేరి వచ్చి శ్రీ శాస్త్రిగారి దర్శనమునకై వారి యింటికడకు వచ్చి దూరముననే నిలుచుండి తనవిషయమై యెఱిఁగించెను. శాస్త్రిగా రాతనిని దగ్గఱకు రమ్మనిరి. అతఁడు సంకోచించుచుండెను. అప్పుడు శాస్త్రిగారు నవ్వుచు "నీవు నాదగ్గఱకు రావచ్చును. రమ్ము" అని తమ దగ్గఱఁ గూర్చుండఁ బెట్టుకొని యతని స్థితిగతులను విచారించిరి. పిదప నతనిని దమవెంటఁ బెట్టుకొని కళాశాలాధ్యక్షులకడకుఁ బోయి యాతనిని గళాశాలలోఁ జేర్చుకొనుటకు వీలగునేమో చూడవలసినది యని యడిగిరి. కాని యిప్పటిదనుక నాకళాశాలలో హరిజనవిద్యార్థి యెవ్వఁడును జేర్చుకొనఁబడక పోవుటచే నాతనిని జేర్చుకొనుటకు వీలులే దని అధ్యక్షులు తెలిపిరి. అంతఁ జేయునదిలేక శ్రీ శాస్త్రిగా రావిషయము నాతనికిఁ దెలిపి తిరుపతిలోనే యున్న యొకహరిజనహాస్టలులో నతనిఁ జేర్చుప్రయత్నముఁ జేసిరి. ఆనాఁడు రాత్రి యాతనిని దమ యింటనే తమప్రక్కనే కూర్చుండఁబెట్టుకొని మిక్కిలి యాప్యాయముగా నాతనితో మాటలాడుచు భోజనము చేసిరి.

* * *

వారి పాఠప్రవచనపద్ధతి వింతతీరు కలది. చాదస్తముగా, తీర్థమునకుఁ దీర్థము, ప్రసాదమునకుఁ బ్రసాదముగా ప్రతిపదార్థములు, తాత్పర్యములు చెప్పుట వారి పద్ధతి కాదు. అది వారి కలవాటు లేదు. వారు చెప్పుపాఠము రసవ్యాఖ్యానము. అవసరము అయినపట్టుల మూలముతోడి సంవాదము. మెదడునకుఁ దగినంత మేఁత పెట్టునది వారితోడి సాహిత్యగోష్ఠి!

వారిలో మఱొక్క విశేషము - ఎవరైన నేదైనఁ బద్యమునకుఁ గాని, పదమునకుఁ గాని యర్థము కుదురకయో, యన్వయము కుదురకయో యాచిక్కు విడఁదీయుటకై వారి నాశ్రయించినచో దాని నెట్లైన సాధించి సరసార్థము సమకూర్పవలయు నని తలపోయుట. ఇంచుమించు అది తమ కొక 'ఛాలెంజి'గా భావించి దానిఁ గుదుర్చుటకై వారు తపింతురు. అట్టి ఘట్టములు నేను స్వయముగా నెఱిఁగినవి యెన్నియో కలవు. అవి యెల్లఁ జేర్కొనుట కిటఁ దావు చాలదు.

—కోదండరామయ్య.

# తొలి తెలుగు కవయిత్రి

శ్రీమతి బాణగిరి రాజమ్మగారు.

శ్రీ ప్రభాకర శాస్త్రిగారి చక్కని సాహిత్య యజ్ఞ మంతా ఒక యెత్తు. తాళ్ళపాక తిమ్మక్క వ్రాసిన 'సుభద్రా కల్యాణం' పాటను ప్రకటించి ఆమెను తొలి తెలుగు కవయిత్రిగా నిరూపించడ మొక యెత్తు.

పడతుల పాటలన్నా, పామరుల పదాలన్నా పండితులకు రోత. దానిలోని కవితా మాధుర్యాన్ని గ్రహించి పరిగణించడం చాల ఉదారమైన పని. సరసహృదయులే అలాటి పనికి పూనుకుంటారు. అలాటి వారు శ్రీ శాస్త్రిగారు.

స్త్రీల పాటలు వేనకువేలున్నాయి. కాని వాటిని వ్రాసినవారెవరో, పాడినవారెవరో పేరు తెలియదు. ఇప్పటికి దొరకిన పాటలలో పేరు తెలిసినపాట సుభద్రా కల్యాణమే.

"అంగనలో తాళ్ళపాకన్నయ్యగారి
తరుణి తిమ్మక చెప్పె దాను సుభద్ర
కల్యాణమనుపాట కడునుంచి తేట
పలుకుల........"

అని ఆమె స్పష్టంగా చెప్పుకొన్నది గనుక ఎవరు దీనిని వ్రాసిందనే వివాదమే లేదు. అన్నమాచార్యుని వంటి పదకవితా పితామహుని పత్ని గనుక తిమ్మక్క శ్రుతపాండిత్యంలోనే ఇలాటి పాటలు కట్టి వుంటుంది. సందేహం అక్కర లేదు.

తిమ్మక్క తేట మాటలకు విజయ విలాస కర్త ముచ్చటపడి వుంటాడు. కనుక దీనిని అనుసరించే కావ్యం వ్రాసినాడని అనలేము గాని ఈ పాటను తప్పక విని వుంటాడని నా నమ్మకం. వినకపోతే ఈ రెండిటికీ పోలికలు వుండి వుండవు. కొన్ని పోలికలను చూపుతాను.

సుభద్ర దొంగయతి వేషంలో వున్న అర్జునుని కుశల ప్రశ్న చేసే ఘట్టం చాల నాజూకయినది.

[1] "అయ్యా మీ కే దేశ మగని చూచితిరో?
ఎయ్యది మీ నామ? మెచ్చట నుండుదురో?
పరగ నింద్రప్రస్థపట్టణమ్మునను
బహుళ సంపదలతో బరగుచున్నార
ధీరమానసులు కుంతీసుతుల్? వారు
ఆరయ గడుసుఖులై యున్నవార?

విజయవిలాసంలోని ఈపద్యం చూడండి. ఎంత పోలిక వుందో!

[2] 'క. మీ రింద్రప్రస్థముఁ గని
నారా? పాండవులఁ జూచినారా? సుఖులై
వారందఱు నొకచో ను
న్నారా? వీరాగ్రగణ్యు నరు నెఱుఁగుదురా?'

సుభద్ర అర్జునునికి ఏమయిందో, ఎక్కడ వున్నాడో అని దిగులుపడి అడుగగా, దొంగయతి యుక్తిగా రెండర్థాలు వచ్చేటట్టు పలికే మంచి ఘట్టం.

[3] "అమరగా బలికెను అతివతో నపుడు
కోమలి యిద్దరము గోకర్ణమందు
కూడియే యుంటిమి కొన్నాళ్లు లచట
భోజనమ్ములు శయనములు నొక్కచోటె
చెలియ! యుంటిమి మేము చెలికాండ్ర [వలెను
అతనికి నాకును అరమర లేదు
అతనికి నా కైక్య మతివరో వినవె.'

దీనికి వృత్తరూప మనదగిన విజయవిలాసం పద్యం వినండి.

[4] ఉ. కోమలి యీ గతి న్మది వ
గుల్వడఁ బల్కిన సవ్యసాచి యగ్ర
గ్రామణినూను మీ రెచట
గంటిరొ యంటివి, కన్న మాత్రమే?
ఏమని చెప్పవచ్చు నొక

(తరువాయి 97 పుటలో)

1. సుభద్రా కల్యాణం, 29వ పుట. 2 విజయ విలాసం, ద్వితీయాశ్వాసం, 163 వ పద్యం. 3. సుభద్రాకల్యాణం, 33 వ పుట 4. విజయవిలాసం ద్వితీయాశ్వాసం 168, 169 పద్యం.

# శాస్త్రిగారి సరదాలు

## శ్రీ కంభంపాటి సత్యనారాయణ శ్రేష్ఠిగారు

-:*:-

మహాపురుషుల సరదాలు, అభిరుచులు, వినోదాలు వింతగానే ఉంటాయి. వాటికి వారి జీవిత విధానానికి సంబంధం ఉన్నట్టు స్థూల దృష్టికి కనిపించదు. కాని అనంతసృష్టికి అన్ని శాఖవలె అజ్ఞాతంగా ఏదో సూత్రం ఉండనే ఉంటుంది.

గాంధీమహాత్మునికి మేకలను పెంచడం సరదా. "మేకల పాడియును గోత మేదిని సుమతీ!" అని చిన్ననాడు వల్లించిన పద్యం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా గాంధీజీ చర్యకు పద్యానికి కుదరదేమో-అని ప్రశ్నించుకుంటూ ఉంటాను. శ్రీ రామకృష్ణ పరమహంసకు కూరగాయల బేరసారాలు చేయడం సరదా అట. కానీలు, దమ్మిడీలు లగాయతు లెక్కలు కట్టి కట్టి వసూలు చేసేవారట. జీవన్ముక్తుడైన ఆ మహనీయుని తదితర జీవితానికి ఈ బేరానికి సంబంధం ఉందా? ఏమో! మరికొందరు గొప్పవారికి మొక్కలు పెంచడం, పాదులు త్రవ్వడం వినోదం. ఇట్లే మా గురువర్యులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారికి కూడ కొన్ని సరదాలుండేవి.

చేతికర్రలు చికిలీపట్టి చేర్చి పెట్టుకోవడం, ఇష్టులకు బహూకరించడం వారి సరదాలలో ఒకటి. రకరకాల కర్రలు వారివద్ద వుండేవి. అయినా మంచి కర్రచూస్తే మోజు. మామూలు కర్ర తెప్పించడం, ఉప్పుకాయితంతో రుద్దించి నున్నగా తయారు చేయించడం; నూనె పూసి కొన్నాళ్లు పడవేయడం, తర్వాత చేత పుచ్చుకుని దుమ్ము దులిపి మనసారా మొదలు నుంచి కొనవరకు తీడి బలంకొద్దీ జళిపించి భుజానికీ, మెడకూ తగిలించుకుని చూచి, పదుగురినీ "ఎలా ఉంది? బాగుందా?" అని ప్రశ్నిస్తూ ఆనందించడం-వారికి పరిపాటి. వారి కర్రవిసుర్లు చూస్తే, చికిత్సకు వచ్చే రోగుల రోగాలను ఉచ్చాటన చేస్తున్నారాఅన్నట్టు నాకు తోచేది.

అలాటిదే మరొకటి పెన్సిళ్లు చేర్చుకోవడం. రకరకాల పెన్సిళ్లు, రంగు రంగుల పెన్సిళ్లు-డైరీ పెన్సిళ్లవంటి సన్నవి మొదలు అడ్వర్ టైజ్ మెంట్ కోసం అంగళ్లల్లో పెట్టే రూలుకర్రల లాంటివి వరకు వారివద్ద వుండేవి. వారు పెన్సిళ్లు చెక్కడం ఒక కళ, ఒక శాస్త్రం. ఉల్లాసంగా వున్నప్పుడు అన్నిరంగుల పెన్సిళ్ళతోనూ వ్రాసేవారు. ఆ రంగు లన్నీ చూచి, వీరు ప్రభాకరులు గదా, ఆ ప్రభాకరునికి వలె వీరికికూడ సప్తవర్ణాల కిరణాలు, సప్తాశ్వాలు కాబోలు ఇవి-అని అనుకునేవాడిని.

"ఏమోయ్! ముక్కులేని పండేదో చెప్పు. చూద్దాం!" అన్నారు ఒకరోజు శాస్త్రిగారు. నాకు తోచలేదు. నేనేమైనా పండితుడినా. బేరసారాల మనిషిని గాని? "అనాసపండు కాదటయ్యా?" అన్నారు. "ఇది భాషాంతర శ్లేషలే! నీకు తెలియదు" అని వివరించారు. ఇంతకూ వారికి అనాసపం డంటే మహాప్రీతి. రకరకాలుగా దానిపై గమ్మత్తులు చేసేవారు.

'తక్కిన విషయాలలో పాండిత్యంవలెనే పాకశాస్త్రంలోను వారిది పై చేయే. రకరకాల వంటకాలను తెలుపుతూ వండే పద్ధతులను వినోదంగా చెప్పేవారు. కూరలు తరగడం వరకే సరదా. ఏది బిళ్లలుగా తరగాలి, ఏది బద్దలుగా వుండాలి, ఏది పొడిపొడిగా తరగాలి అనేది ఒక శాస్త్ర చర్చ. బచ్చలి కూరను గురించి వారు పొగడని రోజు లేదు. "నేయి అనే ఛత్రంతో బచ్చలి దొరగారు వస్తున్నారు. రోగాలనే రౌడీల్లారా పారిపొండి" అని అర్థం వచ్చే శ్లోకం చదివేవారు. గోంగూర సంగతి వస్తే మెట్ట గోంగూర, మాగాణి గోంగూర, దనాసరి గోంగూర,—దనాసరి నుంచి తెన్నాసీర్, భూగోళం చర్చలకు దిగిపోయేవారు.

అప్పుడప్పుడు ప్రసంగవశాత్తు 'ఏమోయ్ సెట్టీ! నాతో నీవు రోజంతా కాలక్షేపం చేస్తే, నీ వ్యాపారంసంగతి ఏమౌతుంది? దాని సంగతి చూచుకో. "బంగారువంటి కోమటి సంగీతము చేత బేరసారము లుడిగెగా"—అన్న కథ అవుతుంది సుమా!' అని ఛలోక్తులాడేవారు. 'మరేం పరవా లేదండి. వ్యాపారం దానంతట అది సాగిపోతుంది' అని జవాబు చెప్పేవాడిని. (తరువాయి 97 వ పుటలో)

అముద్రితరచనలు :

# : లీ లా వ తీ గ ణి త ము

## వల్లభార్యప్రణీతము

(గతసంచిక తరువాయి)

నీలవంబులచేత విహీనములుగఁ
చేయఁగాఁ బద్ధమూఁటికి శేష మెంత ?

ఒడ్డు— $\frac{౧}{౪}, \frac{౧}{౬}, \frac{౧}{౩}, \frac{౧}{౨}, \frac{౧}{౫}$

సమహారాలుచేసి కూడఁగాను $\frac{౨}{౦}, \frac{౯}{౦},$

ఒడ్డు— $\frac{౧}{౪}, \frac{౧}{౬}, \frac{౧}{౩}, \frac{౧}{౫}$ ఇవి

కూఁటిలోఁ బుచ్చఁగాను $\frac{౩}{౨}, \frac{౧}{౦}$ —

ఉదాహరణము—

క. పుట్టియు నల్తుము మూనెఁడు
గట్టిగ నాద్యుత్తరములు గా నీరాసుల్
పెట్టి యవి వెరసి యి ౹ వది
పుట్టులలోఁ బుచ్చి శేషము వెసం జెపుమా.

ఒడ్డు— ౧ ౨ ౪ ౬
౧ ౧౭ ౧ ౧
౪ ౨౦ ౧౬ ౦
౨౦ ౨ ౨౦ ౦
౧ ౬ ౪ ౨౫
౧౬ ౧ ౧౬ ౧౬

అపగతాదృశ్య యన్న సూత్రప్రకారము
కూడఁగాను ౧౭
౩
౭౦

ఈ రాసులు ౨౦లో బుచ్చఁగాను ఖ ౨౦ లో
పుచ్చిన ఖ ౧౫౪.

ఒంటేని

౧ ౧ ౨ ౩ ౪ ౬ ౨
౧ న । ౪ ౫
౧౯ ౪ ౩ ౨ ౧ । ౨
౦ — = ౬ । — ౧
౨౧
౧౬

కూడిన ఖ ౧౭౦౫౬

ఇవి భిన్నసంకలనవ్యవకలనంబులు.

ఇంక గుణకార భాగహారంబులకుం గరణ
సూత్రము.

క. భాగహారహారహృతిచే
భాగించిన భిన్నగుణకభాజకమునఁ జి
ద్భాగములు గీడ్పఁబచి యా
పై గణనావిధి ఘటింప భాగహార మ్మౌ.

ఉదాహరణము—

క. సగుణాంశరూపయుగళమా
నగాంశయుక్తద్వయంబునం బెంచినఁ బొ
ల్పుగ నర్ధంబు త్రిభాగము
న గుణించిన నేమి యగు జనప్రియచరితా !

ఒడ్డు— గుణ్యము ౧ గుణకము ౧
౧ ౧
౧ ౧
౩ ౮

గుణ్యము ౧ గుణకము $\frac{౧}{౩}$ గుణించిన ౫, $\frac{౧}{౬}$ ;

ఉద్దేశ్యము—

గీ. అయిదు సత్ర్యంశరూపద్వయంబుచేతఁ
ద్ర్యంశకముచేత మఱియు షడంశకంబు
పాలుగొని చెప్పుమా యవలీల బొమ్మ
లాట విరుపయు కాళేఁడు హర్ష మొంద.

ఒడ్డు— భాజ్యము ౫ భాజకము $\frac{౨}{౧}$ ;

భాజ్యము $\frac{౧}{౬}$ ; భాజకము $\frac{౧}{౩}$ ; లబ్ధములు

వరుసనె ౨
౧
౧ ౧ ౨
౮ ౨

ఇవి భిన్నగుణకారభాగహారములు.

భిన్నవర్గ వర్గమూల ఘన ఘనమూలంబులకుం
గరణసూత్రము—

క. ఒనరఁ గృతియందుఁ గృతులును
ఘనవిధి ఘనములును చేయఁగాఁ దగు హారం

బునకు లవంబునకును గృతి
ఘనపదములయందు వర్గఘనమూలంబుల్.

ఉదాహరణము—

క. పదళత్రయమున కిప్పుడు
ముదమున వర్గంబు దాన మూలము ఘనముల్
వదలక యాఘనమున ఘన
పదమును సాధించి యెఱుకపఱుపుము [మాకుల్.

ఒద్దు— ౩ ౧/౨, సవర్ణించిన ౭/౨; దీని వర్గవు ౪౯/౪, దీని వర్గమూలము ౭/౨;

ఇది భిన్నవర్గాదిచతుష్టయము.

ఇది భిన్నపరికర్మము.

శూన్యపరికర్మాష్టకంబునకుం గరణసూత్రము—మూఁడుపద్యములు.

క. ఖయములోన రాశి యవికృత [గుణం
మయినను ఖగుణంబు శూన్య మగు శూన్య
బయినట్టిరాశి శేషవి
ధి యున్నచోఁ బొడువకమ్మఁ దెలియఁగ [వలయున్.

క. సున్న గుణ మైనచో మఱి
సున్న హారం బేని రాశి శూన్యముగా కం
దు న్నిర్వికార మగుచును
సున్నం బాగ్గొన్నఁ జెల్లు శూన్యహరమునన్.

క. శూన్యములు ఖవర్గాదులు [యుగన్
శూన్యము సంగుణిత మగు్యు శూన్యంబ
శూన్యము క్షేపముతో సా
మాన్యం బై యుండు యుతిసమయమున [యంచున్.

ఉదాహరణము రెండు పద్యములు—

క. అయి దేమి యయ్యె ఖయుతం
బయి ఖోనితమై ఖనిఘ్నమై ఖావాప్తం
బయి వేఱువేఱ చెప్పు మి
వ్వి యొకో సున్నకును వలయు విన [వర్గాదుల్.

గీ. సున్న యైదింటఁ బెంచిన సున్నయందు
నైదు గూడినచో నేమి యయ్యె నింద్ర
సంఖ్య శూన్యంబుచేతఁ బెంచఁగ దళంబు
చేసి త్రిగుణించి ఖాప్తంబు సేయ నెంత?

ఒద్దు ౫ దీనితో ౦ గూడిన ౫; ఒద్దు ౫, దీనిలో ౦ సున్న పుచ్చిన ౫; ఒద్దు గుణ్యము ౫, గుణకము ౦, గుణించిన ౦, ఒద్దు భాజ్యము ౫; భాజకము ౦, భాగించిన లబ్ధము ౫, ఒద్దు ౦, వర్గవు ౦, ఒద్దు ౦, వర్గమూలము ౦, ఒద్దు ౦, ఘనము ౦, ఒద్దు ౦, ఘనమూలము ౦, ఒద్దు గుణ్యము ౦, గుణకము ౫, గుణించిన ౦; ఒద్దు ౦, దీనిలో ౫ గూడిన ౫, ఒద్దు గుణ్యము ౧౪, గుణకము ౦, క్షేపము దానిలో ౧/౨, గుణకము ౩, భాజకము ౦, లబ్ధము ౬/౩.

ఇది శూన్యపరికర్మాష్టకము.

గద్య

ఇది శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య ప్రబోధానంద శ్రీ చరణ సద్గురుచ్ఛాత్ర హారితసగోత్ర కొడూరి యెఱ్ఱయామాత్య పౌత్ర రాఘవసూరి పుత్ర కవిదేవేంద్రాపరనామధేయ సుజనవిధేయ సహజ ధైర్య వల్లభార్యప్రణీతం బైన లీలావతి యను పాటీగణితంబునందుఁ బరికర్మగణితము సమాప్తము.

వ. అనంతరంబ ప్రకీర్ణంబునందు విలోమజాతికిం గరణసూత్రము. రెండు పద్యంబులు.

గీ. హరము గుణముగ గుణకంబు హారముగను
ధనము ఋణముగ ఋణమును ధనము గాఁగఁ
గృతి పదంబుగ మూలంబు కృతిగ నిట్లు
దృశ్యమునయందుఁ జేయ సిద్ధించు రాశి.

గీ. స్వీయభాగసమేతవిశ్లిష్ట మైన
యట్టివ్యస్తంబునం జేసి యంశకాన్వి
తోనహారము హీనమై యుండు నంశ
మధికృతము శేషవిధిఁ జెప్పినట్టియదియె.

ఉద్దేశము —

మ. త్రిగుణం బైన నిజత్రిపాద
మయి ధాత్రీభృత్పరిచ్ఛిన్నమై
స్వగుణాంశోనితమై స్వనిఘ్న
మయి...శరంబై తదం?
బు గొనంగాఁ బడి సామజోన
యుతమై పొల్పార దిగ్భాజితం
బగుచున్ రెం డగు నెద్ది చెప్పఁదగు
నారా! రాశి యీ పేర్పడన్

ఒద్దు గుణకము – ౩, ధనము ౩/౪, హారము ౭, గుణము ౩ –/౩ వర్గవుల ఋణము ౫[illegible]

మూలధనము ౮, హారము ౧౦, దృశ్యము రెండు, యథోక్తకరణాన వచ్చిన రాశి ౨౮.

ఇది విలోమజాతి.

ఇష్టకర్మంబునకుం గరణసూత్రము—

గీ. కణఁగి యుద్దేశకోక్త (క్త ?) మార్గమున నిష్ట
మరసి యుక్తోన మాహతం బాహృతముగఁ
జేసి దృష్టిష్టహతి దాని చే హరింపఁ
గానఁ బడె రాశి యిది యొప్పఁ (యిష్టక)
[ర్మ మయ్యె.

ఉద్దేశము—

గీ. పంచహతము స్వత్రిభాగోనితము దశ
భాజితంబు రాశిపాదదళతృ
తీయయుక్త మగుచు నేయది చెపు మష్ట
షష్టి యయ్యె గణకసన్మతముగ.

ఒడ్డు— గుణకము ౫, స్వాంశము —/౩, హారము ౧౦. రాశ్యంశము ౧/౪, ౧/౨, ౧/౩, దృశ్యము ౬౮ ఇందును నిష్ట · శి ౩, ఇది పంచమహతము చేసిన ౧౫, స్వత్రిభాగము ౫, దీనిచేత నూనితము ౧౦, దశభాజితము చేసిన ౧, కల్పితరాశి ౩, దీని పాదదళతృతీయములు ౩, ౩/౨, ౧/౧; — ఇవి సమచ్ఛేదము చేసి తొల్తటి దశభాజితముతోఁ గూడిన ౧ ౭/౪, దీనిచేత దృష్టహతి ౨౦౪ పాలు గొన్న లబ్ధరాశి ౪౮ వర్గమూలాలు వచ్చిన ఉదాహరణమందును ఇష్టకర్మము పని చెయ్యదు. రాశ్యంశయుతోన మైన యుదాహరణమందును విలోమజాతి పని చెయ్యదు.

అంశజాత్యుదాహరణము—

ఉ. [1] అంబుజరాశిలోపల షడంశ
పురారియపంచమాంశతు
ర్యంబుల బొమ్మలాట విరుపాధిపు
కాళిఁడు హార్యజార్క హే
రంబులఁ బూజ సేసె గురురాజ
పదాబ్జము శేషపద్మష
ట్కంబునఁ జేసె నర్చితముగా
సకలాంబుజసంఖ్యఁ జెప్పుమా.

ఒడ్డు— ౧/౬, ౧/౩, ౧/౫, ౧/౪ — దృశ్యము ౬, ఇష్టరాశి ౧, కల్పించి పూర్వరాశిం దెచ్చిన రాశి ౧౨౦.

శేషజాత్యుదాహరణము—

సీ. [2] నరసన గంద్రనందనుఁ డైన యచ్యుత
దేవరాయని కృపాదృష్టిఁ జేసి
యాందోళికారూఢుఁ డగుచును నా బొమ్మ
లాట కాళఁడు వేడ్క నర్థరాశి
లో నాత్మగురునాథుఁ డైనకుమారతా
తాచార్యవర్యున కర్థ మిచ్చె
ద్విజులకు శేషత్రితయముల్ రెం డిడి
శేషపాదము కవిశ్రేణి కొసఁగె

గీ. స్నేహమునఁ దన చెలులకు శేషనవమ
భాగపంచక మంతయుఁ బంచిపెట్టెఁ
గవిమహేంద్రుని కర్పించి మిగిలినట్టి
వేయునూటపదా రెంత విత్తరాశి?

౦ ౧/౨, శే౦ ౨/౩, శే౦ ౧/౪, శే౦ ౫/౯

దృశ్యము ౧౧౧౬ ఇందు నొకటి యిష్టరాశిగాఁ గల్పించి భాగాలు శేషమునఁ బుచ్చి తేఁగాను ౧ ౧/౮, దీనిచేత దృష్టహతి ౧౧౧౬. పాలు గొన్న ద్రవ్యమానము ౨౦౦౮౮. ఇది విలోమజాతిక్రమాన నైనా సిద్ధించును.

విశ్లేషజాత్యుదాహరణము—

మ. [3] అలియూథంబునఁ బంచమాం
శము విహారార్థంబు నీపద్రుమం
బులకై యేఁగ శిలీంధ్ర
గంధములకై పోయెం ద్రిభాగంబు జా
దులకై తద్వివరత్రిఘాత మరిగెం
దోడ్తోన వేఱొక్క పు
ష్పలిహం బాడుచు నుండె వేడ్కఁ
జెపుమా సర్వాలిసంఖ్యానముల్.

ఒడ్డు— ౧/౫, ౧/౩, ౨/౧౫ × ౩ : ౬/౧౫;

దృశ్యము ౧ అలియూథము ౧౫.

సంక్రమణ విషమ సంక్రమణంబులకుం గరణ

1. 'అమలకమలరాశే' రిత్యాదిశ్లోకమున కాంధ్రీకరణము. మూలములోని రుద్రునిఁ బరిహరించుట యిందు విశేషము. 2. మూలములో లేదు. 3. 'పంచాంశోఽళికులాత్' ఇత్యాది శ్లోకమున కాంధ్రీకరణము. పుట ౮౧.

సూత్రము—

గీ. అంతరోనయుతార్ధితం బైనయుతియు
రాశియుగ మగు నిదియె సంక్రమణ మింక
విషమసంక్రమణము రాశి వివరభక్త
వర్గవివరంబు యుతిగఁ బూర్వంబునట్లు.

ఉదాహరణము—

క. ఏవాని యోగవియుతులు
భావింపఁగ భూమిదిశలు బాణతు మల్
నీ వారాసులు చెప్పం
గావలయును బొమ్మలాట కాఁడు
[మెచ్చన్.

ఒడ్డు—రాశి యోగము ౧౦, రాశ్యంతరము ౨౪, ఇందు వచ్చినరాసులు ౩౮, ౬౨.

ఉద్దేశము—

క. రాసులకు యోగ మెనిమిది
రాసుల వర్గద్వయాంతరము నన్నూ రా
రాసులపరిమితి చెప్పుము
కౌశలనిధి బొమ్మలాట కాఁడు మెచ్చన్.

రాశ్యంతరము ౮, వర్గాంతరము ౪౦౦, వచ్చినరాసులు ౨౧, ౨౯.

ఇవి సంక్రమణవిషమసంక్రమణంబులు.

మూలజాతికిం గరణసూత్రము—

గీ. సగుణదళవర్గమున దృశ్యము గనఁ బదము
గొని గుణార్ధంబు క్రమమునఁ గూడి పుచ్చి
వర్గువుగ నొనరించిన వచ్చు నంద
మొంద గుణకఘ్నములలోన యుక్తరాశి.

గీ. మఱియు నారాశి భాగసమన్వితోన
మయ్యె నే భాగయుక్తోన మయ్యె నొకటి
మూలగుణము దృశ్యంబునఁ బాలు పుచ్చి
వానఁ బూర్వోక్త...వలయు రాశి.

మూలోనదృశ్యజాత్యుదాహరణము—

క. జలము వెలువడియె సారస
కులమూలదశంబు లేదు గొబ్బున శేషం
బులు రెం డచట రమించుచు
నిలిచెం దత్సంఖ్య యెంత నిక్కము
చెపుమా.

ఒడ్డు— మూలగుణకము $\frac{౭}{౨}$, దృశ్యము $\frac{౭}{౨}$, ఇందు గుణదళవర్గువు $\frac{౪}{౧}$, $\frac{౯}{౬}$; ఇది దృశ్యముతోఁ గూడఁగాను $\frac{౮}{౧}$, $\frac{౧}{౬}$; దీనిమూలము $\frac{౯}{౪}$, ఇందున గుణార్ధము $\frac{౭}{౪}$ కూడిన ౪, వర్గించిన ప్రమాణం ౧౬.

యుతదృశ్యజాత్యుద్దేశము—

క. మేలుగ నేరాశిం దన
మూలంబులు తొమ్మిదియును మోదంబున స
మ్మేళింప నూటయిరువది
నాలుగుపదు లయ్యె నరసి నా కది చెపుమా.

ఒడ్డు— మూలగుణము ౯. దృశ్యము ౧౨౪౦. యుక్తప్రకారమున వచ్చినరాశి ౯౬౧.

భాగోనములోన దృశ్యజాత్యుద్దేశము—

చ. [1] మదమున హంసయూథపదముల్
పది స్వర్ణది కష్టమాంశ మిం
పొదవఁగ మెట్టతామరలపొంతకు
దిగ్గన లేచిపోయె న
య్యుదకమునందు వెల్వడక యుండె
రమింపుచు హంస లాఱు నె
మ్మది నెఱిఁగింపు హంసకులమానముఁ
గాఁడు సంతసింపఁగాన్.

ఒడ్డు— భాజ్యము ౦ $\frac{౧}{౮}$, మూలగుణము ౦ ౧౦, దృశ్యము ౬; మఱియు నారాశి భాగసమన్వితోన మన్నసూత్రక్రమమునఁ దెచ్చిన హంసకులమానము ౧౪౪.

ఉద్దేశకము—

మ. [2] అనిలోఁ బార్థుఁ డిషుప్రజాస్త్రమునఁ
బ్రత్యస్త్రవ్రజం బాగెఁ జ
య్యనఁ దన్మూలచతుష్టయంబున
రథాశ్వానీకముం జంపె శ
ల్యుని నాఱమ్ముల నొంచి మూఁట బలు విల్లున్
ఛత్రముం గేతువున్
దునిమెం గర్ణునిఁ గూల్చెఁబద్దొకటఁ దోడ్తో
నెన్ని యాబాణముల్.

౦ $\frac{౧}{౨}$, మూలగుణము ౪, దృశ్యము ౦౧౦, బాణమానము ౧౦౦.

1. 'యాతం హంసకులస్య' యనుశ్లోకమున కాంధ్రీకరణము. చూ. పుట ౧౧౯. 2. 'పార్థః కర్ణవధాయ' యిత్యాదిశ్లోకమున కాంధ్రీకరణము. చూ. పుట ౧౨౧.

భాగయుతమూలయుతదృశ్యజాత్యుద్దేశము
క. [1] పదునెనిమిది నిజపదములు
ముదమున రాశిత్రిభాగమును గూడిన ని
య్యది యయ్యె నూటయిరువది
పదు లిపు డా రాశి యెంతొ కపటంపుము [మాకుఁ.

ఒడ్డు— అంశము ౧/౩ మూలగుణము ౧౮, దృశ్యము ౧౨౦౦, ఇందుకు ౧ లో భాగము గూడిన ౩/౪, దీనిచేత మూలగుణమున్ను దృశ్యమున్ను పాలుఁ ద్రుచ్చి పూర్వప్రకారానఁ దెచ్చినరాశి ౫౭౬.

ఇది మూలజాతి.

అంశమూలజాతికిం గరణసూత్రము.
క. పద మంశము నదియుం ద [బ్రా
త్పదగు దృశ్యములు లవహతంబులుగాఁ
గుదితవిధి సిద్ధఫలముఁ [యుఁ
బదపడియంశంబు మోడఁ బాల్గొనవల
అంశమూలోనదృశ్యజాత్యుదాహరణము-
గీ. [2] అలికులార్ధఫలము నఖిలనవాష్టాంశ
కమును గూడి పొల్లకములు సేరి
భ్రమరయుగము తగులుపడి యుండెఁ [దమ్మిలో
రాత్రి యెల్ల మధుకరంబు లెన్ని?

ఒడ్డు— ౧/౯, అ— ౧/౨; మూలగుణము ౧౦, దృశ్యము ౨, లబ్ధాళికులమానము ౭౨.

అంశమూలయుతదృశ్యజాత్యుద్దేశము—
క. మదగజకులనవమాద్వయ
పదదశకము గజకులార్కభాగము రాశిం
గదియించి నూటపదునెని [యుకో.
మిది యయ్యెను గజకులంబు మితి యెంత

ఒడ్డు— భాజ్యము ౧/౧౨, అంశ ౨/౯, మూలగుణము ౧౦, దృశ్యము ౧౧౮, సూత్రక్రమానం దెచ్చినగజకులమానము ౭౨.

ఇది యంశమూలజాతి.

గద్య

ఇది శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య ప్రబోధానంద శ్రీచరణ సద్గురుచ్ఛాత్ర హారితస గోత్ర కోడూరి యజ్ఞయామాత్యపౌత్ర రాఘవసూరి పుత్ర కవిదేవేంద్రాపర నామధేయ సుజనవిధేయ సహజధైర్య వల్లభార్యప్రణీతంబైన లీలావతి యనుపాటీగణితంబునందుఁ బ్రకీర్ణకము సమాప్తము.

వ. అనంతరంబ త్రైరాశిక వ్యస్తత్రైరాశికంబులకుం గరణసూత్రము—
క. ప్రమితేచ్ఛలు సమజాతులు
ప్రమాణమున ఫలగుణేచ్ఛ భాగించిన ల
బ్ధము ఫలము నిచ్ఛకును వ్య
స్తమునందున వీడుపడుఁ జనుఁ బ్రమి [తేచ్ఛల్.

ఉద్దేశము—
క. [3] సదళపలద్వయమితమ్మగు
మద మిప్పుడు నిష్కసప్తమత్రయి కెలుఁగిం
చెద వే యీఘోరణిఁ దో [మయ్యెన్.
మ్మిదినిష్కంబులకు నెంత మృగమద

ఒడ్డు— ప్రమాణరాశి ౩/౭; సవర్ణించిన ౫/౨; ఇచ్ఛారాశి ౯/౧ లబ్ధఫలములు ౫౨ కర్షలు [౨

ఉదాహరణము—
క. [4] ఇల నర్వ్యదిమూఁడుపలం
బుల జవ్వాదికి యుగాబ్ధిభూసంఖ్యము లీ
విలువను బాదద్వాదశ [బుల్.
పలంబులకు నెన్ని యీయఁబడు నిష్కం

ఒడ్డు—
క. కల విచట రెండుదమ్మం
బులకును ముయ్యాఁబద్రోణములు [ముద్గంబుల్.
విలువ వలయు డెబ్బది పణ
ములరాశిం జెప్పు మెన్ని మూలము లయ్యెన్.

ప్రమాణరాశి యిచ్ఛారాశితోడను సమజాతిగా జేసికొనుటకు ప్రమాణదమ్మాలు పణాలు

---

1. 'యో రాశి రష్టాదశభి' రిత్యాదిశ్లోకమున కాంధ్రీకరణము. పుట ౧౧౮.
2. 'అళికులదళమూల' మనుశ్లోకమున కాంధ్రీకరణము. చూ. పుట ౧౨౩.
3. 'కుంకుమస్య సదళం' ఇత్యాది శ్లోకమున కాంధ్రీకరణము చూ. పుట ౧౨౫.
4 'ప్రకృష్టకర్పూర' ఇత్యాదిశ్లోకమున కాంధ్రీకరణము చూ. పుట ౧౨౩.

చేసిన ౩౭. ఫలరాశి ద్రోణాలు ౧౮. ఇచ్ఛారాశి పణాలు ౨౦. లబ్ధఖారికలు ౭, ద్రోణములు ౨, ఆఢకము ౧ ప్రస్థములు ౭.

ఉద్దేశము—

సీ. అచ్యుతదేవరాయల వసంతభాగ్య
మునకు వచ్చినయర్థి జనుల కిడిన
గూవిందుకై బొమ్మలాట కాళవిభుండు
తాను దెప్పించినతండులములు
నలువదియేను పుట్లమీఁదఁ బదుసైన
మందుముఁ బదియేను మానికలకు
నేడ్తుము కుంచెఁడు నేడుసోలలును గి
ద్దంటికి వడ్లు పుట్టెంటి లెక్క
గీ. నతని కరణంబు గొలిపించె నగరి బియ్య
మిడినబేహారులకు నవి యెన్ని యయ్యెఁ
దెలిపి వడ్లకు సరి చూపవలయు మాకు
వెండియును రెండుతెఱఁగులతండులములు.

ఒడ్డు వ్రాసేలాగు—

౨
౭౦ ఇది సవర్ణించిన ౫
౧
౪ సవర్ణించిన ప్రమాణరాశి ౩౨౨ ౧
౨
౬
౧
౪

| | | | |
|---|---|---|---|
| ఫలరాశి | ౪ | ౫ | ఇది సవర్ణించిన |
| | ౧ ౧ | ౮ | |
| | ౭ | ౦ | ౧౪౨౦౩ |
| | ౧ | ౫ | |
| | ౧ | ౬ | ౩౭౦ |

ఇచ్ఛాఫలము— పుట్లు ౧౭౪. తూములు ౧౬౦.

ఇచ్ఛారాశి యిచ్ఛాఫలముగాఁ దెచ్చి సరి చూపు నిమిత్తము క్రమ్మఱ ఒడ్డు ప్ర ౧ ఫలరాశి సవర్ణించి యపవర్తించినది ౩౨౨.

| | | |
|---|---|---|
| ఇచ్ఛారాశి | ౧౭౪ | |
| | ౧౬ | ఇది సవర్ణించిన ౪— |
| | ౭౦ | |

సవర్తించిన ౬ $\frac{౭}{౫}$ ౪; ఇచ్ఛాఫలము

బియ్యముపుట్లు ౪౫. తూములు ౧౮. మానికలు ౧౫. ప్రమాణరాశి ఇచ్ఛాఫలముగాఁ దెచ్చి సరి చూచే నిమిత్తము క్రమ్మఱను ఒడ్డు సవర్ణించి సవర్తించిన ప్రమాణరాశి

౧౪౩౦౩ } ఇచ్ఛారాశి ౧.
౩౭౦ }

యథోక్తకరణాన వచ్చిన యిచ్ఛాఫలము బియ్యము తూములు ౨; కుంచము ౧; సోలలు ౨; గిద్ద ౧.

ఉద్దేశము—

సీ. మొగిఁ బ్రజారాజాంశయును నాల్గుపు శైన
రాజాకుం బందుము ప్రజకు నేడ్తు
మామీఁదఁ బుట్లకైన.........
నిరస వసుంధరాధీశ్వరునకు
నంతియు ప్ర· కగు నటమీఁదఁ బుట్టికిఁ
బదిమానికెలఁ మహీపాలునకును
బ్రజ కేనుమానికల్ గ్రమ్మఱ నది కొల్వ
నొదవుఁ బుట్టికి నల్తు ముపచయంబు
గీ. గోరి తూమునఁ గ్రమ్మఱఁ గొల్చినట్టి
పుట్టి పిన్నతూమునఁ గొల వట్టుకొన్నఁ
బుట్లు రెండగు నధికారిపురుషు లవియు
వెచ్చపెట్టిన నేఁగు...చ్చు నందు.

సీ. అర్థుల కవసరం బైనచో మనబొమ్మ
లాట కాళఁడు దయ నాత్మభాగ
కలమరాసులు మూఁడు గొలిపించెఁ దొమ్మిది
మానలు తూము...నాల్గు...?
తూములు తక్కగాఁ దొమ్మిదియును నైదు
నిరువదిపుట్లను నివియుఁ గాక
పాలు పంపనియట్టికాలిరాసులు మఱి
యున్నాట డెబ్బది యేడు పుట్లు.
గీ. నలుతుముం బదియేడు పుట్లులును నాఱు
తూములును నిరసయును నద్భుతము గాఁగ
సరవి నీరాసులకు సమాంశంబు లైన
కళములందు ఘటిల్లుపంటలు లిఖింపు.

| | | |
|---|---|---|
| ఒడ్డు— | ౮ | ౪ |
| | ౧ | ౧ |
| | ౧౯ | ౧౯ |
| | ౭౦ | ౭౦ |
| | ౨ | |
| | ౧౬ | |

| | | | |
|---|---|---|---|
| ఒంటేని | ౯ | ౨౩౭ | ౧౭ |
| | ౧ | ౧ | ౧ |
| | ౦౯ | ౮ | ౬ |
| | ౩౨౦ | ౨౦ | ౨౦ |
| | | | ౨ |
| | | | ౮ |

వ. రాచభాగము ఆయాలుఁ గూడి పిన్నతూమున వ్రయపుపాత్ర సైతము పుట్లున్ను ౬ తూములు 3 న్ను కుంచాలు మూఁడున్ను అయిన ప్రమాణరాశి—పుట్టికి ఫలరాశి కోరి తూమునపంట పుట్లు ౮. ఈలాగుననే యామీఁదఁ బ్రమాణరాశిపుట్లు ౭, తూములు ౭, మానిక ౧, ఫలరాశిపుట్లు ౬, ఆమీఁద వ్రయము ప్రమాణరాశి ౧ తూములు ౬ కు ౧, సో 3, ఫలరాశి పుట్టి ౧, ప్రజారాజ భాగములు ఆయాలు గూడి వ్రయానకు వ్రయపుపాత్ర సైతము పిన్నతూమునఁ బ్రమాణరాశి పుట్లు ౧౧, తూములు ౧౫, మానలు ౨, ఫలరాశి కోరి తూమున పంట పుట్లు ౮, ఆమీఁద ప్రమాణరాశి పుట్లు ౧౬, తూములు ౧౮, మానికలు ౨, దీని ఫలరాశిపుట్లు ౬, ఆమీఁద ప్రమాణరాశి పుట్లు ౨, తూములు ౧౧, కుంచాలు 3, మానిక ౧, గిద్దెలు ౨, ఫలరాశి పుట్టి ౧ కి యీప్రమాణఫలరాసులవల్లనున్ను ఒంటేని యిచ్ఛారాసులవల్లనున్ను తడఁబడక తెచ్చి పంట కోరి తూమున వరసనే పుట్లు ౬; రెండో పంట పుట్లు 3, తూములు ౮, మూఁడోది పుట్లు ౧౮, నాలుగవది పుట్లు ౧౦౬; అయిదోది పుట్లు ౬, ఈప్రకారము తెలిసి యుక్తిమంతుఁ డైనవాఁడు పని గల తావుల యోజించుకు నేది—

ఉదాహరణము—

గీ. మూఁటి కొక్కండుఁ దాఁ బదమూఁడు చేసి
పండ్లు గొని యమ్మె మూఁడేసి పదియు [మూఁడు
గవ్వలకు మామిడివిధానఁ గలిగెఁ బదియు
మూఁడు ద్రమ్మముల్ లాభంబు [మూలమెంత.

ఒడ్డు— గవ్వప్రమాణము 3, ఫలం ౧౩, ఇచ్ఛ ౧, ఇచ్ఛాఫలరాశి పండ్లు $\frac{౧౩}{3}$; ఇది యొక త్రైరాశికము.

ప్రమాణరాశి పండ్లు 3, ఫలరాశి గవ్వలు ౧3, ఇచ్ఛారాశి పండ్లు $\frac{౧3}{3}$ } ఇచ్ఛాఫల గవ్వలు ౧౬౯; ఇది రెండవ త్రైరాశికము. ఇందులో మొదలిగవ్వ యొకటి పుచ్చిన ప్రమాణరాశి ౧౬౦, ఫలరాశి మూలము గవ్వ, ఇచ్ఛాఫలరాశి లాభము ౯ గవ్వలు ద్రమ్మాలు ౧౩ కి - సమజాతీకరించి పెట్టిన ౧౬౦ - ఇచ్ఛాఫలము మొదలి గవ్వలు ౯౩౬.

ఉదాహరణము —

క. ఏడు దివసంబులకుఁ బది
యే డాదాయముగ వచ్చె నెనిమిదినాళ్లం
దోడన పదునెనిమిదిగా
మాడలు నూఁటిచ్చి చెప్పుమా యెన్నాళ్లుఁ.

ఒడ్డు— ఆదాయానకు ప్రమాణరాశి దినాలు ౭, ఫలరాశి మాడలు ౧౭, రాశి ౧, ఇచ్ఛాఫలము మాడలు ఆదాయము $\frac{౧౭}{౭}$ } ఒడ్డు-

వ్రయానకు ప్రమాణరాశి దినాలు ౮, ఫలరాశి మాడలు ౧౮ ఇచ్ఛారాశి దినము ౧, ఇచ్ఛాఫలము వ్రయం మాడలు $\frac{౯}{౪}$ } ఈవ్రయము నాదాయములోఁ బుచ్చిన

శేషము $\frac{౫}{౨౮}$ } ఇది ప్రమాణరాశి ౭ ఫలరాశి దినము ౧. ఇచ్ఛాఫలరాశి నిల్వమాడలు ౧౦౦, ఇచ్ఛాఫలం యేను ౧, నెలలు ౬ దినాలు ౨౦. తక్కిన యెడలనునీలాగున నేయుక్తి తెచ్చుకొనేది

ఇది త్రైరాశికము.

వ్యస్తత్రైరాశికలక్షణానకు సూత్రము-

గీ. ఎచట నిచ్ఛ దఱుగు నేనియు ఫల మెక్కు
నొండె యిచ్ఛ దఱుగుచుండె నేనిఁ
దఱుగుచుండు ఫలము త్రైరాశికవ్యస్త
భావ మచట నను వుపఱుపవలయు.

వ. అది యెట్లనిన-

గీ. జవములకును యవస్థితిఁ జేసి విలువ ?
గాంచునెడ వన్నె వెంబడిఁ గనక మెత్తు
నపుడు రాసులు భాగించు నచట వలయుఁ
బ్రకటముగ వ్యస్త త్రైరాశికక్రమంబు. ?

ఉదాహరణము—

సీ. నిష్కముల్ నాలుగెన్మిదులు షోడశవర్ణి
కయ్యునే వింశతిహాయనముల

యాఁటదానికి నెన్ని యగు రెండుచుక్కలు
దున్నయట్టి యెద్దునకు విలువఁ
గావింప నాల్గుటంకము లయ్యెనే దుక్క-
లాఱు దున్నిన దాని కయ్యె నెన్ని
దళవర్ణ జాంబూనదం బొక పలిమెఁడు
వలయుచోఁ బదియేను వన్నెపసిఁడి
గీ. యెంత యీయవలయు నిరసయఁ [దూమునఁ
బట్టి కొలువ నైగుప్పుట్లు లైన
కొల్చురాశి యైదుకుంచాలతూమున
నేపు మీఱి కొలువ నెన్ని యయ్యె.

ఒద్దు— ౧౬, ౩౨, ౨౦౯ లబ్ధము ౨౫, ఒద్దు ౨, ౪, ౬ లబ్ధము ౬, ఒద్దు ౧౦, ౧, ౧౫ లబ్ధము— $\frac{౨}{౩}$ ఒద్దు ౯, ౫, ౫. లబ్ధము ౯.

గీ. మూఁడుపిడియలోఁతు మున్నూటయిరువది
యొక్క బారల్రోవి యరయఁ బడ్డ
నాల్గుపిడెలలోఁతునకు నెంత లెక్క సే
యంగ వచ్చుఁ గాళహస్తి మెచ్చ.

ఒద్దు— ప్రమా ౩, ఫలము ౩౬౧, ఇచ్ఛ ౩, వ్యస్తత్రైరాశికసూత్రాన వచ్చిన యిచ్ఛా ఫలము $\frac{౨౯౦}{౩}$

ఇది వ్యస్తత్రైరాశికము.

పంచరాశికములకుం గరణసూత్రము-

క. వితత......ఛేదకముల
నితరేతరభిత్తులందు నిడి......రాశ్యా
హతి యరసి యల్పరాశ్యా
హతిచేఁ గొనఁ బంచరాశికాదుల ఫలముల్.

ఉద్దేశము—

గీ. వడ్డి నూటికి నెల కైదు వన్నె లేని
యబ్దమున కెన్ని యగుఁ బదియాఱిటికిని
గాలవృద్ధులచేఁ దెమ్ము మూలధనము
మూలవృద్ధులచేఁ దెమ్ము కాలమితము.

ఒద్దు ౧ ) ౧౨ ) లబ్ధవృద్ధి $\frac{౪౮}{౫}$,
౧౧౦ } ౧౬ }
౫

కాలానయనార్థము క్రమ్మఱ ఒద్దు

౧ ) ౧౦ ౬ )
౧౦౦ } }
౫ ) ౪ ౮ )

లబ్ధమాసాలు ౧౨, మూలధనానయనార్థము క్రమ్మఱ ఒద్దు.

౧౩౦ ) ౧౨
౫ } ౦ లబ్ధమూలధనము ౧౬.
) $\frac{౪౮}{౫}$

క. నలువదినాళ్లకు నూటికిఁ
బొలుపుగఁ బంచమసహితబాణములు
చ లవటిక త్రిమానం [వచ్చినఁ బం ?
బుల కర్థాన్వితకరాంగముల కెంత యగుకా.

ఒద్దు— ౪౦ ) ౯౬ ) లబ్ధవృద్ధి ౯
౧౦౦ } ౧౨౬ } ౧
౨౬ ) ౦ } ౪
౪౦ ) ౫

ఉద్దేశము-

చ. మునిగుణితాక్షివర్ణ మగుముప్పదిచిన్నము [లెత్తుకాంచనం
బునకు దశాధికాష్టగుణముల్ వెల చెప్పిన [రెండుమాడ లె
త్తిన మితవర్ణహేమమున కెన్నగు రూకలు [నన్నె విల్వలం
దనగఁ నెత్తు మూల్యతులనంబు లవెన్ని యొ [యెన్ని చెప్పుమా.

ముప్పది చిన్నము లనఁగాను మూఁడుమాడలు-

ఒద్దు— ౧౪ ) ౧౨ ) లబ్ధరూకలు ౨౨
౩ } ౨ )
౯౯ } ౨
౨ ) ౦

తౌల్యజ్ఞానార్థము- ౧౪ ) ౧౨ ) లబ్ధతౌల్యము ౨
౩ } ౦ }
౯౯ } ౨౨ }
౨

వర్ణజ్ఞానార్థము- ౧౫ ) ౦ ) లబ్ధవర్ణము ౧౨
౩ } ౧౨ }
౯౯ } ౨ }
౨

ఇది పంచరాశికము. (సశేషము)

Edited and Published by T. Ramachandra, 2/583 Pycrofts Road, Madras 5,
Printed by G. Bhavanarayana at the Weldun Press, 146, T. H Road, Madras-21.

(87 వ పుట తరువాయి)

"...యించుక భేదము లేక యాయనే
మే మయి యున్నవారము సు
మీ వికచాంబుజపత్రలోచనా!"

మహిళల మనస్సును వర్ణించడంలో తిమ్మక్కదే పై చేయి. స్త్రీల మనస్సు స్త్రీలే బాగా గ్రహించగల రనుకుంటాను.

ద్రౌపది స్వయంగా సుభద్రార్జునుల పెండ్లి సన్నాహం చేసి, పడకటింటి సింగారం చేసి తర్వాత పడిన ఆవేదన, సమాధానం ఎంత వాస్తవంగా వర్ణిస్తుంది తిమ్మక్క!

1 "తలపోసె మనసులో తాళంగ లేక
యేమి వస్తువులైన నియవచ్చు గాని
ప్రాణేశు నిచ్చి మరి బ్రతుకంగ రాదు!
అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుని
చెల్లెలు గనక నే నోళ్ల ననరాదు
అది గాక సభలోన ఆ కౌరవులకు
మానభంగము కల్గు హీనకాలమున
మానధన మొసగిన మాహాత్మ్యశాలి
అటువంటి శ్రీకృష్ణు కనుగు చెల్లెలట
అని తలపోసెతా అతివ మోహించె."

అర్జునుని చేరబోయే సుభద్ర వేషం ఆనాటి అందచందాలను, సంప్రదాయాన్ని మనకు తెలుపుతుంది. సుభద్రను...

2 "పన్నీట స్నానంబు బాగుగా నార్చి
తడిబోసి కట్టించె ధవళవస్త్రమ్ము
విసనకఱ్ఱలగాలి వీచి యిరుదెసల
పాసంగగా తడియార్చె పొలతి శిరస్సు
ధూపవాసనలలో దులిపి యల్లార్చి
కొజ్జంగి రేకులు కొప్పున దురిమె
నొడ్డాణమును బెట్టె నూగాదు మొలను
ఓళ్ల మొలనూళ్లు బిగిసి మ్రోయగను
ఘంటల మొలనూళ్లు ఘల్లున మొరయ
కంఠహారమ్ములు కౌస్తుభమణులు
కాలి పెండెము గూర్చె ఘనతతో నాతను
అందెల దిద్దె నా యతివ సుభద్ర
తరుకు మించిన సందిదండలపైని
నెలవంక తాయితుల్ నెలఁ బుట్టగట్టె
శ్రీకారములతోడ నెలఁగెడు చెవుల
కమలాక్షి పంజుల కమ్మలే పెట్టె
సొమ్ము లన్నిటిమీద శోభిల్లునట్టి
నాడు వేలుం జేయు ముక్కర పెట్టె
కుంకుమ గంధము గూర్చె నాయింతి
గోవకస్తురి బూసి కోమలాంగి మేన."

ఈ వేషంలో వున్న సుభద్ర లేపాక్షి చిత్రశాలలోని రాణివిగ్రహంవలె కనిపించదూ?

తిమ్మక్క అర్జునుడు కర్తవ్య నిష్ఠుడు. విజయవిలాసంలోని అర్జునునివలె ఎక్కడికక్కడే విరహవేదనలతో ప్రాయశ్చిత్తరూపమైన తీర్థయాత్రను మరచిపోయేవాడు కాడు. తిమ్మక్క తన కథను సుభద్రార్జున సమాగమంతో ముగించి కథాకథనచాతుర్యం చూపించింది.

స్త్రీల నోళ్లలో నలిగిన ఈ పాటను ఆదరించి ప్రకటించిన శాస్త్రిగారికి ఆంధ్రమహిళాలోకం కృతజ్ఞమై వుంటుంది. శాస్త్రిగారి మార్గాననే తక్కిన స్త్రీలపాటలను వాటి అందచందాలు తెలుపుతూ ప్రకటించడం అవసరం.

1. సుభద్రాకల్యాణం, 54 వ పుట. 2. సుభద్రాకల్యాణం, పుట 51.

---

(88 వ పుట తరువాయి)

రోజూ రాత్రి చాల పొద్దు పోయేవరకు వారి సన్నిధానంలోనే గడచి పోయేది. 'ఇక వెళ్లు. నిద్రపో. నేను పడుకుంటాను' అనేవారు. నిద్రంటే వారికి మహాసరదా. నాలుగైదు నిమిషాలకు గురక వినిపించేది. ఏమిటీ ఆశ్చర్యం? పగలంతా పని తీరిక లేదు. రోగాస్తుల రాయిడి. ఎన్ని వ్యాపృత్తులు? ఎంత వ్యాకులత? అయినా ఇంతటి సుఖనిద్ర రావడం ఎలా? — అనే సందేహం చాల కాలం ఉండేది. కాని లోకమాన్య బాలగంగాధర తిలక్ జీవితం చదివిన తర్వాత నా సందేహం నివృత్తి అయింది. లోకమాన్యునికి ద్వీపాంతరవాసశిక్ష విధించినపుడు ఆయనను బర్మాకు తీసుకొని వెళ్లారు. ఆయన రైలెక్కి కూర్చున్న పదినిమిషాలకే గాఢనిద్ర పట్టిందట. గుర్రు వినిపించిందట. కాపలా వున్న బ్రిటిష్ పోలీసు అధికారులు ఆశ్చర్యపడ్డారట. ద్వీపాంతర వాస శిక్ష పొందిన ఈ వ్యక్తికి నిద్ర ఎలా పట్టిం దని. అదే లోకమాన్యుని నిర్మలత్వం, నిర్వికారత్వం. శాస్త్రిగారు కూడ అట్టి స్థితప్రజ్ఞులే!

శాస్త్రిగారు చెన్నపురికి విచ్చేసినప్పు డెల్లా నా యింటిని పావనం చేసేవారు. వారి రెండవ మూడవ వర్ధంతి నా యింటనే జరిగింది. వారి దివ్యసంస్మృతికి సాష్టాంగ ప్రణామాలు.

సంవత్సరం చందా : ఆరు రూపాయలు



ప్రాప్తిస్థానం :

భాషా సేవక సమితి,
2/583, పైక్రాఫ్ట్స్ రోడ్,
తిరువల్లిక్కేణి, మద్రాసు-5.